# చతుర

సంపుటి : 7 ఆగస్ట్ 1984 సంచిక : 7


## ఈ నెల సమగ్ర నవల

"ఊరంతటికీ అందగత్తెవి. కాలేజీలో చదువుతున్నదానివి. మరి నీకు బాయ్‌ఫ్రెండ్స్ లేరంటే నేనెలా నమ్ముతాను. నిజంచెప్పు... నువ్వెవర్నీ ప్రేమించలేదా...? నీకు ప్రేమలేఖలేం రాలేదా...?" నవదంపతులు తొలిసారిగా శోభనం గదిలో కలుసుకున్నప్పుడు భర్త భార్యను సూటిగా అడిగిన ప్రశ్నలివి. అందుకామె ఇచ్చిన సమాధానానికి ప్రతిఫలం చెంపదెబ్బ... పరిణామం....




...గా మారిన ఆమె జీవితం! ఆ జీవితాన్ని వెలుగుతో నింపుకోవటానికి ఆమె చేసిన ప్రయత్నం ఎలాంటిది?

## వక్కలంక పద్మావతి

ఆధునిక జీవిత వ్యవస్థలోని వెలుగుచీకట్లను చిత్రిస్తూ రచించిన "నిశీధి గీతం" ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం: ప్రవీణ్ కుమార్

2వ, 3వ కవర్లు: కె. గోపి

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటె తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగాని, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్ల ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా దూసుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలని, సూక్ష్మజీవులని తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుండి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారి భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!**

# బబుల్ గమ్ పోటీ!



ప్రస్తుతం చాలా మంది పిల్లలకి 'బబుల్ గమ్' నమిలి బుడగలు తెప్పించి, వాటిని పగలగొట్టడం గొప్ప వినోదం అయింది! అన్నింటిలోనూ పోటీలు జరిపినట్టే 'బబుల్ గమ్' పోటీ కూడా ఏర్పాటు చేశారు. 'బిగ్ ఫన్ ట్రోఫీ' అనే పేరుతో ఈ పోటీ మద్రాసులోని చర్చిపార్క్ కాన్వెంట్ స్కూల్‌లో జరిగింది.

ఒక్కొక్క బాలుడు లేక బాలిక బబుల్‌గమ్ నములుతూ వేదిక మీదికి రాసాగారు. వేదిక మీద నిలబడి, నోట్లోంచి బుడగ తెప్పించి ఊపిరి బిగబట్టి, నోటితో గాలి వూది బుడగను వీలైనంత పెద్దది చేస్తుంటే ఆ బుడగను కొలవడానికి వేదిక మీద స్కేలు పట్టుకుని ఒకావిడ సిద్ధంగా నిలబడి వుంది. బుడగ కొంత పెద్దదై, పగిలిపోతుంటే ఆ ప్రదర్శన చూస్తున్న ప్రేక్షకుల నవ్వులు అక్కడ ప్రతిధ్వనిస్తున్నాయి.

ఆ 'గమ్ ప్రోడక్ట్స్' సేల్స్ ఆఫీసర్ ఈ పోటీని నిర్వహించాడు. "మైలాపూర్‌లోని లేడీస్ క్లబ్ సభ్యులు కొందరు మాదగ్గరికి వచ్చి స్కూలు పిల్లలు పాల్గొనేందుకు ఒక ఆట లాంటి పోటీని సూచించిపెట్టమని కోరారు. మామూలుగా డిబేట్, వ్యాస రచన లాంటివి నిర్వహించే బదులు ఏదైనా కొత్తరకంగా వుండే పోటీ అయితే బాగుంటుందని మేము భావించాము. ఆవిధంగా మేము కొంత ఆలోచన తర్వాత ఈ పోటీని

రూపొందించాము" అని వివరించా రాయన.

దీనికన్నా ముందు బాలల సృజ నాత్మక శక్తిని వెల్లడించే మరో పోటీ జరిగింది. ఒక బాలుడు రెండు వాక్యాలు చెప్పి కథను ప్రారంభిస్తే, దాన్ని అందుకుని మరో బాలుడు రెండువాక్యాలు చెబుతాడు. అలా ఒక్కొక్కరూ రెండు వాక్యాలు చొప్పున చెప్పుకుంటూపోతే ఆఖరి బాలుడు రెండు వాక్యాలతో ఆ కథను ముగిస్తాడు.

రెండవరోజున జరిగిన బబుల్‌గమ్ బుడగల పోటీలో పదముగ్గురు పిల్లలు పాల్గొన్నారు. ఒక్కొక్కరికి మూడు అవకాశాలిచ్చారు. కాని, చాలామంది కనీసం గోలీ అంత పరిమాణపు బుడగను కూడా తెప్పించలేకపోయారు. రోజరీ స్కూల్లో చదివే అనూరాధ అనే పాప మొదటి రెండుసార్లు పెద్ద బుడగలనే తెప్పించింది కానీ మూడోసారి విఫల మైంది.

గోవిందరాజన్ అనే బాలుడు మొదటి రెండుసార్లు సరిగ్గా చేయలేకపోయినా, చివరి ప్రయత్నంలో అతను ఫుట్‌బాల్ అంత పరిమాణంగల బుడగను ఊది ఈ పోటీలో ప్రథమ బహుమతి గెలుచు కున్నాడు.

## వెల్లుల్లి ఉపయోగం

5 వేల సంవత్సరాల క్రితంనుంచే వెల్లుల్లి మానవ వినియోగంలో వుందని చారిత్రక గ్రంథాలనుబట్టి తెలుస్తోంది. ప్రత్యేకంగా గ్రీకులు, రోమనులు తమ ఆకర్షణీయమైన ఆకారానికి వెల్లుల్లే కారణమని నమ్మేవారు.

సగటున ఓ అమెరికా దేశీయుడు ఏడాదికి 2 పౌన్ల వెల్లుల్లి తింటాడని అంచనా. వెల్లుల్లి తినడంలో థాయ్ లాండ్‌తో ఇతర దేశమేదీ పోటీపడలేదు. థాయ్‌లాండ్ ప్రజలు సగటున సంవత్స రానికి 20 పౌన్ల వెల్లుల్లి తింటున్నట్టు ఓ అంచనా.



వెల్లుల్లి మనిషి ఆరోగ్యానికి మంచి దేయడమేకాక అది ఇతర కూరగాయలు, మొక్కలు చక్కగా పెరగడానికి దోహదం చేస్తుందికూడా! వెల్లుల్లిని గులాబీమొక్క కుదురులో పాతిపెడితే గులాబులు పెద్దగా పూస్తాయి. వెల్లుల్లి రసాన్ని తీసి, దాన్ని ఓ బాల్చీడు నీటిలో కలిపి ఓ రాత్రి అంతా వుండనివ్వాలి. మరుసటిరోజు ఆ నీటిని క్రిమికీటకాలు చేరిన మొక్కలపై చల్లితే, మొక్కకు పట్టిన క్రిమికీటకాదులన్నీ రాలిపోతాయి.

ప్రాచీనకాలంలో వెల్లుల్లి రసం తీసి, నొప్పెడుతున్న అవయవాలకు రాసి, నొప్పినుంచి ఉపశమనం పొందేవారు. జలుబు, గొంతునొప్పి, పంటినొప్పులను నివారించడానికి కూడా వెల్లుల్లిని ఉపయోగించేవారు. మొదటి ప్రపంచయుద్ధ సమయంలో గాయపడ్డ సైనికులకి చికిత్సలో భాగంగా వెల్లుల్లిరసం కలిపిన నీటిని ఇచ్చేవారు. ప్రస్తుతం కేన్సర్ నివారణలో వెల్లుల్లిని ఉపయోగించటంపై ప్రపంచ వ్యాప్తంగా పరిశోధన జరుగుతోంది.

ఇటీవల అమెరికాలోని కాలిఫోర్నియా నగరంలో వెల్లుల్లి ప్రదర్శన జరిగింది. మూడురోజులపాటు సాగిన ఆ ప్రదర్శనను చూడ్డానికి 1 లక్ష 10 వేలమంది వచ్చారు. ఆ ప్రదర్శనలో వెల్లుల్లినుంచి తయారుచేసిన 'గార్లిక్' అనే సుగంధ ద్రవ్యాన్ని ప్రదర్శించారు. సాధారణంగా మనుషులు వెల్లుల్లికున్న ఘాటు వాసనను బట్టి దానికి దూరంగా వుంటారు. కాని వింతగా ఈ 'గార్లిక్' సుగంధద్రవ్యం ఆహ్లాదకరమైన సువాసన కలిగివుంది. దీంతోపాటు వెల్లుల్లి ఐస్‌క్రీమ్‌లాంటి వేర్వేరు ఐటెమ్స్‌ని ప్రదర్శించారు. వెల్లుల్లితో చేసిన జెల్లీకూడా జనం మెప్పు బాగా పొందింది.

## తలుపులు, తాళాలు లేని గ్రామం

దాదాపు 300 ఏళ్ళుగా ఒక గ్రామమంతా తలుపులు, గేట్లు, తాళంకప్పలు లేకుండా వుంటోందనే విషయం ఎవరికీ నమ్మశక్యం కాదు. కాని నిజంగానే మహారాష్ట్రలోని అహ్మద్ నగర్‌కి ఆగ్నేయంగా 40 కిలోమీటర్ల దూరంలో 'షింగ్నాపూర్' అనే అలాంటి వింత గ్రామం వుంది.

వెయ్యిమంది నివసిస్తున్న ఆ వూళ్ళో దొంగతనం,బందిపోటుదొంగతనాల్లాంటివి ఒక్కసారి కూడా జరగలేదు. ఆ వూరివాడైన ఎనభైయ్యేళ్ళ వృద్ధుడు సోనప్పకాదవ్, 'ఇంటికి కన్నం వేయడం దొంగతనం, బందిపోట్ల దాడి లాంటి సంఘటనలు అక్కడ జరగడం తన జీవితంలో ఎప్పుడూ చూడలేదని' చెప్పాడు.

ఆ వూరికి గుండెకాయలా వుండే శనీశ్వరాలయంలో సంవత్సరానికి రెండుసార్లు జరిగే 'జాతర' ఉత్సవాల సమయంలో తప్ప 'షింగ్నాపూర్'కి పోలీసుల అవసరమే కనబడదు. దేవుడంటే భయంగల ఆ పల్లెప్రజలు ఇప్పటికి కూడా ధనం, ఆభరణాలను మూతలులేని మట్టికుండల్లో పెట్టుకుంటారు

తమ విలువైన నగలు, పొదుపుచేసిన డబ్బును కాపాడేందుకు తాళం వేసిన అలమరలు, ఇంటికి తలుపులు లేవన్న ఆలోచనలు మనసులోకే రాకుండా నిర్భయంగా ఆ పల్లె ప్రజలు తమ పొలాలు,




వ్యవసాయ క్షేత్రాలలో పనులు చేసుకుంటుంటారు.

తమకు శనిదేవుడి ప్రత్యేకానుగ్రహం వుందని, ఏమొచ్చినా శనిదేవుడే తమనూ, తమ ఆస్తినీ కాపాడతాడని మొత్తం వూళ్ళో వాళ్ల నమ్మకం.

శనీశ్వరాలయం మహారాష్ట్రలోని ఇతర ఆలయాల్లా వుండదు. బహిరంగ ప్రదేశంలో వున్న ఓ పెద్ద రాయిని 'శనీశ్వరుడి'గా కొలుస్తారు. ఆ బండరాయికి చుట్టుపక్కల కొన్ని చెట్లు వుంటాయంతే! అక్కడ గుడిగాని, కనీసం కప్పుగాని నిర్మించడానికి చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయి. బండరాయికి దగ్గరలో వున్న చెట్టుకొమ్మలు కూడా ఆ రాయికి నీడ కల్పించే దశకు పెరగగానే, విరిగిపోవడం తమకు అంతు చిక్కకుండా వుందని గ్రామస్థులు అంటున్నారు.

షింగ్నాపూర్ గ్రామస్థులు ఆలయాన్ని నిర్వహించడానికో ట్రస్టును ఏర్పాటు చేశారు. సర్పంచి లేక గ్రామాధికారి ఆ ట్రస్టు వ్యవహారాలు చూస్తాడు. గత దశాబ్దంలో అక్కడ దత్తాత్రేయుడి, హనుమంతుడి ఆలయాలు కూడా వెలిశాయి.

సంవత్సరానికి రెండుసార్లు జరిగే జాతర సమయంలో ఆ వూళ్ళో నిండిపోయే యాత్రికుల కోసం ఒక ధర్మశాల నిర్మించడానికి పథకాలు రూపుదిద్దుకుంటున్నాయి.

గ్రామస్థులు శనీశ్వరుడిగా భావించే ఆ బండరాయి ఎలా కనుగొనబడిందో ఎవరికీ తెలియదు. అది దగ్గరలో వున్న కాలువలో కనబడినట్టు చెప్పుకుంటారు. దాన్ని తెచ్చి ప్రస్తుతం వున్నచోట స్థాపించారు. ఆవిధంగా అది త్వరలోనే గ్రామస్థులకి ఆరాధ్యదైవంగా మారింది.

ప్రస్తుతం ఆ గ్రామంలో కొత్త మార్పు లొస్తున్నయ్. ఒకానొకప్పుడు నిద్రపోతున్నట్టుగా వుండే వూరికి ప్రస్తుతం మూడు కిలోమీటర్ల దూరంలోనే సహకార చక్కెర ఫ్యాక్టరీ వుంది. కొన్ని ట్రాక్టర్లు, మోటార్ సైకిళ్ళు, జీపులు ఆ వూళ్ళో తిరుగుతున్నాయి. 7వ తరగతి వరకూ చదువు



చెప్పే జిల్లాపరిషత్ వాళ్ళ పాఠశాల వుంది.

ఈ ఆశ్చర్యకరమైన గ్రామం ప్రముఖ మైన అజంతా ఎల్లోరా గుహలకు వెళ్ళే దోవలో వున్నా, చాలామందికాసంగతే తెలియదు.

## లారెల్ హార్డీల మ్యూజియమ్

స్టేన్ లారెల్, ఆలివర్ హార్డీలు తమ హాస్యం ద్వారా ప్రేక్షకుల మనసుల్లో చిరస్మరణీయులైన గొప్ప నటులు. చిన్న పిల్లల నుంచి వృద్ధుల వరకూ అందరినీ సమంగా నవ్వించి అలరిస్తూ లారెల్ హార్డీలు ప్రపంచ ప్రసిద్ధ హాస్య జంటగా పేరు పొందారు. 1950లోనే వాళ్ళు నటించడం మానేసినా, ఇప్పటికీ వారందించిన హాస్యాన్ని ప్రేక్షకులు ఆస్వాదిస్తూనే వున్నారు.

లారెల్ స్వస్థలమైన ఇంగ్లాండ్‌లోని ఉల్వర్‌స్టోన్‌లో లారెల్ హార్డీల మ్యూజియమ్ ఒకటి నెలకొల్పబడింది. ఆ పట్టణపు మాజీ మేయర్ బిల్ క్యూబిన్ దాని నిర్మాత. ఆ మ్యూజియమ్ లారెల్ హార్డీలకు సంబంధించిన అనేక సినిమా స్టిల్స్, ఉత్తరాలు, వస్తువులతో నిండి వుంటుంది.

జూన్ 16, 1890లో లారెల్ పుట్టినప్పుడు జారీచేసిన 'బర్త్ సర్టిఫికెట్'ని ఫ్రేము కట్టించి అక్కడ ప్రదర్శనలో వుంచారు. ఆ మ్యూజియమ్‌లో టేపు చేసిన లారెల్ హాస్య సంభాషణల్ని వినదలచుకున్న వారికి విన్పిస్తారు.

లారెల్ హార్డీలు నటించిన 105 చిత్రాలలో 104 ఆ మ్యూజియమ్‌లో వున్నాయి. 'రోగ్ సాంగ్' అనే సినిమా ప్రింటు ఒక్కటే వారికి లభించలేదు. దాని కోసం ప్రపంచవ్యాప్తంగా విజ్ఞప్తి చేసినా ప్రయోజనం లేకపోయింది. నియంత అయిన ముస్సోలినీ కోసం లారెల్ హార్డీలతో ప్రత్యేకంగా రూపొందించిన మరో సినిమాని కూడా ఆ మ్యూజియమ్ సేకరించాల్సివుంది.

లారెల్ హార్డీల మ్యూజియమ్‌ని సందర్శించేందుకు ప్రపంచపు నలుమూలల్నించీ వేలాదిమంది వస్తుంటారు.



అక్కడ ప్రతిరోజూ లారెల్ హార్డీలు నటించిన ఏదో ఒక సినిమాని ప్రదర్శిస్తారు. ప్రపంచవ్యాప్తంగా వున్న లారెల్ హార్డీల అభిమాన సంఘాలను ఒకచోట చేర్చి ఓ అంతర్జాతీయ సమావేశాన్ని నిర్వహించాలనే ఆలోచన ఆ మ్యూజియమ్‌వారికి వుంది.

## ఇదే ఆఖరి పెళ్లి!

'గ్లెన్ డి మాస్ వుల్ఫ్' 26వ సారి పెళ్లి చేసుకుని ప్రపంచంలో ఎక్కువ పెళ్లిళ్లు చేసుకున్న వ్యక్తిగా గిన్నెస్ బుక్‌లోకి ఎక్కాడు. 'ఇదే ఆఖరి పెళ్లి. దీన్ని జీవితమంతా నిలుపుకుంటాను' అంటున్నాడతను.

40 మంది పిల్లలున్న 75ఏళ్ల వుల్ఫ్, భర్తకు విడాకులిచ్చిన 38 ఏళ్ల క్రిస్టీన్ స్యూకెమాచోని లాస్ వేగాస్ నగరంలో పెళ్లిచేసుకున్నాడు. ఆవిడకేమో పెళ్లయి భర్తతో కాపురం చేసుకుంటున్న కూతురుంది.

"మిగిలినవాళ్లెవరికీ నేను పెళ్లాడినప్పుడు వారి వయసు 22కి మించి లేదు. నాకు క్రిస్టీన్ పదేళ్లనుంచి తెలుసు. ఈమె పెద్ద వయసుదీ, తెలివిగలదీ కాబట్టి, ఆమె నన్ను అర్థంచేసుకుని సర్దుకుపోతుంది" అని చెబుతున్నాడు వుల్ఫ్.



1927లో జరిగిన వుల్ఫ్ మొదటి పెళ్లి మూడున్నర ఏళ్లలో విచ్ఛిన్నమైంది. అతను చేసుకున్న పెళ్లిళ్లలో ఎక్కువకాలం నిలిచిన పెళ్లి అయిదేళ్లపాటు కొనసాగింది. కొన్ని అయిదు రోజులకే విచ్ఛిన్నమయ్యాయి.

"నేను క్రిస్టీన్‌తో కలకాలం కలిసి వుందామనుకుంటున్నాను. మేము శాశ్వతంగా కలిసి బతకాలని వాగ్దానాలు చేసుకున్నాము. ఆమె ఈ జీవితంలోనే కాదు - మరుసటి జన్మలో కూడా నన్ను అంటిపెట్టుకునే వుంటుంది" అంటున్నాడు వుల్ఫ్.

వాళ్ల మధ్యగల 37 ఏళ్ల వయోభేదం గురించి ప్రస్తావన వచ్చినపుడు...."ఇద్దరి మధ్య పరస్పర ప్రేమ వున్నప్పుడు ఇంకా వయసు ప్రసక్తి వుంటుందనుకోను" అంటోంది క్రిస్టీన్.

"నేను అతన్ని ఏవిధంగానూ మార్చాలనుకోను. అతను ప్రస్తుతం వుండే తీరు సరిగ్గానే వుంది. అతనికి నాలో నచ్చే అంశం - నేను ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూ, చాలా చురుకుగా వుండటమే" అంటోందామె.

"మా మధ్య ఒకే ఒక భేదాభిప్రాయముంది. అతను 41వ బిడ్డ కావాలనుకుంటున్నాడు. నాకు పిల్లలు వద్దనిపిస్తోంది. నాకు 22 ఏళ్ల కూతురుంది. ఆమెకు ఇద్దరు పిల్లలు. నా పిల్లలు నా మనవలకంటే చిన్నవాళ్లు కావడం నా కిష్టంలేదు. మా మధ్య ఈ భేదాభిప్రాయం కూడా ఏదోవిధంగా తొలగిపోతుంది. దీని కారణంగా మేమేమీ విడిపోము" అంటోంది క్రిస్టీన్. *




## కేవలం ఫోర్‌హేన్స్ మాత్రమే చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది. చిగళ్లు గట్టిగా వుంటే పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.

అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్‌హెన్ తాను తయారు చేసిన టూత్‌పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు. ఇది నేరుగా చిగుళ్ల మీద పని చేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము. వాటిని బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.

ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం మరియు దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.




**ఫోర్‌హేన్స్ – ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.**

339F 172 TEL

సూర్య కిరణాలు తాకి కాలేజీ బిల్డింగ్ అందంగా మెరిసిపోతోంది. కాంపౌండ్ గేటుదాటి కాలేజీలోకి ప్రవేశించగానే రకరకాల మొక్కలు గాలికి తలలూగిస్తూ విద్యార్థులకు స్వాగతం పలుకుతున్నట్టుగా వున్నాయి.

ఆరోజు కాలేజీ పునఃప్రారంభం. అనేక రకాల మనస్తత్వాల్ని ఒకచోట చేర్చి, కులాసాగా కబుర్లు చెప్పుకోడానికి, జీవితంలో తిరిగిరాని ఆ యౌవనాన్ని ఎంజాయ్ చేయటానికి అవకాశం లభించేది ఈ కాలేజీల్లోనే! చదివినా చదవకపోయినా విద్యార్థులు కాలేజీల్లో చేరటానికి ఉత్సాహం చూపించేది అందుకేనేమో!

జట్లు జట్లుగా స్టూడెంట్సు నవ్వుతూ, జోక్స్ వేసుకుంటూ, ఒకరినొకరు విష్ చేసుకుంటూ, అరుపులతో కాలేజంతా తిరిగేస్తున్నారు. అమ్మాయిలనేడిపించే అబ్బాయిలు... అబ్బాయిల్ని ఆటపట్టించే గడుసమ్మాయిలు సమయంకోసం కాసుక్కూచ్చున్నారు.

శశి, స్వప్నని అల్లంతదూరంనుంచి చూసి చేయి వూపింది. చేరువకాగానే చేతులు కలుపుకుని పలకరించుకున్నారు ఇద్దరూ చిరునవ్వుతో! స్వప్న కాలేజీలో అడుగుపెట్టీపెట్టడంతోనే అలజడి మొదలయింది. ఆమె కాలేజీ బ్యూటినే కాదు- నిత్యనూతనంగా వుండే ఆమె చిరునవ్వే కాలేజీకి జీవం కూడా! ఆమెకు తను అందగత్తెననే గర్వంలేదు. అందరితోనూ నవ్వుతూ చురుగ్గా మాట్లాడుతూవుంటుంది. అందుకే కాలేజీలో స్వప్న గురించి తెలిసిన వాళ్ళందరికీ ఆమె అంటే ఎంతో అభిమానం.

శశి భుజంమీద చేయివేసి అడిగింది స్వప్న-

"ఎంతో కాలమైనట్లనిపిస్తోందే నిన్ను చూసి. ఇంటిదగ్గర అందరూ క్షేమమా!" అంది.

శశి సమాధానం చెప్పబోయేదల్లా ఆగి స్వప్న వెనుక పిల్లిలా అడుగులో అడుగు వేస్తూ నడుస్తున్న శరత్‌ని చూసింది.

'హుష్' అంటూ నోటిదగ్గర వేలు పెట్టి, చెప్పకన్నట్టు సైగచేశాడు అతను. శశి నవ్వుతూ "అందరూ క్షేమమే... కానీ నువ్వు మా ఊరు వస్తానని చెప్పి రానే లేదేం? ఎంత ఎదురుచూశానో! నువ్వెప్పుడూ అంతేలే! ఈవేళ కొత్తేముంది. శరత్ నుంచి వచ్చే ఫోన్‌కాల్‌కోసం దాని కెదురుగా కూర్చుని తపస్సుచేస్తూ వుండి వుంటావు... అంతేనా!" అంది.

స్వప్న తక్కున నిలబడిపోయింది. ఆమెను తప్పించుకు నిలబడ్డాడు శరత్.

స్వప్న ఒక చేయి గుండెమీద వేసుకుని, "అమ్మో..అంత అభాండంవేయకే! ఆ బ్లడీ శరత్ అసలు ఒక్కసారి కూడా ఫోన్ చేయలేదే ఈ శెలవల్లో! ఎంత కోపం వచ్చిందో తెల్సా? ఈవేళ కనిపిస్తే చెప్తాను చూడూ! అతని ముఖం నాకింక చూపించవద్దంటాను. వేరే గర్ల్ ఫ్రెండ్‌ని వెతుక్కోమంటాను. ఎందులోనయినా దూకమంటాను" అంది కోపం బుసలు కొడుతున్నట్టు.

"మైగాడ్" అని పెద్ద కేకపెడుతూ ఆమె ముందుకొచ్చాడు శరత్. అతని కేకకి ఉలిక్కిపడి చూసింది స్వప్న. శశి పకపకా నవ్వింది.

స్వప్న వాళ్ళిద్దరినీ వదిలి తన దారిన తాను నడిచి క్లాసుకి వెళ్ళి కూర్చుంది. కూర్చుందేకానీ వాళ్ళింకా క్లాసుకి రాలేదేమిటా అని మాటిమాటికీ గుమ్మంవేపు చూస్తోంది. మరో పదినిముషాలకిగానీ శశి,




శరత్ లోపలికి రాలేదు.

వాళ్ళలా వచ్చి కూర్చోగానే స్వప్న వెంటనే లేచి బయటికెళ్ళిపోయింది-వాళ్ళ ఎదురుగా కూర్చోటం ఇష్టంలేనిదానిలా!

శరత్, శశి నవ్వుకున్నారు.

"గొప్ప కోపమే వచ్చినట్టుంది శశీ!" అన్నాడు దిగులుగా.

"ఏం పర్వాలేదు...నువ్వేం భయ పడకు. స్వప్న కోపం ఎంతసేపు. ఓ పిల్ల తెరటం...అంతే! క్లాసు అయిపోగానే దాని సంగతి చూద్దాం" అంది అతనికి అభయ మిస్తున్నట్టుగా.

ఇంతలో థర్డ్ బెల్ కొట్టారు.

హడావిడిగా స్వప్న క్లాసులోకి అడుగు పెడుతూ - "లెక్చరర్ ఈజ్ కమింగ్. ప్లీజ్ సైలెన్స్" అంది తన ప్లేసులోనిల్చుని.

అందరూ లేచి నిలబడ్డారు నిశ్శబ్దంగా

ఇంతలో ప్యూన్ అటెండెన్స్ బుక్, చాక్‌పీసులు టేబిల్ మీదపెట్టి నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. అబ్బాయిలంతా స్వప్న వంక గుర్రుగా చూశారు. స్వప్న పెద్దగా పడీపడీ నవ్వింది. ఆమె నవ్వుతో క్లాసంతా శృతి కలిపింది. నవ్వులతో హాలు ప్రతి ధ్వనించింది. ఎంత ఆపుకుందామన్నా ఆ సీనే జ్ఞాపకం వచ్చి మళ్ళీ మళ్ళీ నవ్వు తున్నారంతా!

వీరి నవ్వులతో ప్రమేయం లేకుండా భయం భయంగా వెనక బెంచీలో ముడుచు కూర్చున్న ఒక స్టూడెంటు ఏదో గొణుగు తున్నాడు. కానీ అతని మాటలెవరి చెవుల్నీ తాకటం లేదు.

"సైలెన్స్ ప్లీజ్" అంటూ అరిచాడు లెక్చరర్. ఎప్పుడొచ్చి కూర్చున్నారో ఎవరూ గమనించలేదు ఆయన్ని. క్లాసంతా నిశ్శబ్దంగా అయిపోయింది.

ఆయన అటెండెన్స్ తీసుకుంటున్నారు. ఒక్కొక్కర్నీ పిలుస్తూ, 'చందూ' పేరు పిలుస్తూనే తలెత్తి చూశారు. స్టూడెంట్స్ కూడా ఆతృతగా వెనక్కి తిరిగి చూశారు- కొత్త కాండిడేట్ ఎవరా అని.

"యస్సర్" అంటూ అతను లేచి నిల బడ్డాడు. దళసరి కళ్ళద్దాలు, లూజు పాంట్, షర్టు...అమాయకంగా వున్నాడు.

లెక్చరర్ ఏవో కొన్ని ప్రశ్నలు వేశారు. వినయంగా సమాధానం చెప్తున్నా డతను. స్వప్న అతన్ని చూస్తూ శశి చెవిలో ఏదో గుసగుసలాడింది. కిసుక్కున నవ్వింది శశి.

లెక్చరర్ శశి వంక కోపంగా చూసే సరికి, "సారీ సర్" అంది. ఏమీ ఎరుగని దానిలా కూర్చుంది స్వప్న.

అటెండెన్సు పూర్తయింది. పుస్తక మింకా మూయనేలేదు. స్టూడెంట్సంతా బిలబిలమంటూ బైటికి వెళ్ళిపోయారు.

శరత్ కోసం చూసింది స్వప్న. అతను బైటికి వెళ్ళి కిటికీలోంచి లోపలికి చూస్తూ స్వప్నని బైటికి రమ్మని సైగ చేశాడు. రానంటూ తలూపింది స్వప్న.

'ప్లీజ్' అంటూ దణ్ణంపెట్టి రమ్మని అడిగాడు. స్వప్న చిన్నగా నవ్వి లెక్చరర్ చూడకుండా వస్తానన్నట్టు సైగ చేసింది. అతను ఆనందంతో పెద్దగా ఈలవేస్తూ వెళ్ళిపోయాడు.

'హవ్వ' అంటూ స్వప్న నోటి కడ్డంగా చెయ్యి పెట్టుకుంది. శశికి నవ్వా గటంలేదు. ముక్కుమీదికి జారిన కళ్ళ జోడులోంచి కినుకగా చూస్తూకూర్చుండి పోయారు లెక్చరర్!

అబ్బాయిల బెంచీలకు కాపలా కాస్తు న్నట్టుగా చందూ ఒక్కడే బిక్కుబిక్కు మంటూ క్లాసులో వుండిపోయాడు.

స్వప్న శశిని దగ్గరకి పిలిచి "శశీ !

ఆ కొత్త కళ్ళజోడు వల్ల మమ్మీలా వున్నాడు. ఒక గుంజు గుంజుదామే!" అంది.

ఆ మాటకి స్వప్న కాలుని గట్టిగా గిల్లింది శశి. 'అమ్మో' అనబోయి బాధని అణుచుకుంది.

"లేకపోతే ఏమిటి స్వప్నా..మాస్టార్ని బైటికిపోనియ్ చూద్దాం" అంటూ ఆమె కాలిని సవరించింది శశి.

పావుగంట గడిచాక లెక్చరర్ వెళ్ళిపోయారు బైటికి. వూపిరి బిగపట్టి కూర్చున్న స్వప్న మనసు తేలికపడింది. పుస్తకాలు పట్టుకుని చందూ దగ్గరకి వచ్చారు.

అతనికి కాస్త దూరంగా కూర్చుంటూ "మీ పేరు చందూ కదూ?" అంటూ పలకరించింది.

అతను తనని కాదన్నట్టుగా బైటికి వెళ్ళబోయాడు.

"అరే...కూర్చోండి. కొత్తగా వచ్చారు కదా! ఒకే క్లాసులో వుంటూ ఒకరినొకరం పరిచయం చేసుకుంటే బావుంటుందనీ..." అంది స్వప్న.

"నిజమేనండి" అన్నాడు రాజమండ్రి యాసలో.

"ఏ వూరు మనది?" స్వప్న పెదాల మీద చిరునవ్వు.

"తూగోజి అండి"

"అంటే?!"

"తూర్పుగోదావరి జిల్లా అండీ... రెండపూడి అని"

"ఆహా.. తూగోజి అనకపోతే ముందే వూరు పేరు చెప్పొచ్చుకదా!" అంది.

అతని కాళ్లు వణుకుతున్నట్టు ఫీలయ్యాడు. మాట సరిగ్గా రావటంలేదు. శశికి నవ్వాగటంలేదు.

"అవునూ... మీరు సినిమాలు బాగా చూస్తారా? 'బుల్లెట్ ట్రైయిన్' బావుంది కదా... వెళ్ళారా?" అంది నవ్వుతూ.

"లేదండీ" అన్నాడు.

"పోనీ థర్టీసిక్స్ ఛాంబర్ ఆఫ్ షావొలిన్, ఫైవ్ మెన్ ఆర్మీ, మూడ్ మార్క్స్...?" అని అడిగింది.

"లేదండీ... లేదండీ" అన్నాడు కంగారుగా.

"అసలు మీరు సినిమాలు చూడరా?" అమాయకంగా అడిగింది స్వప్న.

"ఎందుకు చూడనండీ! గుణసుందరి, మాయాబజార్, భీష్మ, ఇంటికి దీపం ఇల్లాలు. ఇలాంటివే మరికొన్ని చూశానండి" అన్నాడు.

స్వప్న నుదురు కొట్టుకుని "బైటికి రండి... ఒక్కరే కూర్చుని ఏంచేస్తారు. క్యాంటీన్‌కి వెళ్దాం" అంది.

"థాంక్సండీ. చద్దన్నం తినొచ్చాను. ఆకలిగాలేదు. చదువుకుంటూ కూర్చుంటానండి" అన్నాడు.

స్వప్నకి నోట మాట రాలేదు. "ఇమ్మల్ని భగవంతుడే రక్షించాలి" అనుకుంటూ నెమ్మదిగా బైటికి నడిచింది శశితో.

ఇద్దరూ క్యాంటీన్‌లోకి అడుగుపెట్టగానే శరత్ నవ్వుతూ ఎదురొచ్చాడు. అతన్ని చూడగానే కోపం వచ్చిందన్న సంగతి గుర్తుకొచ్చి ముఖం ముడుచుకుంది స్వప్న. ముగ్గురూ వెళ్ళి ఒకటి టేబుల్ ముందు కూర్చున్నారు. కాఫీకి ఆర్డర్ ఇచ్చాడు అతను.

స్వప్న మౌనాన్ని భరించలేనివాడిలా, "ప్లీజ్ స్వప్నా! ఎందుకు నామీద అంత కోపం. నేను వరుసగా మొదటి పదిహేను రోజులూ రోజుకి రెండుసార్లు నీకు ఫోన్

చేశాను. ఎప్పుడూ మీ నాన్నగారే ఫోను తీసేవారు. 'రాంగ్‌నంబర్' అని పెట్టేసే వాణ్ని. ఒకసారి ఫోన్ ఎత్తగానే 'హల్లో డార్లింగ్' అని గట్టిగా అరిచాను. మీ నాన్నగారికి చెముటొచ్చివుండాలి ఆ కేకకి. 'ఎవర్రా రాస్కెల్' అని అంత కంటే గట్టిగా అరిచారాయన. 'సారీ' అని ఏదో చెప్పి పెట్టేశాను...అంతే! మీ నాన్న గారు ఫోను జేబులో పెట్టుకుని తిరుగు తున్నారేమోనని చేయటం మానేశాను" అన్నాడు.

స్వప్న కిలకిలా నవ్వింది. ఆ నవ్వు కోసమే ఆశపడుతున్నవాడిలా శరత్ రెట్టింపు వుత్సాహంతో 'యురేకా' అని అరిచాడు.

"హయ్యో... ఏమిటి శరత్ అది. అందరూ చూడు ఎలా చూస్తున్నారో మనల్ని" అంది గాభరాగా.

కౌంటరు దగ్గర కూర్చున్న ప్రొప్రయిటరు ఏమైందంటూ హడావిడిగా వచ్చాడు.

"ఏంకాలేదు.... పట్టపగలు వెన్నెల జల్లు కురుస్తోంది. ఆనందంతో పరవళ్ళు తొక్కుతున్న సాగర్‌ని చూడండి. ఆకాశంలో అద్భుతమైన రంగులతో ఇంద్ర ధనుస్సు వెలిసింది చూశారా?" అన్నాడు తన్మయత్వంగా.

ఇదేదో అర్థంకాని కేసులా వుందని పించి 'శరణం అయ్యప్పా' అనుకుంటూ వెళ్ళిపోయాడా ప్రొప్రయిటర్.

శశి, స్వప్న పొట్టపట్టుకుని నవ్వలేక నవ్వుతున్నారు. శశి ముందుగా తేరుకుని "ఏమిటి శరత్! మరీ చిన్నపిల్లాడిలా అల్లరి. స్వప్నే అనుకుంటే నువ్వూ అంతే! ఇప్పటివరకూ కొత్తగా వచ్చిన ఆ చందూని పట్టుకుని అల్లరి పట్టించింది. ఇక్కడ నువ్వూ" అంది మందలింపుగా.

అతను చిన్నగా నవ్వి "ఏమిటీ.... అప్పుడే అతను మీ చేతిలో పడ్డాడూ! రేపు ధైర్యంగా కూర్చుంటాడంటారా క్లాసులో" అన్నాడు.

"ఏమో పాపం! చాలా అమాయకం— వున్నాడు. వాళ్ళ అక్కయ్యగారింట్లో వుండి చదువుకుంటున్నాడట. వాళ్ళ బావ గారికి ట్రాన్స్‌ఫరయితే ఇక్కడికి రావలసి వచ్చిందట. కానీ మంచి క్లెవర్. అన్నీ ఫస్టుక్లాసులే! నీకు పోటీ వచ్చినట్లే" అంది శశి. ఆ మాటకి శరత్ ఫ్రీగా నవ్వేశాడు.

జేబులోంచి అయిదు రూపాయలనోటు తీసి బిల్ చెల్లిస్తుంటే స్వప్న కంగారు పడింది. "అదేమిటి? బిల్లు నేను ఇస్తాను శరత్!" అంది హాండ్‌బాగ్ తెరుస్తూ.

"కనీసం కాఫీ బిల్లు కూడా చెల్లించ లేననా నీ ఉద్దేశం" అన్నాడు చిరు కోపంతో.

స్వప్న నొచ్చుకుంది. "ఛఛ... అదేంకాదు. ఎప్పుడూ నువ్వే ఇస్తున్నా వనీ..." అంది పొంగి పొరలుతున్న ఆనందపు తెర ఒకటి తెగినట్టు విల విల్లాడిపోతూ.

అది గ్రహించిన శశి వాతావర ణాన్ని తేలికపరచటానికి ప్రయత్నిస్తూ— "ఇద్దరూ అలా గొడవ పడకండి. నేనెప్పుడో చెల్లించేశాను ఆ బిల్లు. ఇంక బైటికి పోదాం" అంది.

స్వప్నకున్న స్నేహితుల్లో ఆమె మనసుకి అతి దగ్గరయింది శశి. స్వప్న అందర్నీ అల్లరిపట్టించడంచూసి ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తుండటమే ఆమె తత్వం అనుకుంటారుగానీ, ఆ నవ్వుల వెనుక మంచి మనసునీ, లోతైన మనస్తత్వాన్ని




కూడా చూడగలిగింది శశి ఒక్కతే! ఆమెలోని ఆత్మవిశ్వాసం, ధైర్యం ఆమెకు పెట్టని ఆభరణాలు.

అలాగే స్వప్న కూడా తన మనసులోని ఏ బాధనైనా, ఆనందాన్నైనా తనూ పంచుకుని తీయని స్నేహాన్ని పంచి ఇచ్చే శశి అంటే ప్రాణం స్వప్నకి. ఖమ్మంలో కాలేజీలు వున్నా కేవలం సరదాగా హైదరాబాదులో చదవాలనే కోరికతో హాస్టల్లో వుంటూ చదువుతుంది శశి. శెలవురోజులన్నీ స్వప్న వాళ్ళింట్లోనే గడుపుతుంటుంది.

ముగ్గురూ బైటికి నడిచారు. కాలేజీ ప్లేగ్రౌండ్స్‌లో షటిల్ ఆడటం మొదలుపెట్టారు. షటిల్ స్వప్నకిష్టమైన గేమ్. అసలు తనని చేసుకోబోయేవాడు ఏ క్రికెట్ ప్లేయరో, షటిల్ ప్లేయరో అయుండాలని ఎంతో ఆశపడేది. శరత్‌కి ఆటల్లో వున్న ప్రావీణ్యతను బట్టి ఏగొప్ప ప్లేయరో అవుతాడని వూహిస్తుంది కానీ, శరత్ గేమ్స్ మీద తనకంత ఇంట్రెస్టు లేదంటాడు. ఆ మాట అంటేనే ఆమెకు అతనిమీద ఎక్కడలేని కోపం వస్తుంది.

తెల్లగా, ఎత్తుగా వుండే అతని రూపమన్నా, ఎవరినీ నొప్పించని అతని మెత్తని మనసన్నా... అన్నింటినీమించి తన ప్రేమను వ్యక్తం చేయడానికి చీరలో, నగలో, డబ్బో మార్గాలుగా తంటాలుపడే ఈరోజుల్లో తనకోసం అహర్నిశలూ తపించి తపించి పరవశించిపోయి... దేవీ పూజకు మాత్రమే అర్హమయ్యేపుష్పంలా తన ప్రేమను దోసిట నింపి ఆమెకు భక్తితో అర్పించుకునే అతని ప్రేమన్నా, అతని చక్కని కంఠస్వరమన్నా ఆమెకు ప్రాణం. అందుకే తన అంతస్థుకి సరితూగని స్థితి అయినా... అదేమీ లెక్క-చేయకుండా అతన్ని ప్రేమిస్తుంది స్వప్న.




సాయంకాలం కాలేజీనుంచి రాగానే పుస్తకాలు గుమ్మంలోంచే తన గదిలోని బెడ్స్ మీదికి విసిరేసి వంటగదిలోకి వెళ్ళింది గబగబ స్వప్న.

తల్లి కూరగాయలు తరుగుతూ కన్పించింది. ఒక్క నిముషం ఆవిడ వంకచూసి, గాఢంగా నిట్టూరుస్తూ అంది—

"అమ్మా! ఎప్పుడైనా నేనూహించిన విధంగా నువ్వు ఏ నవలో పట్టుకుని హాల్లో సోఫాలో కాలు మీద కాలు వేసుకుని కూర్చునిచదువుతూనో,ఎవరితోనైనా కబుర్లు చెబుతూనో కన్పిస్తావని ఆశపడతాను. ఊహూ...ఎప్పుడు చూసినా కేరాఫ్ అడ్రసు ఇదే! మీ నాన్న నిన్ను ఈ వంటింటికిచ్చి పెళ్ళిచేశాడో, మా నాన్నకిచ్చి పెళ్ళిచేశాడో అర్థం కావటం లేదు. నువ్వు వంటింటికే అంకితమైపోయావు" అంది.

స్వప్న మాటలు కొత్తేమీ కాదన్నట్టు ఒక చిన్న నవ్వు నవ్వి, "గిన్నెలో పకోడి వుంది శాంతి కూడా తినలేదు. ఇద్దరూ తినండి" అందావిడ.

శాంతి స్వప్నకంటే చిన్నది. టెన్త్ క్లాసు చదువుతోంది. వీళ్ళిద్దరే లీలాదేవి,

భుజంగరావుగారి సంతానం. ఆయనకు షుగర్ ఫాక్టరీ వుంది. బతకటానికి డబ్బు ప్రధానమని తలచి లాభసాటి వ్యాపారాలెన్నో చేసి డబ్బు గడించా రాయన.

ఆయనకు చాలా నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. ముఖ్యంగా ఆడదాని మాట వినటమన్నా, వారు స్వేచ్ఛగా బతకడమన్నా సహించలేరాయన. భార్యనీ,పిల్లల్నీ ఎల్లప్పుడుతనఅదుపాజ్ఞల్లోపెట్టుకోవటానికి ప్రయత్నిస్తారు. తనమాటే వాళ్ళకు వేదవాక్కు కావాలనీ, కాదని ఎదురు తిరిగితే భార్యా బిడ్డలనే విచక్షణ లేకుండా శిక్షిస్తారాయన.

భార్యా పిల్లలు సినిమాకి వెళ్లాలంటే రెండు రోజులు ముందు అడిగితే, నమ్మకస్తుడైన తనగుమాస్తానిచ్చి కారులో పంపిస్తారు.ఎదుటపడిపిల్లలు 'నాన్నగారూ' అనిపిలవటానికి వీల్లేదు. అలా పిలిస్తే వాళ్ళకిచాలా ధైర్యమొచ్చేసిందనీ, ఇంక తనమాట వినరనీ భయం. పిల్లలు ఫీజు కట్టాలన్నా, ఏమైనా కొనాలన్నా సమస్తం లీలాదేవి సిఫార్సు చేయాల్సిందే –అదీ అణుకువగా!

ఇంక కాలేజీకి వెళ్ళే స్వప్న విషయంలో ఎన్నో నియమ నిబంధనలు! రోజూ ఆమెను తన కారులో కాలేజీకి డ్రాప్ చేయటమో, కారు ఆయన తీసుకెళ్ళినప్పుడు రిక్షాలో వెళ్ళటమో చేయాలి. మగపిల్లలతో మాట్లాడటం, ఇంట్లో చెప్పకుండా ఫ్రెండ్సుతో సినిమాలు చూడటం... ఇవేమీ ఆయనకు ఇష్టం వుండవు. అదే క్రమశిక్షణ అనుకుంటారాయన.

కానీ స్వప్న పెరిగేకొద్దీ తన జీవితంపట్ల కొన్ని ఖచ్చితమైన నిర్ణయాలు, అభిప్రాయాలు ఏర్పరచుకుంది. ఏ విషయాన్నయినా నిర్మొహమాటంగా చెప్పగలగటం అలవర్చుకుంది. తనకు సంబంధించిన ఏ విషయంలోనైనా తండ్రి అధికారం ప్రదర్శించటం భరించలేకపోతుంది. కోరిన బట్ట, తిండి ఇస్తున్నందుకు భార్యా పిల్లల స్వేచ్ఛను అరికట్టి తన అజమాయిషీలో వుండమనటం సహించలేనంటుంది.

పైగా తల్లితో ఈ విషయం గురించి పోట్లాడుతుంటుందకూడా! "నువ్వే నాన్నగారికి అలుసిచ్చావు. తప్పుచేసిన దానిలా ప్రతిక్షణం ఆయనకు భయపడుతూ బతకటం దేనికమ్మా! కట్టుబాట్ల చట్రంలో మనిషిని బిగిస్తే, విరుచుకుని బైటికి రావాలనే ఘర్షణ, ఫలితంగా అశాంతి. ఇవేమీ నాన్నగారికి తెలీదు. ఎంతసేపు 'హుఁ హుఁ' అంటూ ఉరుముతుంటారు. ప్రేమగా, సంతోషంగా 'నాన్నగారూ' అని ఆయన చుట్టూ తిరగాలని మాకెంతగానో అనిపిస్తుంది. కానీ, ఆ ప్రాప్తం లేదు మాకు" అంటూ వాపోతుంది తల్లి దగ్గర.

ఆవిడ చెప్పేదేమీ వినదు స్వప్న.

* * *

ప్లేటునిండా పకోడీలేసుకుని, ఇంటి వెనక గార్డెన్‌లో పువ్వులు కోస్తున్న శాంతి దగ్గరకు వెళ్ళింది స్వప్న.

ఆమెను చూస్తూనే శాంతి ముఖం వికసించింది. గలగల వచ్చి స్వప్న కూర్చున్న గట్టుమీదే తనూ చతికిలబడింది.

ప్లేటు శాంతికి అందిస్తూ – "శాంతీ! మంచి ఇంగ్లీషు పిక్చరు వచ్చిందే! నాన్నగారిని అడిగితే వురుముతారని భయం. ఎట్లానే వెళ్ళటం?" అంది దిగులుపడుతూ.




"తీరుబడిగా బాధపడుదువుగానీ, ముందు టిఫిన్ తిను. నీతో ఎప్పుడూ ఇదే గొడవ... ఆయన వద్దంటారు, నువ్వు వెళ్ళాలంటావు. ఇద్దరిమధ్య అమ్మ బాధ పడుతుంది పాపం" అంది శాంతి.

స్వప్న ముఖం నిస్పృహ చెందినట్లు వాడిపోయింది. "ప్చ్...ఆఫ్టరాల్ సినిమాకి వెళ్ళటం కూడా పెద్ద ప్రాబ్లమ్ అయి పోయింది. ఖర్మ" అనుకుంది. పైకి అలా అన్నదే కానీ, ఆమె మనసు కుదుట పడలేదు. ఎలాఅయితే వెళ్ళటానికి ఛాన్సు వుంటుందా అని పరిపరి విధాల ఆలోచింపసాగింది మనసు.

ఇంతలో పక్క బిల్డింగులోంచి ఎవరో పిల్లలు 'ఆంటీ... ఆంటీ' అని పిలవటం వినిపించి ఆ వైపు చూశారిద్దరూ.

కాంపౌండువాల్ మీంచి ఎవరో పాప పిలుస్తూ కనిపించింది. 'ఏం కావాలంటూ' ఇద్దరూ వెళ్ళారు గోడ దగ్గరకి.

వీళ్ళను చూట్టంతోనే "ఆంటీ.. మీ వైపు బాల్ పడింది... ఇవ్వరూ!" అంటూ అడిగింది. పదేళ్ళుంటాయేమో. తెల్లగా బొమ్మలా వుంది. చురుకైన కళ్ళు, అందమైన పలువరుస చూడగానే ముద్దొచ్చేట్టువుంది. పక్కన నిల్చున్న పిల్లాడు తమ్ముడు కాబోలు... కాస్త నెమ్మదిగా, అమాయకంగా వున్నాడు.

శాంతి బాలు తెచ్చి ఇచ్చింది.

"బేబీ... నీ పేరు?" అని అడిగింది స్వప్న – ఆ పిల్ల బుగ్గలు సున్నితంగా నొక్కుతూ.

"నా పేరు పల్లవి. ఫోర్త్ క్లాస్. తమ్ముడి పేరు అనంత్. సెకెండ్ క్లాస్. మరి మీపేరు!" అంది వెంటనే.

స్వప్న నవ్వి, "నీపేరంత బావుండదు కానీ, నా పేరు స్వప్న. మా చెల్లాయి పేరు శాంతి. నేను బియస్సీ, శాంతి టెన్తుక్లాసూ చదువుతున్నాం..." స్వప్న మాట పూర్తికాలేదు పల్లవి ఎదురుప్రశ్న వేసింది "స్వప్న అంటే ఏమిటి ఆంటీ?" అని.

స్వప్న ఆశ్చర్యపోయి చూసింది పల్లవిని. మరు నిముషం గట్టిగా నవ్వేస్తూ, "స్వప్న అంటే 'కల' అని అర్థం.... బావుందా?" అంది.

"చాలా బావుంది. మరి పల్లవి అంటే అర్థం తెలీదు కానీ, మమ్మీకి సంగీతమంటే ప్రాణమట ఆంటీ. అందుకే నాకాపేరు పెట్టిందట. అనంత్‌కి మాత్రం డాడీ పెట్టారీపేరు" అంది. స్వప్నకి ఆ పిల్ల లిద్దర్నీ చూస్తుంటే ముచ్చటగా అనిపిం చింది.

పల్లవివాళ్ళు ఆ ఇంట్లోకి చేరి వారం రోజులౌతోంది. అంతకుముందు ఆ ఇంట్లో మన్నార్‌గారని తమిళియన్స్ వుండేవారు. వాళ్ళు ఆ బిల్డింగ్ అమ్మేసి మద్రాసు వెళ్ళిపోవటంతో ఎవరో కొన్నారని తల్లి ద్వారా విన్నది. బహుశా వీళ్ళు అయుంటా రనుకుంది మనసులో.

"ఆంటీ! మీరిద్దరూ ఒకసారి మా ఇంటికి వస్తారా.. మా మమ్మీని పరిచయం చేస్తాను" అంది.

స్వప్న పెదవులమీద చిరునవ్వు వెలిసింది. "తప్పకుండా వస్తాం. మరి మీరు కూడా రండీ'' అంది.

"మమ్మీని అడిగి వస్తాం ఆంటీ... టాటా" అంటూ అక్కణ్ణించి పరుగు పెట్టారు.

• • •

మరుసటిరోజు స్వప్న కాలేజీ నుంచి రాగానే షెల్వార్ కమీజు వేసుకుని నీట్‌గా డ్రెసప్ అయి పల్లవివాళ్ళింటికి బయల్దే

రించు. శాంతిని రమ్మని గొడవ చేసింది కానీ, ఆ పిల్ల ఇష్టపడలేదు. శాంతి తత్వమే అంత. ఎక్కడికీ వెళ్ళదు. తనకై తాను ఎవరితోనూ కలవదు. కాని పరిచయమైన తర్వాత మాత్రం అభిమానంగా మాట్లాడు తుంది.

స్వప్న వెళ్ళే సమయానికి సంధ్య చీకట్లు అలముకుంటున్నాయి. కాంపౌండు చుట్టూ వెలుగుతున్న లైట్ల కాంతిలో ఆ బిల్డింగ్ అందమంతా ఒలకబోస్తున్నట్టుగా వుంది.

లోపలికి వెళ్ళే మొదటి మెట్టుమీద అడుగు పెట్టబోతుండగా లోపల్నుంచి ఒక వ్యక్తి విసురుగా బైటకు వస్తుంటే వేగంగా పక్కకు తప్పుకుంది స్వప్న. ఆ వ్యక్తి స్వప్నని చూసే స్థితిలో లేదు. వెంటనే కార్లో కూర్చుని, స్టార్ట్ చేశాడు. రయ్‌మని దూసుకుపోయింది బైటికి.

ఆ వ్యక్తికి ముప్ఫయి అయిదేళ్ళుంటా యేమో. ముఖంలో ప్రశాంతత అనేది లేదు. ఏదో కసి, ద్వేషం కనిపిస్తుంది. చేతిలో ఖరీదైన సిగరెట్, టక్ చేసుకుని విసురుగా వెళ్ళిపోతుంటే ఒక్క క్షణం అలాగే నిలబడిపోయి చూసింది స్వప్న.

'అనంత్ పోలికలు స్పష్టంగా అతనిలో కన్పిస్తున్నాయి కాబట్టి వాళ్ళ డాడీ అయ్యుంటాడు. మహా టెంపర్‌లా వున్నాడే! హుఁ... ఈ మగాళ్ళకిదో కంపల్సరీ క్వాలిఫికేషన్ అయిపోయింది' అనుకుంటూ లోపలికి అడుగుపెట్టింది.

హాల్లో ఎవరూ కన్పించలేదు. ఇల్లు మాత్రం శుభ్రంగా, అందంగా వుంది. గదినిండా కార్పెట్. గోడలకి నాలుగు వైపుల షేడ్ లాంపులు. గది మధ్యలో సోఫాసెట్. కిటికీలకి, తలుపులకి ఖరీదైన కర్టెన్స్. గోడకి ఒకపక్క రవివర్మ చిత్రపటం.

గదంతా నిశితంగా పరిశీలిస్తున్న స్వప్న ఎవరూ కన్పించరేమిటా అని సందేహిస్తూ- "పల్లవీ" అని పిలుస్తూ హాల్లోంచి వేరే గదిలోకి వెళ్ళి ద్వారం దగ్గర నిలబడి కర్టెన్ తొలగించి చూసింది.

అంతే! స్వప్న మనసు చెదిరిపోయి నట్లయింది లోపలి దృశ్యం చూడగానే! పల్లవి తల్లి కాబోలు దిండులో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది. అలికిడికి తలెత్తి గుమ్మంకేసిచూసింది.

ఎదురుగా తననే చూస్తూ నిలబడ్డ స్వప్నని చూసి, కంగారుగా తన పైట కొంగుతో కళ్ళు తుడుచుకుని 'రండి' అంది తడబాటుగా.

స్వప్న అదేం పట్టించుకోలేదు.

జీవం పుట్టిపడుతున్న శిల్పంలావున్న ఆమెను చూస్తూంది. కనుబొమలు సన్నగా, కళ్ళు కాంతి దీపాల్లా, శరీరం తీర్చి దిద్దినట్టుగా వుంది. కొద్ది క్షణాల క్రితం ఏదో సంఘర్షణకు లోనైనట్టుగా ఎర్రబడ్డ కళ్ళు, సూర్యాస్తమయాన పడమటి దిక్కులా ఎర్రగా వెలిగిపోతున్నాయి. మనసులో సుడిగుండంలా చెలరేగుతున్న భావ పరం పరలకు చిహ్నంగా జుట్టు చెదిరి ముఖం మీద పడుతోంది. ఆమె జీవితానుభవానికి కొలతబద్దలా కళ్ళ కింద చీకటి. అంతటి సౌందర్యానికి అది అందమైన మచ్చలా అనిపించింది స్వప్నకి.

ముప్పైయ్యేళ్ళుంటాయేమో.... అయినా చెక్కుచెదరని ఆమె అందానికి చూపు తిప్పుకోలేకపోతున్న స్వప్న ఒక్క సారిగా తేరుకుని 'నమస్తే ఆంటీ' అంది రెండు చేతులు జోడించి.

'ఆంటీ' అని పిలిచేంత వయసు కాక పోయినా స్వప్నకి ఆమెను అలాగే




పిలవాలనిపించింది ఎందుకో!

"నమస్తే...రామ్మా!" బాధ నుంచి బైటపడ్డ ముఖం నిండా నవ్వు పులుము కుని అంది.

"నేనెవరో మీకు తెలీదుకదా! నా పేరు ..." అర్థోక్తిగా వదిలేసి చూస్తుంటే ఆమె నవ్వింది.

"నాకు తెలుసు. నువ్వు స్వప్నవి... అవునా?!" అంటూ కుర్చీ చూపించింది. తన పేరు కృష్ణవేణి అని చెప్పింది- తనూ మరో ఛైర్‌లో కూర్చుంటూ.

"పల్లవి చెప్పిందన్నమాట. మీరు ఈ ఇంట్లోకి వచ్చి పదిరోజులైందట కదా! కొత్తగా వచ్చినవాళ్ళను ఇరవై నాలు గంటలలోపు పరిచయం చేసుకోకపోతే నాకు నిద్రపట్టదు. మీరు వచ్చినట్లు నాకు తెలీదు. మా అమ్మ చెప్పింది. నిన్న పల్లవి, బాబూ కన్పించారు. మిమ్మల్ని పరిచయం చేసుకోవాలనీ...." అంది సిగ్గుపడుతూన్నట్టు.

ఆమె నిండుగా సాగే నదిలా నవ్వింది.

"నేను బైటకి వెళ్ళటం చాలా తక్కువ. ఎప్పుడూ ఎవరో ఒకరు ఫ్రెండ్సు వచ్చి మాట్లాడుతుంటే ఎంతో హాయిగా అనిపిస్తుంది. మాది రాజమండ్రి. మా వారు రైల్వే కాంట్రాక్టరు. ఇక్కడ వర్క్సు తీసుకున్నారు. అందుకే వచ్చేశాం. నా స్నేహితులు, బంధువులు అంతా అక్కడే వున్నారు. కొత్తప్రదేశం- ఎలా వుంటుందో, ఏమిటోనని భయపడ్డ నాకు నువ్వు పరిచయంకావటం ఆనందంగా వుంది" అంది నవ్వుతూ.

ఇంతకుముందు ఆమె ముఖంలో కనిపించిన తీవ్రతకు బదులుగా ఇప్పుడు కనిపించే వుత్సాహం, మాటల్లో నిదానం వింతగా అనిపించాయి స్వప్నకి.

"పల్లవి ఎక్కడ ఆంటీ?" అంది.

'పల్లవీ' అని పిలుస్తున్న ఆమె గొంతు సన్నాయి రాగంలా వినిపించింది. పిలిచిన అయిదు నిముషాలకి గానీ పల్లవి రాలేదు.

మరోసారి పిలిచిందామె.

కళ్ళు నలుముకుంటూ, నెమ్మదిగా పక్క గదిలోంచి నడచి వచ్చింది. స్వప్న కూర్చున్న గదికీ, దానికి ఆనుకునివున్న గదికీ మధ్య డోర్‌కి కర్టెన్ వేసివుంది. ఆ కర్టెన్‌ని తొలగించుకుని వచ్చింది పల్లవి.

తన మాట విని కూడా ఆ పిల్ల వెంటనే రాకపోవడం ఆశ్చర్యం కలిగించింది స్వప్నకి.

బెడ్ మీద కూర్చున్న కృష్ణవేణి ఒక్క వుదుటున లేచి కంగారుగా పల్లవి కళ్ళ మీద నుంచి చేతులు తీసి "ఏమ్మా... పల్లవీ" అంది- కూతురు కళ్ళల్లోకి చూస్తూ.

ఏడ్చినట్టుగావున్న కళ్ళు ఎర్రగా కంది వున్నాయి. తెల్లటి ఆ పిల్ల ముఖంలో అర్థంకాని భావాలు. తలెత్తి తల్లి వంక చూస్తూ- "మమ్మీ" అంది వణికే గొంతుతో.

"ఏమిటి చిన్నారీ.... ఎందుకు! తమ్ముడూ, నువ్వూ గొడవ పడ్డారా?" అంది ఆమె.

ఆమె గొంతులో పలుకుతున్న అనునయానికీ, పల్లవి కళ్ళు అలా ఎర్ర బారటం చూసి ఆమె తల్లడిల్లి పోతుండటం రవంత ఆశ్చర్యమనిపించింది స్వప్నకి.

"కాదు మమ్మీ! డాడీ, నువ్వూ అస్తమానూ అలా పోట్లాడుకుంటుంటే నాకు భయంవేస్తుంది. డాడీ నిన్ను కోప్పడుతుంటే నువ్వలా ఏడుస్తుంటే

నాకూ ఏడుపొస్తుంది మమ్మీ! డాడీ అంటే నాకిష్టం లేదు. ఐ డోంట్ లైక్ హిమ్" బొటాబొటా రాలుతున్న కన్నీటిని తుడుచుకుంటూ అంది.

ఏ బొమ్మ కోసమో, బాలు కోసమో ఏడుస్తుండి ఉంటుందని చెంపన చెయ్యి ఆన్చుకుని చూస్తున్న స్వప్న ఆ పిల్ల మాటలకి అదిరిపడి ఒక్క వుదుటున కుర్చీలోంచి లేచి నిలబడింది.

కృష్ణవేణి అంతకంటే కంగారు పడింది. ఒకసారి కళ్లు మూసుకుని, గట్టిగా వూపిరి విడిచి– "వెంకటేశూ" అని పిలిచింది.

వాళ్ళ సర్వెంటు కాబోలు ఏభై ఏళ్ళుంటాయి. ఆమె పిలవటంతోనే వచ్చాడు లోపలికి. "పల్లవికి మొఖం కడిగి, అనంత్ ఎక్కడున్నాడో చూసి ఇద్దర్నీ కాసేపు అలా షికారు తీసికెళ్ళు. ఇదిగో వస్తూ వాళ్ళకి కావల్సిన పళ్లు, బిస్కట్సు తీసుకురా" డబ్బు లిచ్చింది అతని చేతికి.

పల్లవి భుజం చుట్టూ ఆప్యాయంగా చేయివేసి ఏవో కబుర్లు చెప్తూ బైటికి నడిచాడతను.

స్వప్న ఇంకా తెల్లబోయి చూస్తూనే వుంది. అందం, ఐశ్వర్యం, ముత్యాల్లాంటి పిల్లలు. ఇంకేం కావాలి జీవితానికి? తనని తనుగా ప్రేమించి, గుండెల్లో దాచుకునే ఒకేఒక మనిషి భర్త అయి వుండాలి. అతనెలాంటివాడో? జీవితాన్ని పంచుకునే మనిషి సరైనవాడు లేకపోతే ఆడదానికి ఆస్తి, ఐశ్వర్యం దేనికి? మహా రాజ్యాధినేతలకాలంలో రాచకన్యగా పుట్ట వలసిన ఆమె సౌందర్యం ఒక మామూలు మనిషి మనసులేని మనిషి పాలబడిందన్న మాట– అని అనుకోకుండా వుండలేక పోయింది స్వప్న.

వాళ్ళను పంపించి, వేగంగా వచ్చి మంచంమీద కూర్చుంది కృష్ణవేణి. తనవంకే తెల్లబోయి చూస్తున్న స్వప్న వైపు తలెత్తి చూసింది ఒక్కసారి. ఆమెను చూసి నవ్వబోయి, నవ్వు రాక నిర్లిప్తంగా అంది–

"స్వప్నా...ఏమిటలా వింతగా చూస్తున్నావు. నీతో పరిచయం ఈవిధంగా జరుగుతుందనుకోలేదు. నా మానసిక స్థితిబావుందని టైములో నీకు కనిపించాను. ఇప్పుడు పల్లవి మాటలు విన్నావుగా! నా పరిస్థితి ఏమిటో నీకు కొంత అర్థమయ్యే వుంటుంది. ఈ మాట నీతో అనకుండా మనసులో దాచుకోవచ్చు. కానీ, మొదటి చూపులోనే నువ్వు నాకెంతో నచ్చావు. నాకో మంచి స్నేహితురాలిగా, ఆత్మీయురాలిగా కనిపించావు. హాయిగా, ఆనందంగా గడిపే వయసు నీది. ఇవేమీ మనసులో పెట్టుకోకు. ఏమైనా సరదాగా మాట్లాడు...వింటాను" అంది.

ఆమెలో రగులుతున్న బాధని అతి కష్టం మీద నిలదొక్కుకుంటున్నట్లుగా భావించింది స్వప్న. నెమ్మదిగా కుర్చీలో కూలబడి నిస్సత్తువుగా తల వెనక్కి వాల్చి అంది–

"ఇప్పుడే వయసయినా మీ స్థాయికి రావలసినదాన్నే! ముందు జీవితంగురించి ఆలోచించకపోతే ఎలా అంటి? ఆడదాని బతుకు మగవాడి చేతిలో వుందంటారు. ఆ నిర్వచనాన్ని తుడిచివేయాలని పిస్తుంది. దాని అర్థం మార్చేయాలని పిస్తుంది. కానీ ఎలా...?" అంటూ తల ముందుకు చాచి "మీలాంటి ఎంతమందో ఈ భావిభారతంలో భర్తల అహంకారానికి

తలవంచి కుమిలిపోతున్నారు. ముందు మీలో మార్పు ఎట్లా వస్తుంది? రావాలి... రావాలాంటీ.." ఆవేశంగా అంది స్వప్న.

కృష్ణవేణి పకపకా నవ్వింది. "స్వప్నా! నువ్వు చిన్నపిల్లవి. జీవితం లోకి పూర్తిగా అడుగుపెట్టలేదు. ఈ వయసులో నువ్వు చేసే ఆలోచనలకి, భవిష్యత్తులో ఎదురయ్యే అనుభవాలకి పొంతన కుదరదు. అప్పుడే..." ఆమె మాటల్ని మధ్యలోనే తుంచుతూ—"ఆంటీ. నేను చిన్నపిల్లనా! ఇరవై యేళ్ళవయసొచ్చి డిగ్రీ పుచ్చుకోబోతూ, మంచిచెడుల విచక్షణ తెలుసుకుని జీవితం గురించి భవిష్యత్తుని నిర్ణయించుకునే వయసు ఇది. చిన్నపిల్లలా కనిపిస్తున్నానా మీకు?" అంది.

ఆమెవైపు అభిమానంగా చూసింది కృష్ణవేణి. 'ఇంత చిన్నవయసులో ఎంత లోతుగా ఆలోచిస్తోందో! ఆదిలోనే ఇంత తెగింపు, ఉత్సాహం తనలో వుంటే తన బతుకిలా అఘాతంలోకి కూలిపడేది కాదేమో! ఇప్పుడు బాధపడి ప్రయోజనం లేదు. తన బతుకింతే!' అనుకుంది నిర్లిప్తంగా ఆమె.

స్వప్న ఏదో అనబోతుండగా కృష్ణవేణి మంచంమీంచి లేచి, "స్వప్నా.. కూర్చోమ్మా! ఐస్‌క్రీమ్ తెస్తాను" అంటూ కిచెన్‌వైపు వెళ్ళింది.

"ఐస్‌క్రీమా ఆంటీ! నా ప్రాణం లేచొస్తుంది కదా! మా ఫ్రెండ్సంతా నన్ను తెగ వెక్కిరిస్తుంటారు—ఐస్‌క్రీమ్స్, చాక్లెట్స్ ఎక్కువగా తింటుంటానని. పెళ్ళినాటికి టున్‌టున్‌లా అయిపోతా వంటూ, పెళ్ళికొడుకు నన్ను చూసి భయపడి నాకు కట్టబోయే తాళి పురో హితుడికి కట్టేస్తాడనీ అంటూంటారు. లావు చూసే భయపడి పారిపోయే మగాడు...జీవితాన్ని ఏం ఎదుర్కొం టాడు. అలాంటివాడు పారిపోవటమే మంచిదంటాను నేను" అంటూ ఆమె వెనకే తనూ వంటగదిలోకి వెళ్ళింది.

కృష్ణవేణి పకపకా నవ్వింది.

ఆమె అలా గట్టిగా నవ్వుతుంటే, తొలి సంధ్యలో విరబూసిన నందివర్ధనం రెమ్మలు విదిలిస్తే ఆ పువ్వులమీంచి జలజలా రాలిపడే మంచుబిందువులంత మార్దవంగా వుంది.

ఆ నవ్వుముఖాన్ని అలాగే చూస్తూ వుండాలనిపించింది స్వప్నకి.

"ఆంటీ... మనలో మాట. మీరేం చదివారు?" అంది.

ఫ్రిజ్‌లోంచి ఐస్‌క్రీమ్ కప్పు ఒకటి తీసి, స్వప్న చేతికిస్తూ— "బియ్యేస్సీ ఫైనలియరు చదువుతూండగా మావాళ్ళు పెళ్ళిచేశారు. ఆయన చదవటం ఇష్టం లేదన్నారు... మానేశాను. ఏం?" అంది.

"గొప్ప విషయమేకానీ, మీరు కాలేజీలో చదువుతూంటగా మీకు రోజుకి ఎన్ని ప్రేమలేఖలొచ్చేవి?" అంది నవ్వుతూ.

ఉలిక్కిపడి చూసింది కృష్ణవేణి. చనువుగా ఆమె తలమీద చిన్నగా మొట్టి "చిలిపి" అంది.

వంటగదికి ఆనుకుని వున్న రూమ్‌లోకి వెళ్ళింది స్వప్న. అది పూజ గది కాబోలు... దేవుడి మందిరం వుంది. అందులో వేంకటేశ్వరస్వామి వెండి విగ్రహం పూలమాలతో వుంది. దేవుడి ముందు మల్లెలు, మందారాలు ... ఒక రాగిపాత్ర, దీపారాధన సెమ్మెలు, కుంకుమ భరిణె వున్నాయి.

భక్తిగా ఒక్క నిముషం ధ్యానించి




ఇవతలికి వచ్చింది. ఐస్‌క్రీమ్ కప్పు తీసుకుని నోట్లో పెట్టుకోబోతూండగా, "అక్కా...అక్కా" అని శాంతి పిలవటం వినిపించింది.

కప్పు టేబులుమీద పెట్టి, వంటగది లోంచి వెనకవైపు దారివుంటే గబగబా వెళ్ళి చూసింది.

శాంతి కాంపౌండ్‌వాల్ మీంచి నాన్నగారొచ్చారు రమ్మంటూ పిలిచింది.

వెంటనే లోపలికి వచ్చి, "ఆంటీ! మా నాన్నగారొచ్చేశారట. ఏదో మీటింగు వుందంటూ వెళ్ళారు. ఇప్పుడే వస్తారనుకో లేదు. చీకటిపడ్డాక ఆడపిల్లలు బైటకి వెళ్ళటం ఆయనకు ఇష్టం వుండదు. కాదంటే ఇల్లు యుద్ధభూమే! నే వెళ్తాను. పిటీ.... ఐస్‌క్రీం తినలేకపోయాను. చిన్నమాట. నేను మీ గోడదూకి వెళ్తాను. మీకేమైనా అభ్యంతరమా?" అంది హడావిడిపడుతూ.

"అయ్యో! నాకేం అభ్యంతరం లేదుకానీ, నువ్వు గోడ ఎట్లా దూకుతావా అని భయం" అంది.

"ఫర్వాలేదు. గోడ దూకటం గొప్ప విద్యా....రండి చూద్దురు" అంటూ గోడ ఎక్కి అటువైపు తమ కాంపౌండులోకి దూకి "బై ఆంటీ" అంటూ చేయి వూపింది.

"సో నాటి" అంటూ నవ్వుతూ తనూ చేయి వూపింది.

అంత ధైర్యం, చొరవ వుండి అన్ని మాటలు చెప్పిన స్వప్న తండ్రికంతగా భయపడటం విచిత్రమనిపించింది ఆమెకి. 'ఊహల్లో బతకటమే కానీ వాస్తవాన్ని ఎదుర్కొనే శక్తి ఆడదానికి ఎందుకివ్వ లేదో ఆ దేవుడు' అనుకుని నిట్టూర్చింది గాఢంగా.

స్వప్న పిల్లిలా వెళ్ళి తన గదిలో కూర్చుంది. శాంతితో ఏవో జోక్సు వేస్తూ చిన్నగా నవ్వుతోంది.

ఇంతలో తండ్రి పిలుపు వినిపించింది హాల్లోంచి.

"ఏమిటో పిలుస్తున్నారు తండ్రిగారు ప్రశ్నలతో చంపేస్తారు. ఆయనకి జవాబులివ్వటంకంటే ఐఏయస్, ఐపి యస్ ఇంటర్వ్యూలు చాలా ఈజీ కదా" అంది.

"అబ్బ... వెళ్ళు ముందర. ఎప్పుడూ ఆయన్ని తప్పుపట్టటం తప్ప నీకేం తెలీదు" అంటూ విసుక్కుంది శాంతి.

స్వప్న వెళ్ళి తండ్రి ముందు నిలబడింది. ఎదురుగా పల్లవి వాళ్ల సర్వెంటు వెంకటేశు నిలబడి వున్నాడు. స్వప్నని చూడగానే, చేతిలో వున్న ఐస్ బాక్సు ఆమెకిచ్చి, "అమ్మగారు మీకిమ్మన్నారు" అన్నాడు.

స్వప్న అందుకుని, "నువ్వు వెళ్ళు" అంది. అతను వెళ్ళిపోయాడు.

బాక్సు మూత తెరచిచూసింది స్వప్న. నాలుగు వెండి కప్పులనిండా ఐస్‌క్రీం వుంది. అది తీసి టీపాయ్ మీదపెట్టి ఒకటి తండ్రి ముందుకు జరిపి "తీసుకోండి" అంది వినయంగా.

చూస్తున్న ఫైలు పక్కన పడేసి, "ఎవరతను?" అన్నారు.

"మన పక్క బిల్డింగ్‌లోకి కొత్తగా వచ్చారు. వాళ్ళ నౌకరు" అంది.

"అప్పుడే పరిచయమైపోయారన్న మాట. ఎప్పుడు వెళ్ళావు?" గంభీరంగా అడిగారు.

"నేను వెళ్ళలేదు. ఆవిడే సాయంకాలం మనింటికి వచ్చారు. చాలా మంచావిడ. ఇద్దరు పిల్లలు...ఆయన

కాంట్రాక్టరట" అని చెప్పింది

"ఎక్కడినుంచి వచ్చారు?"

"రాజమండ్రి నుంచి వచ్చారట - ఇక్కడ సెటిలవటానికి."

"ఇప్పుడీ ఐస్‌క్రీం ఎందుకు పంపినట్టు?" అన్నారు నొసలు చిట్లించి.

'ఎందుకేమిటి తినటానికి' అనబోయి, "పూరికే .... ఈవేళ పిల్లలకోసమని చేశారట. రుచి చూడమని పంపివుంటారు" అంది.

"మిమ్మల్ని వాళ్ళింటికి రమ్మన లేదూ?"

"రమ్మన్నారు. కానీ మాకే వీలుపడదనీ, అమ్మ అసలు బైటికే వెళ్ళదనీ, నాకు కాలేజీ, ఇంటిదగ్గర చదువు ఇదే సరిపోతుందనీ చెప్పాను" అంది-అబద్ధం చెప్పటానికేంతడబాటుపడనవసరం లేదనుకుంటూ.

ఆయన రయ్‌మని లేచారు. "నీకు బుద్ధిలేదు. అంత పెద్ద వాళ్ళకి అలాగేనా సమాధానం చెప్పేది. రేపు శాంతి, నువ్వు వెళ్ళిరండి" అన్నారు.

"అలాగేనండి" అంటూ తలూపింది నెమ్మదిగా.

లీలాదేవి వాళ్ళిద్దరి సంభాషణ వింటూ ముక్కుమీద వేలేసుకుంది. తేలిగ్గా అబద్ధమాడటం వింతగా అనిపించిందావిడకి.

స్వప్న ఒక కప్పు తీసుకుని తల్లి చేతిలో పెడుతూ, "అమ్మా ...నేను చెప్పినవి విన్నావుగా. అవే జవాబులివ్వు నువ్వు కూడా! లేకపోతే మన పని ఔట్" అంది గొణుగుతూ!

ఆవిడ మౌనంగా స్వప్న వెళ్ళిన వైపే చూస్తూ నిలబడిపోయింది.





* * *

పదిరోజులు గడిచిపోయాయి. జీవితం ఆనందంగా మలుచుకోడానికి మనమే ప్రయత్నించాలనే వుద్దేశం కలది కావటంతో స్వప్న కాలేజీ జీవితం ఆనందంగా గడిచిపోతోంది.

కొత్తగా జాయినయిన చందూతో పరిచయం స్నేహంగా మారింది ఆమెకి. తను వూహించిన విధంగా అతను అమాయకుడు కాదని, చాలా తెలివి, పట్టుదల వున్న మనిషని అర్థం చేసుకుంది. శరత్, చందూ మంచి స్నేహితులయ్యారు. శరత్ స్నేహంలో అతను పట్టుదలగా తన భాషని చక్కదిద్దుకున్నాడు. తను మాట్లాడే పదాల్లో దీర్ఘాలు పన్నే రాకుండా వుండేట్టు ప్రాక్టీసు చేయటంచూసి నివ్వెరపోయింది స్వప్న. "అమ్మో... ట్యూబ్ లైట్ అనుకున్నాం. కాదు లైట్‌హౌసే" అనేది శశితో. ఆమె నవ్వేసేది.

అప్పటినుంచీ చందూ అంటే అభిమానం ఏర్పడింది స్వప్నకి. అతన్ని విష్‌చేసి, నవ్వుతూ పలకరిస్తే సిగ్గుపడుతూనే మాట్లాడేవాడు.

అలాగే స్వప్న చిలిపితనం, చురుకుదనం చూసి శరత్ దగ్గర మెచ్చుకోకుండా వుండలేకపోయేవాడతను.

పైగా స్వప్నకి చందూ అంటే అభిమానం పెరగటానికి మరో కారణం కూడావుంది. ఆడవాళ్ళపట్ల అతనికున్న అభిప్రాయాలు ఆమెకెంతో ఆనందాన్ని కలిగించింది. స్త్రీ స్వేచ్ఛ గురించి, వ్యక్తిత్వం గురించి, ఆర్థిక స్వాతంత్ర్యం గురించి మంచి అభిప్రాయాలు వ్యక్తంచేసేవాడు.

చదువుకుని ఉద్యోగాలు సంపాదించటమే ధ్యేయంకాదు-స్త్రీ విలువని గుర్తించని సమాజాన్ని తను అసహ్యించుకుంటాననీ,

పురుషుడికెంత ప్రాధాన్యత వుందో స్త్రీకి అంతే ప్రాధాన్యత వుందనీ, దాన్ని భంగపరిచే ఏ సమాజాన్నయినా, మనిషినైనా ధిక్కరించటానికి పూనుకోవాలనీ అంటుంటే ముగ్ధురాలయి వినేది స్వప్న.

శశి మౌనంగా అతని ఆలోచనల్ని పట్టుకునే ప్రయత్నంలో మునిగినట్టుగా వుండిపోయేది.

స్వప్న అతనితో తీరుబాటుగా మాట్లాడినప్పుడల్లా ఏ పుస్తకం గురించో, వాస్తవ జీవితాల గురించో చర్చిస్తుండేవాడు. అతని మంచి మనసు, ప్రత్యేక నడవడి, స్వప్నకి అతనంటే మంచి అభిప్రాయం కలిగేలా చేశాయి.

ఆరోజు క్లాసులో లెక్చరర్ పాఠాలు చెప్పటం పూర్తిచేసి, షేక్స్పియర్ 'యాజ్ యూ లైకిట్' నాటకం తిరగేస్తున్నాడు.

బుక్ మూసి స్వప్న వేపు చూసిన శరత్‌లో ఏదో చలనం కలిగినట్లయింది.

లెక్చరర్ని పర్మిషన్ అడిగి తన సీటులోంచి లేచి బయటికి వెళ్ళబోతూ, "స్వప్నా... ఈ అవర్ కాగానే లోయర్ టాంక్‌బండ్ దగ్గర పార్కులేదూ, అక్కడికి వచ్చేయి" అన్నాడు నెమ్మదిగా.

అంగీకారంగా కనురెప్పలు గట్టిగా మూసి తెరుస్తూ 'ఓకే' అంది. అతను వెళ్ళిపోయాడు.

* * *

సాయంకాలం నాలుగ్గంటలు.

పార్కులో నవనవలాడుతూ పచ్చగా వున్న మొక్కలన్నీ అప్పుడే పెట్టిన నీటికి ఆహ్లాదంతో తలలూగిస్తున్నాయి. నీరెండ పరచుకుని తళతళ మెరుస్తూ పత్తుగా, పచ్చగా పెరిగిన పచ్చిక. పశ్చిమానికి ప్రయాణం సాగిస్తున్న సూర్యుని లేతకాంతి. చల్లటి గాలి. తను చెప్పిన టైముకంటే ముందేవచ్చి కూర్చున్నాడు శరత్.

అతనూ,స్వప్న మనసు విప్పిమాట్లాడుకోడానికి ఏ పార్కుకో, సినిమాకో అప్పుడప్పుడు వెళ్లటం పరిపాటే. అలా కలుసుకుని మాట్లాడకపోతే వారి మనసుల్లో ఏదో వెలితిగా, జీవితం రొటీన్‌గా సాగిపోతున్నట్లనిపిస్తుంది.

శరత్ స్వప్న కోసం ఎదురుచూస్తూ నిల్చున్నాడు.

పావుగంటకి కానీ స్వప్న రాలేదు. రావటంతోనే చుట్టూ చూసిందికానీ, ఆమెని ఏడిపించటానికి గుబురుగావున్న చెట్ల చాటున నిల్చున్న శరత్ కనిపించలేదు.

అతని సంగతి కొత్తేమీకాదని ఆమెకు తెలుసు. అందుకే నోటికి రెండుచేతులు లౌడ్‌స్పీకర్‌లా పెట్టి, "శరత్....రెండు నిముషాల్లో నువ్వు ఎక్కడున్నా బయటికి అంటే నా ఎదురుగావచ్చి నిలబడాలి. లేదంటే నేను వెళ్ళిపోతాను" అని అరిచింది.

పార్కులో జనసమ్మర్దంలేదు. చాలా దూరంగా ఎవరో నలుగురు మగవాళ్ళు పచ్చికలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆమె మాటలు వినిపించిన వైపు వింతగా చూసి, ఏదో అర్థమైనట్టు నవ్వుకున్నారు.

రెండు నిముషాలలోపే శరత్ పొదల చాటునుంచి బైటికివచ్చి ఆమెకు కనిపించేలా నిలబడ్డాడు.

పది గజాల దూరంలో నిల్చున్న స్వప్న ముఖంలో నవ్వుల ఘని పగిలింది. పడిపడి నవ్వుతూ... ఆ నవ్వుకు కంటి నుంచి వచ్చిన నీటిని చేతిగుడ్డతో తుడుచుకుంది.

శరత్ ఆమెను సమ్మోహనంగా

చూస్తూ నిలబడ్డాడు.

లైట్ ఆకుపచ్చ చీర, మాచింగ్ బ్లౌజు, చెవులకి పల్చటి రింగులు పెట్టుకుని, నడుముకి కిందగా కట్టిన చీర కుచ్చెళ్ళు గాలికి తెమ్మెరలా కదులుతుండే ఆమె అందాన్ని చూస్తూ నిలబడ్డాడు.

దూరంనుంచి అతను చూస్తున్న ఆ చూపు తన హృదయపు లోతుల్లోకి చూస్తున్నట్టుగా.... శారీరక వాంఛలకీ, డబ్బుకీ, హోదాలకీ అతీతమైన అనుభూతుల ఆనందం కోసం చూస్తున్న చూపులా వుంటుంది. ఆ చూపుల్ని అలాగే నిలిపి ఆనందించాలనిపిస్తుంది ఆమెకి.

ఆ సాయంకాలపు నీరెండలో అతను పచ్చగా వున్నాడు. వైట్ డ్రెస్‌లో ఈవెనింగ్ హాట్ పెట్టుకుని ట్రిమ్‌గా వున్నాడు.

పొంగుతున్న ఆనందంతో నెమ్మదిగా అడుగులు తడబడుతున్నట్టుగా నడిచింది అతని దగ్గరికి. వున్నట్టుండి ఆమెలో సిగ్గుతో కూడిన అణుకువ కమ్మేసింది ఆ క్షణం.

ఆమెలో ఆ మార్పుకి లీలామాత్రపు ఆశ్చర్యం పెనవేసినా, మౌనంగా ఆమె చేయిపట్టుకుని అక్కడేవున్న సిమెంట్ బెంచీకి ఆనుకుని కింద పచ్చికమీద కూర్చున్నాడు.

అతని పక్కనే చతికిలబడింది స్వప్న.

ఆమె కుడిచేతిని తన రెండు చేతుల్లోకి తీసుకుని..."స్వప్నా! మై లవ్, మై హార్ట్ ఐ లవ్ యూ" అంటూ గాఢంగా తన పెదవులకానించాడు.





స్వప్న మనసు మూగవోయింది.

"స్వప్నా! నీ నవ్వు శాశ్వతం చేసుకోవాలి. ప్రేమో పిచ్చో నువ్వు లేకుండా బతకలేననిపిస్తుంది. పెద్దవాళ్ళ మూర్ఖపు పట్టుదల, సాంప్రదాయం, ఆడంబరాల వుచ్చుల్లో నిన్ను బిగిస్తారని నా భయం. కానీ ఒక్కోసారి అనిపిస్తుంది - అవన్నీ వున్న మనిషిని చేసుకుంటేనే నీకు విలువనీ, నువ్వు సుఖపడతావనీనూ! అల్లారుముద్దుగా, అపురూపంగా పెరిగిన నిన్ను... నా పేదగూటికి తెచ్చి సుఖపెట్టలేక నవ్వులపాలవుతానేమోనని బాధ. ఎటూ తేల్చుకోలేకుండా వుంది నా ఆలోచన" ఆశ నిరాశలు అతని ముఖంలో కొట్టుమిట్టాడుతున్నాయి. లోపల ఏదో భావసంఘర్షణకు లోనవుతున్నట్టుగా అతని ముఖం భారంగావుంది.

స్వప్న మనసు ఒక్కక్షణం రెపరెపలాడింది. అతని మాటల్లోని ప్రేమ, లాలసలేమిటో, అతనిలో కలిగే సంచలనమేమిటో స్వప్నకి తెలుసు. తనని ప్రేమిస్తున్న ఈ రెండేళ్ళ కాలంలోనూ అతను ఈ రకమైన సంఘర్షణకి ఒక పక్క నలిగిపోవటం తను గమనిస్తూనే వుంది.కానీ, అతనికేవిధంగా సమాధానం చెప్పాలో, ఎలా చెప్తే అతను సంతృప్తిపడతాడో అర్థంకావటం లేదామెకి. అతననుకుంటున్నట్టుగా తను ధనవంతుల బిడ్డగా పుట్టి పెరుగుతున్నా... తను పెరుగుతున్న వాతావరణం అపురూపమని అనిపించదు. అదేమాట అంది అతనితో!

"అపురూపమంటే.. బిడ్డకేదైనా నొప్పి తగిలితే కన్నవాళ్ళ ప్రాణం విలవిలలాడిపోతుందంటారు. ఎదురుగా పంచభక్ష్యాలుపెట్టి 'జబ్బు చేస్తుంది... ఎక్కువ తింటే చంపేస్తాను' అని అంటే

ఆ తినబోయేవాడు ఎలా పీలవుతాడు! అదే నేను పెరిగిన అపురూపం కూడా! పసితనం నుంచీ అలాంటి అదుపాజ్ఞల్లోనే నేను పెరిగాను. వాటినుంచి నాలో కన్నవారి పట్ల ఏదో అసంతృప్తి. నేను కోరుకునే ఆప్యాయత, స్నేహం పొందలేక పోతున్నాననే బాధ. తండ్రికానీ, భర్తకానీ వాళ్ళ అదుపాజ్ఞల్లో బతకటమంటే నా హృదయం రగిలిపోతుంది. ప్రేమని పంచియిచ్చే ఏ మనిషినైనా గౌరవించటం సంస్కారమవుతుంది. మరి తండ్రి ఆ ప్రేమను తన రక్తం పంచుకుపుట్టిన బిడ్డకు అందివ్వటానికి ఏమిటి అడ్డు. అదే క్రమశిక్షణ, అదే పద్ధతి అనుకోవటం మూర్ఖత్వం కాదూ!

ఇంటికి పెద్దననీ, కష్టపడి సంపాదించి భార్యనీ బిడ్డల్నీ పోషిస్తున్నందుకు ఆవిధంగా అజమాయిషీ చేయాలని రూలా? అది కట్టుకున్నందుకు, కన్నందుకు ఆ మగవాడి బాధ్యత కాదూ!

నీకు తెలీదు శరత్! నేను ఎన్నో రోజులు మా ఇంటి వాతావరణం గురించి తలుచుకుని కుమిలిపోయాను. ఏ పనైనా నాన్నగారికి ఇష్టమైతేనే చేయాలి....లేదా మానివేయాలి. డాన్స్, డ్రైవింగ్, మ్యూజిక్ – ఇలా అన్నింటిలోనూ ప్రవేశం వుండాలని తాపత్రయ పడేదాన్ని. ఏదీ సరిగ్గా కొనసాగలేదు ఆయన అయిష్టంవల్ల. ఏం చేయడం' నా కాళ్ళమీద నిలబడగలిగే శక్తి, స్వాతంత్ర్యం వచ్చేవరకూ అయిష్టంగానైనా ఆయన అదుపాజ్ఞలకి తలవంచక తప్పదుకదా" అంది.

ఆమె గొంతులో ఎప్పుడో వినిపించే ఆ కరుకుదనానికి అతని కనుబొమలు ముడిపడ్డాయి ఒక్కక్షణం. తర్వాత సన్నగా నవ్వుతూ ఆమె వంక చూశాడు.

"స్వప్నా! కన్నవారిపట్ల అది నీ అభిప్రాయమైతే నా గురించి చూడు. నేను పుట్టిన కొద్దినెలలకే మా నాన్న పోయారట. ఏ ఆధారంలేని నన్నూ, నా తల్లినీ మా మేనమామ ఆదరించాడు. మా మీద మమకారంతో ఆయన ఆర్థిక పరిస్థితి బావుండటంవల్లా నన్ను పెంచి చదివిస్తున్నాడు. కానీ నాకే ఎందుకో బాధగా వుంటుంది అయినవాళ్ళ పంచలోనైనా అమ్మ వుండటం. చదువు కాగానే ఉద్యోగంచేసి నా తల్లిని తెచ్చుకోవాలని ఎంత ఆశపడుతున్నానో! ఆవిడకి నేనంటే ప్రాణం. నే వెళ్ళివున్న ఆ పది రోజులూ కంటికి రెప్పలా చూసుకుంటుంది. మా మామయ్య వాళ్ళూ అంతే ప్రేమగా చూస్తారు. మనసుకి ఎంత తృప్తిగా వుంటుందో!

అన్నీ వుండి నువ్విలా ఆలోచిస్తున్నావు... బాధపడుతున్నావు. దేశంలో చాలామంది పరిస్థితి ఇదే! అయినా ఆ కుటుంబాల్లో పిల్లలు నీలా బాధపడటం లేదు. ఇదే పద్ధతి, పెంపకం, ఇలాగే బతకాలి కాబోలనుకుంటున్నారు కానీ నీలా వాళ్ళంతా తల్లిదండ్రులమీద విరుచుకుపడటంలేదు. అనవసరపు ఆలోచనలతో మనసు పాడుచేసుకుంటున్నావేమోననిపిస్తుంది నాకు" అన్నాడు.

స్వప్నకి కోపంవచ్చింది అతని మాటలకి. "అంటే... అందరిలానే ఆలోచించమంటావన్నమాట నన్నూ! చదువుకుని మగాడితో సమానంగా హక్కులూ, బాధ్యతలూ పొందిన స్త్రీలు పెళ్ళికాకముందు తండ్రి అధీనంలోనూ, పెళ్ళయాక భర్త అధీనంలోనూ బతక్క తప్పదా? ఇంక స్వేచ్ఛ ఎక్కడ ఆమెకి? ధైర్యంగా,




స్వతంత్రంగా ఆలోచించగల ఆడది తమ తల్లిదండ్రుల పెంపకంలో తన వ్యక్తిత్వానికేమైనా దెబ్బతగిలే విధంగా ప్రవర్తిస్తున్నదీ లేనిదీ తెలుసుకోలేదా! తెలిసీ అలా బతకటం దేనికి? జీవితానికో అర్థంపరమార్థం ఎలా వుంటుంది?" అంది ఆవేశంగా.

"నిజమే స్వప్నా... కానీ నీలా ఆలోచించి తనని అన్యాయంచేస్తున్న ఈ సమాజాన్ని ఎదిరించి నిలవాలనే మానసిక మైన ఎదుగుదల వుండటంలేదేమో! పైగా ఏదో తిండి బట్ట చదువు అన్ని సౌకర్యాలూ వుండగా ఇంక స్వాతంత్ర్యం ఏమిటి అనే ఆశ్చర్యం కనిపిస్తుంది చాలామందిలో తెల్సా" అన్నాడతను.

"అవును శరత్... ఆడది గడప దాటటమే మహా పాపం. భర్తకి చాకిరీచేస్తూ, పిల్లల్ని కనీ పెంచటం కోసమే ఆమె పుట్టిందనే రోజులు నాటినుంచీ బైటపడనందుకే పొంగిపోతున్నారు. అందుకే మగవాడికి ఆడదంటే అంత ధిక్కారం. ఎప్పటికి మార్పు వస్తుందో ఏమో" దీర్ఘంగా నిట్టూరుస్తూ అంది.

ఆ మాటకి శరత్ లోలోపల నవ్వుకుని పైకిసీరియస్‌గాముఖం పెట్టి-"నాకూ అంతే స్వప్నా!ఏదో నీ ప్రేమ పొందాలని మంచి వాడిలానటిస్తున్నానే కానీనిజానికి స్త్రీ ఎంత ఉన్నతురాలైనా మగాడికి లొంగి వుండవలసిందే అనే అభిప్రాయాలు నావి. నిన్ను పెళ్ళిచేసుకుని, నువ్వు పిల్లల్ని కంటూ, ఇల్లూడుస్తూ, ముగ్గులేస్తూ... నాలుగ్గోడల మధ్య అలా వుంచాలని నా కోరిక'' అన్నాడు.

స్వప్న రోషంగా చూసింది అతన్ని. ''నీవన్నీ తీరని కోరికలే పాపం. నిజంగా ఆ వుద్దేశాలే నీకుంటే ఆ మొదటి నిముషంలోనే తమలపాకుల్లో పెట్టి ఇస్తాను నీ తాళి, దైవోర్స్సును. హుం అంది ముఖం పక్కకి తిప్పుకుని.

గట్టిగా నవ్వేశాడు అతను. అతని నవ్వు పరిసరాల్లో ప్రతిధ్వనించింది. ముడుచుకున్న ఆ ముఖం చూసి గట్టిగా చప్పట్లు చరిచి మళ్ళీ మళ్ళీ నవ్వాడతను. ఆమె గడ్డం పుచ్చుకుని, ముఖాన్ని తన వైపు తిప్పుకుంటూ, "కోపంలో ఎంత అద్భుతంగా వున్నావో.... నా కళ్ళల్లో చూసుకో ఒక్కసారి'' అన్నాడు అనునయంగా.

"ఊఁ... గొప్ప'' అని నవ్వేసింది.

ఆమె తలను తన చెంపలకానించుకుని, "దొరక్క దొరక్క దొరికిన రత్నాన్ని... ఎంత అపురూపంగా చూసుకోవాలో... నా కర్థం కావటంలేదు'' అన్నాడు. అతని గొంతులో ఆరాధన ఆమె హృదయపు టంచుల్ని తాకినట్లయింది.

ఎన్నో జన్మలుగా తను పూజలు చేసిన మనిషి అతనేనేమోననిపించింది స్వప్నకి. అతన్ని కాకుండా వేరెవర్ని చేసుకున్నా తను సుఖపడలేదు. తండ్రి కాదు, తల్లికాదు - లోకంలోని ఏ శక్తి ఎదురైనా-శరత్‌ని తన లైఫ్ పార్ట్నర్‌గా చేసుకోవాలి. అతని సహచర్యంలోనే తన బతుక్కి పరమార్థం అనుకుంది.

''శరత్! ఐ లవ్ యూ! చరిత్రలో నిజమైన ప్రేమికులం మనమే కావాలి. నా జీవితాన్ని నీకు శాశ్వతం చేస్తున్నాను స్వీకరించు'' అంది.

ఆమె మాటలకి అతని హృదయం గగుర్పొడిచింది. ప్రేమతో చప్పున ఆమె చెక్కిలిమీద ముద్దుపెట్టుకున్నాడు.

ఆశ్చర్యంతో కనురెప్పలు తాటించింది "ఏయ్...ఏమిటి నువ్వు చేసినపని"

అంది చెక్కిలి అపురూపంగా సవరించుకుంటూ.

"దాన్ని ముద్దు అని అంటార్లే. డెఫినిషన్ చెప్పనా? ఇద్దరు యువతీ యువకుల మధ్య ..." అతని నోరు గట్టిగా మూసి, "దీన్ని నలుగురూ తిరిగే పార్కు అంటారు. ఇలాంటి పనులు చేస్తే అందరూ నవ్విపోతారు అంటున్నాను. మనమింకా ఇంటికి వెళ్తే శుభం అంటున్నాను" అంది.

అతను లేచాడు. అతని చేతిని ఆసరాగా పట్టుకుని పైకి లేచి చీరకంటుకున్న ఇసుకని దులుపుకుంటూ అడుగులు ముందుకు వేసింది.




శరత్‌తో మాట్లాడి రావటంవల్ల ఒక రకమైనఆనందం, ఉత్సాహంతో ఇంట్లో అడుగుపెట్టింది స్వప్న. ఆమెను చూ గానే పల్లవి, బాబు పరుగెత్తుకొచ్చారు.

"ఎంతసేపైందమ్మా మీరు వచ్చి!" అంది బాబుని ఎత్తుకుని. పల్లవి స్వప్న చుట్టేసింది.

"పావుగంట అయింది ఆంటీ! శాంతక్క సీరియస్‌గా చదువుతోంది. మామ్మ వంటచేస్తోంది. అందుకే నీ కోసం చూస్తూన్నాం" అంది పల్లవి.

ఇద్దర్నీ చెరోపక్క సోఫాలో కూర్చోబెట్టుకుంది స్వప్న. "మీరు కూడా శాంత అక్కలా బాగా చదువుకోవాలి. తెల్సిందా? మమ్మీ ఏంచేస్తోంది?" అంది మొహానికి పట్టిన చెమటని పైటకొంగుతో అద్దుకుంటూ.

"మమ్మీ టేప్‌రికార్డరు వింటోంది. ఎప్పుడూ అంతే! మమ్మల్ని ఎక్కడికీతీసుకెళ్ళదు. టాంక్‌బండ్, మ్యూజియమ్, గండిపేట... ఇంకా చాలా వున్నాయని మా క్లాసులో రజనీ చెప్పింది. ఆంటీ... ఎప్పుడైనా వెళ్దామా?" అంది గోముగా.

స్వప్న మనసు అదోలా అయింది ఒక్క క్షణం. ఆ పిల్లలిద్దరిమీద జాలి కలిగింది.

"డాడీని ఎందుకు అడగవు?" అంది పల్లవిని దగ్గరకు తీసుకుని.

"ఊఁ... డాడీ ఎప్పుడూ కోపంగా వుంటారు. మమ్మల్ని స్కూలుకి తీసుకెళ్ళరు. ఒక ముద్దు పెట్టరు. అన్నీ వెంకటేశే చేయాలి మాకు" అంది మూతి ముడుచుకుని.

అంత చిన్నవయసులో ఆ పిల్ల మనసులో తండ్రిపట్ల అయిష్టం, తల్లిపట్ల నిర్లిప్తత ఏర్పడటం విచిత్రమనిపించింది. అయినా ఆ పిల్ల చెప్పిందేమీ అబద్ధం కాదని—ఆ మొదటిరోజు తను వెళ్ళినప్పుడు జరిగిన సంఘటనే నిదర్శనమనిపించింది.

ఆతర్వాత తను నాలుగైదుసార్లు వెళ్ళిందికానీ, కృష్ణవేణి అతని గురించేమీ మాట్లాడలేదు. ఆమెలోనూ, ఆమె నడవడిలోనూ అంతులేని దిగులు. బతుకు పట్ల నిరాశ, నిరాసక్తత కనిపించాయి. కాలక్షేపానికి కూడా ఒక పుస్తకం చదవటం, సినిమాలు చూడటం, ఫ్రెండ్సుని కలవటం ... ఇవేమీ అతనికి ఇష్టం వుండదని అర్థమైంది. అదీ...ఆమె తన భర్తమీద అయిష్టంగా చెప్పటం కానీ,




చాడీగా చెప్తున్నట్టుగానీ కాకుండా, "ఆయనకి పెద్ద ఇష్టం వుండవులాంటివి. ఇష్టంలేని పని చేయటం ఎందుకనీ" అంటుంది.

అలా భర్తని వెనకేసుకురావటం అతనిమీద నిజమైన గౌరవమూ లేక పరాయివాళ్ళదగ్గర భర్తని చులకన చేయకూడదని, తన సుఖం లేని సంసారాన్ని రహస్యంగా వుంచాలనే భావనా అనేది అర్థంకాలేదు తనకి. విని వూరుకుంది.

ఆమె చెప్పినదాన్నిబట్టి తనే వూహించుకుంది. ఆడదాని మమత, స్పందన తెలియని మూర్ఖుడని అతన్ని. అలా అని ఆమెతో తర్కించటం బావుండదనే ఉద్దేశంతో విన్నది. పైగా కొద్ది పరిచయంలోనే ఆమె తనపై చూపించే ప్రేమాభిమానాలు తనని కదిలించినట్టయింది. ఆమె పిలిచే పిలుపులో హృదయంనిండా మమత నింపుకుని, ఆమె మాటల్లో తనపై అభిమానం ... లోయల్లో జలపాతంలా తన మనసుని కుదిపేస్తుంది. ఇంత అందం, మనసువున్న ఆమె ప్రేమ పొందటం తనకెంతో ఆనందమనిపిస్తుంది. మరి ఆ భర్తకెట్లా మనసొప్పుతుందో... ఆమె సర్వసుఖాలనీ మింగేయటానికి!

కృష్ణవేణికి సంబంధించిన ఆలోచనలతో మనసు బరువెక్కినట్లయింది స్వప్నకి. ఆమె ఆలోచనలోపడటం చూసి పల్లవి, బాబు శాంతి దగ్గర చేరారు.

"పల్లవీ....ఇటురా" అని ఆ పిల్ల దగ్గరకురాగానే, "రేపు సండే మనమంతా టాంక్‌బండ్‌కి వెళ్దాం.మరోసారి గండిపేట, మ్యూజియం...సరేనా'' అంది.

పల్లవి, బాబు ముఖాల్లో కొత్త వుత్సాహం చిందులేసింది.

అప్పుడే లీలాదేవి వంటగదిలోంచి చేతులు తుడుచుకుంటూ వచ్చింది. ఆమె కుర్చీలో కూర్చోటం ఆలస్యం పల్లవి వెళ్ళి ఆవిడ వళ్ళోకి చేరింది.

ఆ పిల్లని దగ్గరకు తీసుకుని, గడియారంకేసిచూసి "స్వప్నా! ఈవేళ చాలా లేటయిందేం కాలేజీ నుంచి రావటం?" అంది.

స్వప్నగతుక్కుమన్నట్టుగా చూసింది. 'ఈ ప్రశ్నల డ్యూటీ ఈరోజు నాన్నగారికి బదులుగా అమ్మ తీసుకుంటున్నట్టుంది' అని నిట్టూర్చింది.

"అమ్మా! నేనాలస్యంగా వచ్చానంటే నువ్వేం వూహిస్తున్నావు! ఆహ్...అసలు అడుగుతున్నాను. నీ ఉద్దేశం ఏమిటో తెలుసుకుందామని" అంది.

"ఒకరకమైన ఆలోచనకాదు. లక్షరకాలుగా ఆలోచిస్తాము. పెళ్ళిదొచ్చిన ఆడపిల్లవి, చదువు మానేసి పెళ్ళి చేసుకుని నీ దారిన నువ్వు వెళ్తే హాయిగా వుంటుంది అంటే వినవు" అంటూ విసుక్కుందావిడ.

"నీకెందుకమ్మా అంత భయం. నాన్నగారు మమ్మల్నెంతో క్రమశిక్షణతో పెంచుతున్నారు. ఏ బాయ్‌ఫ్రెండుతోనైనా తిరిగే ధైర్యం వుందా నాకు. నథింగ్. అయినా నువ్వుకూడా అలా మాట్లాడతావేమ్మా! ఆయనతో నువ్వేం సుఖపడుతున్నావు? అదే చదువుకుని వుంటే ఆయనకి అణిగిమణిగి వుండే ఖర్మ వుండేది కాదుకదా" అంది.

"చదువుకీ, లోబడి వుండటానికీ ఏం సంబంధం లేదు. కట్టుకున్నవాడు మనసు లేనివాడైతే... ఎంత చదువుకున్నా, ఆర్థిక బలంవున్నా అతనికి కట్టుబడివుండాల్సిందే!

ఎంతమందిని చూడటంలేదు అట్లా! నీ దారిని నిన్ను పంపించటం మా బాధ్యత. నీ అదృష్టాన్ని బట్టి దొరుకుతాడు అతను మంచి వాడైందీ, చెడ్డవాడైందీ" అందావిడ నిర్లిప్తంగా.

ఆవిడ గొంతులో ఒకరకమైన విషాదం ధ్వనించి నట్లనిపించింది స్వప్నకి.

జరీ అంచున్న చీర కట్టుకుని, నుదుట కాసంత బొట్టు దిద్దుకుని, చేతినిండా గాజులు వేసుకుని, ఎప్పుడూ శాంతంగా, సౌమ్యంగా కనిపించే తన తల్లిలో అంతర్గతంగా ఏదో బాధ ఇమిడివున్నట్టు గ్రహించింది స్వప్న. పైకి ఆడపిల్ల పెళ్ళిచేసి పంపితే బాధ్యత తీరిపోతుందని ఛాందసంగా మాట్లాడుతుందికానీ, నిజానికి ఆవిడ అభిప్రాయం అదికాదని స్వప్నకు తెలుసు.

చాలాసార్లు మాటల్లో...'ఈరోజుల్లో ఆడపిల్లలకి తన వ్యక్తిత్వాన్ని నిలుపుకునేందుకైనా చదువు, ధైర్యం, పట్టుదల చాలా అవసరం'అంటూంటుంది. అలాంటి ధైర్యం, చొరవ తన కూతురిలో వున్నాయని ఆమెకు ప్రేమ స్వప్న అంటే.

ఆ మాతృత్వపు ప్రేమ వాత్సల్యపు భావనలకి స్వప్న పొంగి పోతుంది. అందుకే ఆమెకి తల్లి పట్ల గౌరవం.

తల్లికేసి చూస్తూ, "ఫ్రెండ్స్‌తో కలిసి అలా పార్కుకి వెళ్ళి వస్తున్నానమ్మా! అందుకే లేటయ్యింది. ఇల్లు, కాలేజీ ఇదే అయితే బోర్ అని కాస్త రిలాక్స్ కోసం అలా అలా..." అంటూ ఆగిపోయి నవ్వింది.

"ఏమిటో...నీ గొడవ.మీ నాన్నగారి



కోపం తెలిసి కూడా నువ్వు నీ ధోరణి మార్చుకోవు" మందలింపు ధోరణిలో అందావిడ.

"ఆయన మాట కాదంటే కోపగిస్తారని బాధ. అవునంటే మన కోరికలు తీరటం లేదని బాధ. ఎలా అయినా ఒకటేనమ్మా! నువ్వు స్థిమితంగా వుండు" అంటూ సోఫాలోంచి లేచింది.



పల్లవి, బాబు కోసం వెంకటేశ్ వచ్చాడు. వాళ్ళని అతనితో పంపి, స్వప్న టవల్ తీసుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్ళి షవర్ బటన్ నొక్కింది. షవర్ లోంచి వానజల్లులా కురుస్తున్న నీటికి ఎదురుగా ముఖం పెట్టి, నీళ్లు చల్లగా శరీరం మీద పడుతుంటే హాయిగా అని పించింది ప్రాణం. నాజియా హసన్ పాటేదో చిన్నగా హమ్‌చేస్తూ డ్రెస్ చేసుకుని బైటకొచ్చింది.

బెడ్‌మీద వెల్లకిలా పడుకుని, జుట్టు వెనక్కి పరిచి సీలింగ్ ఫాన్ వంక చూస్తూ, ఆలోచనల్లోపడింది చాలా సేపు.

ఆ రాత్రి భోంచేసి అలసటగా బెడ్ మీద వాలిపోయిన స్వప్నకి పదకొండు దాటినా నిద్రపట్టలేదు. శరత్‌ని గురించిన ఆలోచనలు మనసుని తీయగా వేదనగా నొక్కినట్టయింది. అతనిమాట, బుద్ధి, తర్కం ఆమెకు భవిష్యత్తుపై నిర్దిష్టమైన అభిప్రాయాలు ఏర్పడేట్టు చేశాయి. అతని తలపులతో ఆమెలోని ప్రతి అణువు మధురగానానికి పరవశించే పవిత్రమైన పువ్వులా స్పందించింది. యుగయుగాలుగా అతనికోసమే తను అనంతమైన అన్వేషణ సాగించినట్టు, ఈ జన్మలో ఆ కోరిక సిద్ధించినట్టు అనిపించింది.

తన తండ్రి అధికారంతో డబ్బుతో తన స్వప్నాలనీ, ఆదర్శాలనీ పీకనులిమి చంపకుండా, శరత్‌ని కాపాడుకోవాలి అనుకుంది. అతను లేనిదే తన జీవితానికి వెలుగులేదు, అందంలేదు అనుకుంది.

ఆలోచన్లతో నిద్రపట్టక అటుఇటు దొర్లుతున్న స్వప్నకి తండ్రి కారు గారేజ్‌లో పెట్టి మేడపైకి వచ్చినట్టు శబ్దమైంది.

గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

'చాలా టైమైంది. తెల్లారి లేవటం లేటవుతుంది. నిద్రలోకి వెళ్ళిపోవాలి' అనుకుంటూ దుప్పటినిండా కప్పుకుంది.

పావుగంట గడిచింది. భుజంగరావు గారు తమ బెడ్ రూమ్‌లోంచి వేస్తున్న కేకలు- మగతగా నిద్రపడుతున్న స్వప్నకి మెలకువని తెప్పించాయి. ముఖం మీంచి దుప్పటి తీసి పక్కన పడేసింది.

"పెందలాడే వచ్చి భోంచేసి, మీ రాచకార్యాలేమిటో వెలగబెట్టుకోవచ్చు కదా అర్ధరాత్రి వరకూ! ఇప్పుడొచ్చి వడ్డించమంటే-పగలంతా ఇంటిపనులతో సతమతమవుతూ, కాస్త నిద్రపట్టే టైముకి వస్తారు. అన్నీ టేబిల్ మీద పెట్టాను. వెళ్ళి తినండి" అంటుంది తల్లి.

"నోరు ముయ్యి. ఇంట్లో కూర్చుని వంటచేయటం కూడా పెద్ద ఘనకార్యమే! ఇరవయినాలుగ్గంటలూ బిజినెస్‌తో తలమునకలుగా లక్ష సమస్యలతో కొట్టుకుంటూ ఇంటికొస్తే అన్నం పెట్టడానికి విసుక్కునేదాన్ని నిన్నే చూశాను. అయినా నా ఇష్టమొచ్చినప్పుడు వస్తాను, వెళ్తాను. నా ఇల్లు, నా సంసారం. నిన్ను కట్టుకుంది నా కాళ్ళదగ్గర పడివుండటానికి గానీ, నీ నోటికొచ్చినట్టు వాగితే వినటానికి కాదు. లేచి అన్నంపెట్టు" కోపంతో అరుస్తున్నారు.

ఆవిడ మౌనంగా వున్నట్టు ఏం సమాధానం రాకపోయేసరికి వూపిరి బిగపట్టి వింటుంది స్వప్న.

"లే వే...చెప్తుంది నీక్కాదూ" తండ్రి గొంతు తీక్షణంగా వినిపించింది. మాటలు ముద్దగా కూడా వస్తున్నట్టు గ్రహించింది స్వప్న.





"నాకీవేళ వంట్లో బావుండలేదు. వడ్డించుకుని తినండి ఈరోజుకి" అంటోంది లీలాదేవి.

అంతే! మరో రెండు నిముషాలకి ఫెళ్ల ఫెళ్ళున చెంపలు పగులుతున్న శబ్దం వినిపించింది.

ధన్‌మని మంచి విసురుగా లేచింది స్వప్న.

ఇంతకాలం తనని కనీపెంచుతున్న మమకారమో, తిట్టినా దండించినా ఆయన గొప్పకోసమే అయినా తనకి ఏ నగలు బట్టలు కావాలన్నా, ఎంత ఖరీదయినా తీసుకునేవారనే కృతజ్ఞతాభావమో తండ్రి పట్ల వుండేది. ఇప్పుడా భావాలన్నీ మహా సముద్రంలో ఆవేశంతో ఎగిసిపడే అలలు పెద్దకొండకి తగిలి చెల్లాచెదరయినట్టు అయింది.

'మైగాడ్... ఈయన మనిషికాదూ, మృగమూ కాదు-వింతజాతి. అమ్మ వంటి మీదచేయిచేసుకునే అధికారం ఆయనకెలా వచ్చింది? పగలంతా పిల్లలకోసం, భర్త కోసం చాకిరీచేసే ఆ కాస్త విశ్రాంతి తీసుకోడం కూడా ఆయనకి ఇష్టంలేదు. నో... తను భరించలేదు. ఆడదానివంటిమీద చేయి చేసుకునే మగవాడు...ఛ ఆయన తనకి తండ్రా? కాదు...కాదు' అని విలవిలలాడింది ఆమె మనసు.

వేగంగా వెళ్లి తండ్రిని నిలదీసి అడగాలనిపించింది. కానీ ఆ అర్ధరాత్రి ఆ ఇల్లు ఒక రణరంగంగా మారటం ఇష్టంలేకపోయింది. అంత కోపంలో ఆయన ఎదుట పడే ధైర్యం, సాహసం మనసుకి రావటంలేదు. కోపంతో హృదయం రగిలిపోతోంది. తనని తాను నిగ్రహించుకోడానికి ప్రయత్నిస్తూ 'అమ్మా! మా సుఖసంతోషాలకోసం తాపత్రయపడుతూ మేమే లోకంగా బతికే నీకు ఇవన్నమాట బహుమానాలు. నీ కంటిలో ఆ కన్నీరు నేనెలా చూసేది. ఐ కాంట్ బేరిట్' నేల మీద కుప్పలా కూలబడిపోయింది స్వప్న.




సూర్యకిరణాలు లోపలికి దూసుకొచ్చి గదంతా వేడికాంతి అలముకునే వరకూ లేవలేదు స్వప్న. మెలకువ వచ్చినా, రాత్రి కలిగిన దుఃఖం, బాధ నిద్రలో మరిచిపోలేక వాస్తవం గుర్తుకొస్తుంటే భరించే శక్తిలేక సతమతమవుతూ స్తబ్దంగా పడుకుండిపోయింది.

శాంతి స్కూల్‌కి వెళ్ళటానికి తయారయినట్లుంది. డ్రెస్ చేసుకుని వచ్చింది. "ఏమిటక్కా! కాలేజీకి వెళ్ళటంలేదా ఈ రోజు? ఇంత లేట్‌గా లేచావు" అంది.

రాత్రి జరిగిన సంఘటన శాంతికి తెలియదు. చదివి చదివి అలసిపోయిన మనసు నిద్రలో వుండిపోయింది. ఈ విషయంచెప్తేఆమెఫీలింగ్సఎలాఉంటాయో తెలుసుకోవాలనిపించింది స్వప్నకి. మళ్ళీ అంతలోనే 'నిశ్చింతగా చదువుకుంటున్న పిల్లకి, అవన్నీ చెప్పి మనసు నొప్పింపటందేనికి?' అనుకుని మౌనంగా వుండిపోయింది.

"కాస్త తలనొప్పిగా వుందీవేళ. ఒక గంట ఆలస్యంగా వెళ్తాను. అమ్మ ఏం చేస్తోంది... లేచిందా?" అంది లేస్తూ.

"లేవటం ఏమిటి? ఈరోజు శుక్రవారం. పెందలాడే లేచి వంటచేసింది. పూజలో కూర్చుంది కూడాను. నువ్వే లేటు. త్వరగారా. టిఫిను తిందాం" అంటూ వెళ్ళిపోయింది అక్కడినుంచి.

స్వప్న ఆశ్చర్యపోతూ, రాత్రి అంత గొడవ జరిగినా, తెల్లారి వాటి ఛాయలు కూడా లేవు ఇంట్లోనూ, ఎవరిలోనూ! తేలిగ్గా బాధని మింగేసి, మామూలుగా ఎలా బతుకుతుంది. ఈ సంఘటన.... ఈ రాత్రేనా... ఇలాంటి సంఘటనలతో కూడిన రాత్రులు ఆమె జీవితంలో... తమకి తెలియకుండానే గతించి పోయినయ్యా?!

సుడిగుండానికి ఎదురీది అలిసి పోయినప్పుడు కానీ మనిషికి తిరుగుబాటు ధోరణి రాదేమో అనుకుంది. వచ్చినా ఈ పవిత్ర భారతభూమిలో స్త్రీలు పాతివ్రత్యపు విలువలంటూ ... అందులోనే ఎలాగో బతుకులు గడిపే స్తారు. భగవాన్ వీరిలో చైతన్యం ఎలా వస్తుందీ?

స్వప్న హృదయం వికలమై పరిష్కారం దొరకని సమస్యలతో బాధ పడుతోంది.

త్వరగా తయారయి డైనింగ్ టేబుల్ ముందు కూర్చుంది. తల్లి వడ్డిస్తూన్నా తలెత్తి ఆవిడ ముఖంలోకి చూడలేక, ఎలాగో తిన్నాననిపించి లేచింది. పుస్తకాలు తీసుకుని స్వప్న నెమ్మదిగా వెళ్తుంటే కూతుర్లో వచ్చిన మార్పుకి దుఃఖాన్ని దిగమింగుతున్నట్టు అచేతనంగా నిలబడి పోయి చూస్తోందావిడ.

* * *

ఆరోజుఆదివారం. స్వప్న మధ్యాహ్నం రెండుగంటలు దాటిన తర్వాత ఏమీ తోచక కృష్ణవేణి ఇంటికి బయల్దేరింది. ఆవేళప్పుడు కృష్ణవేణి భర్త మురళి ఇంట్లోనే వుంటాడని వెళ్ళటానికి వెనుకా డింది· కానీ ఒకసారి అతన్ని చూడాలని పించి వెళ్ళింది.

ఆమె లోపలికి అడుగుపెట్టేసరికి వెంకటేశు ఎదురయ్యాడు.

"పిల్లలేరి?" అనగానే "నిద్ర పోతున్నారమ్మా" అంటూ సమాధాన మిచ్చాడు.

"మీ అయ్యగారు...?" అంటూ గదివైపు చేయిపెట్టి చూపించింది.

"లేరు... ఇంతకుముందే బైటికి వెళ్ళారు. అమ్మగారు బెడ్‌రూమ్‌లో వున్నారు...వెళ్ళండి" అన్నాడు. అతని ముఖం ఎందుకో దిగులుగా వున్నట్లని పించింది స్వప్నకి.

గదిముందు కర్టెను తొలగించి చూసింది లోపలికి. ఆమె చూసే సమ యానికి కృష్ణవేణి బెడ్‌మీద అటు పక్కకి తిరిగి పడుకుంది. నిద్ర పోతుందేమోనని, లేపడం ఇష్టంలేక వెనుతిరగబోయి, ఒక్కసారి ఆమె పడుకున్న తీరు ఏదో అనుమానాన్ని కలిగించి ఆగిపోయింది.

పూర్తిగా పక్కకి వత్తిగిలి రెండు చేతుల్లో ముఖం దాచుకున్నట్టుగా పడుకుని వుంది కృష్ణవేణి. మరింత పరి శీలనగా చూస్తే, ఆమె ఏడుస్తున్నట్టు వీపు కదులుతోంది. దుఃఖంతో కూడిన వుచ్ఛ్వాసనిశ్వాసాలు దీర్ఘంగా వెలువడు తున్నాయి.

వంట్లో రక్తమంతా గడ్డకట్టినట్టుగా నిలబడిపోయింది స్వప్న ఒక్క నిముషం. తను వచ్చిన అలికిడి కూడా ఆమె గమనించకపోవటం కాస్త ఆశ్చర్య





మనిపించింది.

బరువెక్కిన హృదయంతో నాలుగడుగులు ముందుకువేసి "ఆంటీ" అని భుజం మీద చేయివేసి పిలిచింది.

ఆ చిన్న తాకిడికే తట్టుకోలేక పోయింది. ఎక్వేరియమ్ పగిలిపోయి భూమ్మీద పడ్డ చేపల్లే గిలగిల కొట్టుకుంది. ఆవేశంతో సలువెల్లా వణికిపోతూ, కళ్ళంట ధారగా ప్రవహిస్తున్న కన్నీళ్ళు.

రెండు చేతులూ ముఖంమీద కప్పుకుని, "నన్ను చంపేయండి... నన్ను చంపేయండి. చచ్చిపోడానికి నాకేదైనా మార్గం చెప్పు స్వప్నా..... ప్లీజ్" దుఃఖంతో వణికిపోతూ ఉద్రేకంగా అంది.

హతాశురాలైందిస్వప్న.ఆమెఅంటున్న దేమిటో ఆమె మెదడుకి అందటం లేదు వెంటనే! అయోమయంగా, అస్పష్టంగా వుంది అంతా! కొద్ది నిముషాల తర్వాత ఆమె అంటున్న దేమిటో అర్థమయ్యేకొద్దీ భయంతో గుండె బీటలు వారింది స్వప్నకి.

కృష్ణవేణి దుఃఖం చూసి తట్టుకోలేక పోతుంది. స్వప్న బలహీనత అది. ఆమె విరోధులైనవారైనా ఏ సందర్భంలో నైనా దుఃఖపడితే భరించలేదు. అందుకే ఎవరైనా తనకి విరోధులు ఏడుపు ఆయుధంగా తీసుకుని తన ముందు నిలబడటానికి ముందే తనే అక్కడినుంచి తప్పుకుంటుంది.

అలాంటిది ఈ కొద్దిరోజుల స్నేహంలో తనకెంతో ఆప్యాయతనీ, మాటల్లో ఇమడలేని ప్రేమనీ అందించిన ఆమెకి తన మనసులో ఒక ప్రత్యేకమైన పీఠాన్ని వేసుకుంది. ఆమె అలా విషాదంగా, కంటి నుంచి ధారగా ప్రవహిస్తున్న కన్నీటిని చూడలేక విలవిల్లాడింది. పెద్ద కెరటమొకటి తన్నుకుంటూ వచ్చినట్టుగా దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది.

"ఆంటీ" అంటూ ఆమెను చుట్టేసింది.

కృష్ణవేణి స్వప్న మెడచుట్టూ చేతులు వేసి, ఆమె భుజం మీద తల వాల్చి గట్టిగా కళ్ళు మూసుకుంది ఆవేదనగా! దుఃఖపు ఉరవడికి ఆమె గుండె ఎగసిపడుతోంది.

ఆ క్షణంలో తనకి, స్వప్నకి మధ్య పది పన్నెండేళ్ళ వయసు తారతమ్యం ఏమీ తెలియలేదు. తల్లీ కూతుళ్ళ మధ్య, అక్కా చెల్లెళ్ళ మధ్య అనుబంధంలా, ఇద్దరు ప్రాణ స్నేహితుల మధ్య వుండే స్నేహ సౌరభంలా అనిపించింది ఆమెకి.

ఆమెనెలా ఓదార్చాలో అర్థంకాలేదు స్వప్నకి.

అలా కొంతసేపు గడిచింది. కృష్ణవేణి నెమ్మదిగా తేరుకుని స్వప్న నించి విడివడి పక్కకు జరిగి రెండుకాళ్లు మంచంమీద పెట్టి మోకాళ్ళ మీద గడ్డమానించి కూర్చుంది.

అలా కూర్చోవడం వల్ల కనురెప్పలు కిందికి వాలి,చాలా సేపటినుంచి దుఃఖంలో మునిగివున్నట్టు వుబ్బిపోయి వున్నాయి.

ఎర్రగా కందిన ముఖాన్ని ఆర్ద్రంగా చూస్తున్న స్వప్నకి ఆమె రెండు చెంపల మీద ఎర్రగా రక్తం గూడు కట్టుకున్నట్టు పచ్చగా వేలి ముద్రలు తేలి వున్నాయి.

అవి చూడ్డంతోనే ఆమె హృదయం అగ్నిలామండింది. అంతులేనితీవ్రతతో, ఉద్రేకంతో చలించిపోయింది స్వప్న.

ఆవేశంతో కృష్ణవేణిగడ్డం పుచ్చుకుని ముఖాన్ని పైకెత్తింది.

తడి ఆరని ఆమె కళ్ల దుఃఖాన్ని నిగ్రహించుకోడానికి శతవిధాలా ప్రయ

త్నిస్తున్నట్టున్నాయి.

ఆమె చేతిని ఆప్యాయంగా తీసుకుని "ఆంటీ! మీ దుఃఖాన్ని, బాధని అర్థం చేసుకునే వయసు నాకింకా రాలేదని చెప్పి తప్పించుకోకుండా మీవారి మూర్ఖత్వానికి మంచితనపు రంగు పూసి చూపించకుండా, ఈ పువ్వుని ఇంత క్రూరంగా నలిపి హింసించే అధికారం ఎలా వచ్చిందో చెప్పండి" అంది ఆవేశంగా.

అణచిపెడుతున్న దుఃఖం ఒక్కసారిగా పగిలినట్టయింది. గతం చేస్తున్న వికటాట్టహాసాలు చెవుల్లో మారుమోగుతున్నట్టు వణికిపోతూ గాద్గదికంగా అంది—

"స్వప్నా! నా జీవితమెంత విషాదకరమో తెలిస్తే నీలాంటి పెళ్ళి కావలసిన అమ్మాయికి విరక్తి పుడుతుంది బతుకుమీద. నా బాధలతో మీకలాంటి భావం రాకూడదని నా ప్రయత్నం. అంతేకానీ, నా భర్తని వెనకేసుకురావాలనే వుద్దేశం కాదు. కానీ, ఈవేళ నీతో చెప్తే కానీ నా గుండె మంట ఆరదు" అంది.

ఏం వినవలసి వస్తుందోనని ఊపిరి బిగపట్టింది స్వప్న.

కృష్ణవేణి రెండు క్షణాలు ఆగింది.

"నేను పసితనంలో వుండగానే నా తల్లిదండ్రులు రైలు ప్రమాదంలో చనిపోయారట. మా నాన్న గవర్నమెంట్ హాస్పిటల్‌లో డాక్టరుగా పనిచేసేవారు. నన్ను మా నాన్నమ్మే అల్లారుముద్దుగా అన్నీ తనే అయి పెంచింది. ఆమె ప్రేమలో నాకేనాడూ తల్లిదండ్రులు లేరనే బాధ కలగలేదు.

నా పసితనం అద్దైతే, ఇక కాలేజీ లైఫ్ గొప్ప థ్రిల్లింగ్‌గా వుండేది. నేను కాలేజీలో చదివే రోజుల్లో... అడుగు ముందుకు వేస్తే చాలు – నా ప్రొఫైల్‌ని దొంగచాటుగా గమనించే అబ్బాయిలూ, నన్ను చూస్తేనే చాలు జన్మ ధన్యమైందని మురిసిపోయేవాళ్ళూ, ఒక్కమాట మాట్లాడితే చాలని తాపత్రయపడేవాళ్ళే అంతా!ఎంత ఆశ్చర్యం, నవ్వూ వచ్చేవో! ఇంటికీ, కాలేజీలో నా పుస్తకాల్లోకి లెక్కలేనన్ని ప్రేమలేఖలు. అవన్నీ అక్షరం వదలకుండా చదువుకునేదాన్ని. అదో ఆనందం. ఎవరిమీదా కోపంవచ్చేదికాదు. బదులు ఇచ్చేదాన్నికాదు. ప్రేమ, అనురాగం ఇలాంటివాటికి సరైన నిర్వచనాలు అందకముందే నా చదువు రెండో సంవత్సరంలో ఆగిపోయింది.

మా నాన్నమ్మ తన వయసు వుడిగిపోతోందనీ, ఈలోగా నా పెళ్ళి చూడాలనీ తాపత్రయపడింది. నాన్నమ్మ కోసం అయిష్టంగానే ఒప్పుకున్నాను. డిగ్రీ చదివాడనీ, పెద్ద కాంట్రాక్టరనీ చెప్పి ఈయన్ని సెలక్టు చేశారు మా బంధువులు. పెళ్ళిచూపుల్లో నేను కన్నెత్తి చూడ్డానికి కూడా సిగ్గుపడ్డాను. పెద్దవాళ్లు అన్నీ సవ్యంగానే చూస్తారనే ఆలోచన. పెళ్ళిచూపులయ్యీ, వాళ్లు వెళ్ళిపోయాక మావాళ్ళంతా అనుకుంటుంటే తెలిసింది. అతను చామనఛాయ అనీ, బావుంటాడనీ, నిదానమనీనూ!

పెళ్ళి ఘనంగా జరిగిపోయింది. కోటి ఆశలతో, పులకింతలతో అతనికోసం గదిలో అడుగుపెట్టాను.

సిగ్గుతో నిలబడిపోయిన నన్ను దగ్గరకు వచ్చి తీసుకెళ్తారనుకున్నాను. కానీ వచ్చి మంచంమీద కూర్చోమన్నాడు. అలాగే చేశాను.

పావుగంట మౌనం తర్వాత ఆయన అడిగిన ప్రశ్నకి తల గిర్రున తిరిగి

పోయింది.

"నీకు బాయ్‌ఫ్రెండ్ ఎవరైనా వున్నారా కృష్ణవేణీ" అని అడిగారు.

"లేరు" అని చిన్నబోతూ చెప్పాను.

"వూరంతటికీ అందగత్తెవి. కాలేజీలో చదువుతూ బాయ్‌ఫ్రెండ్స్ లేకుండా వున్నారంటే...నేనెలా నమ్ముతాను. నిజం చెప్పు... నువ్వెవ్వర్నీ ప్రేమించలేదా?" అన్నారు మళ్ళీ.

నా మతిపోయింది. "ఛ...ఛ. నేను ప్రేమించటం ఏమిటి! ప్రేమిస్తే మిమ్మల్నెందుకు చేసుకుంటాను!" అన్నాను.

"ప్రేమించినంత మాత్రాన పెళ్ళి చేసుకోవాలని ఎక్కడుంది. కాలేజీలో చదువుకునే వయసులో ప్రేమనేది జస్ట్ ఎంజాయ్‌మెంట్. ఒక బాయ్‌ఫ్రెండుని ఎన్నుకుని అతనితో జతకట్టాలని మనసు వువ్విళ్లూరుతుంది. అలా ఎవరినైనా ప్రేమించావా అంటున్నాను" అన్నారు.

"లేదు. నాకసలు అలాంటివి ఇష్టం వుండవు"

"పోనీ రోజుకి ఎన్ని ప్రేమలేఖలొచ్చేవో చెప్పు" అన్నారు ఆపిల్ కట్ చేస్తూ. అతని ముఖంలో అదో విధమైన ఉక్రోషం, మొండితనం కనిపించాయి.

ఆ ప్రశ్నకి సమాధానం చెప్పకుండా వూరుకున్నాను. రెట్టించి అడిగారు. ఎందుకో నాకు వచ్చే వుత్తరాల సంఖ్య గురించి ఆయనకి చెప్పటం బావుండదేమో అనిపించింది. అందుకే "నాకెవరూ ప్రేమలేఖలు రాయరు" అన్నాను.

చాలా గట్టిగా నవ్వారు. ఎందుకు నవ్వుతున్నారో అర్థంకాలేదు నాకు.

"నీకసలు ప్రేమలేఖలే రావా? నీకు తెలుసో లేదో- మీ కాలేజీలో చదువుతుంది భవాని నీకు జూనియర్. ఆమె నా కజిన్. ఆమెని డ్రాప్ చేయటానికి మీ కాలేజీకి వస్తూండేవాడిని. అప్పుడే చూశాను నిన్ను. నువ్వు కాలేజీ బ్యూటీ అని భవానీ చెప్పింది. నాలుగైదు ప్రేమలేఖలు రాశానుకూడా నీకు. జవాబు రాలేదు. నేను చాలా మొండివాణ్ని. నేను కావాలనుకున్నదేదైనా నా స్వంతంకాకపోతే నిద్ర పట్టదు... మనిషినికాను. అందుకే నిన్ను కోరి పెళ్ళిచేసుకున్నాను" అతని ముఖంలో కన్పించిన గర్వానికి నా మనసు బరువెక్కింది.

"కాబట్టి నీకు ప్రేమలేఖలే రావంటే నేనెలా నమ్ముతాను. నిజంచెప్పు...నువ్వెవ్వర్నైనా ప్రేమించావా" అన్నారు మళ్ళా.

వింటున్న నాకు అతని అర్థంలేని ప్రశ్నలకు విసుగుపుట్టింది. వళ్ళు కుతకుత వుడికిపోయింది. ఒక ముద్దు ముచ్చట లేకుండా గదిలో అడుగుపెట్టటమే... ఇలాంటి అర్థంపర్థంలేని సంభాషణ వినవలసిరావటం వింతగా,భయంగా తోచింది.

మళ్ళీ అతన్నుంచి అదే ప్రశ్న.

"నేనెవర్నీ ప్రేమించలేదంటే వినరేమిటి? ప్రేమని మీలాగా అంత తేలిగ్గా తీసుకునేదాన్ని కాదు - ఒకర్ని ప్రేమించి, మరొకర్ని పెళ్ళాడటానికి. నాకొచ్చే ప్రేమలేఖల్ని నేనెప్పుడూ లెక్కపెట్టలేదు. చాలా? ఇంక మీ ప్రశ్నలతో నన్ను చంపకండి ఈవేళ్టికి" అన్నాను విసుగ్గా.

అంతే! కన్నుమూసి తెరిచేలోగా ఏం జరిగిందో పూర్తిగా గ్రహించేలోగానే, నేను స్పృహ కోల్పోయాను-ఆయన నా చెంపమీద వేసిన దెబ్బకి.

అరగంట తర్వాత తెలివొచ్చి చూసేసరికి నేను మంచం మీద పడున్నాను.

బాల్కనీలో కూర్చొని సిగరెట్ తాగుతూ కన్పించారు. నన్నూ, నా పరిస్థితినీ చూసుకుని వెక్కి వెక్కి ఏడ్చాను. కుమిలి పోయాను. ఈ పరిస్థితి ఈ ఒక్క రోజేనా, నా జీవితమంతా ఇంతేనా అని దిగులుపడిపోయాను. ఆ కొద్దిసేపట్లో జరిగిపోయినదంతా తల్చుకుంటే వళ్ళు గగుర్పొడిచింది.

అర్ధరాత్రివరకూ అలా వణికిపోతూనే గడిపాను. వంట్లో శక్తి పూర్తిగా నశించి నట్లు చాలా నిస్సత్తువుగా అనిపించింది. అతను లోపలికి వచ్చారు. నన్ను చూసి సారీ చెప్తారని ఎంతో ఆశపడ్డాను. కనీసం నావైపు కన్నెత్తికూడా చూడకుండా లైటాఫ్‌చేసి నా పక్కకి చేరారు.

స్వప్నా! గొప్ప చెప్పటం కాదుకానీ నా అందం గురించి గొప్ప గొప్ప వ్యాఖ్యానాలు వింటూ వుండేదాన్ని. అంత ప్రత్యేకమైన సౌందర్యాన్ని అతనికి నిస్సహాయంగా, అయిష్టంగా అర్పించు కున్నాను ఆ రాత్రి.

తర్వాత అయినా నా జీవితం బావుం టుందనే ఆశ ఆశగానే మిగిలిపోయింది. కొద్దిరోజుల సాంగత్యంలో అతను ఒక శాడిస్టు....మూర్ఖుడని అర్థమైంది. చాలా మంది అలాంటి మగాళ్ళల్లో వుండే జూదం, పరస్త్రీ సాంగత్యం-ఇలాంటివేమీ అతనిలో లేవు. కానీ అంతకంటే భయంకరమైన లక్షణాలు కనిపించాయి అతనిలో. ఆడదంటే అతనిదృష్టిలో చాలా



హీనమైంది. స్త్రీ స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛని భరించలేదు.

మొదట్లో అతని వుద్దేశాల్ని ప్రతిఘటించటానికి ప్రయత్నించేదాన్ని. అమానుషంగా, క్రూరంగా నన్ను కొట్టి హింసించేవాడు.

క్రమంగా ఏమీ చేయలేని నిస్సహాయత, అంతులేని స్తబ్ధత ఆవరించాయి నన్ను. అతన్ని విడిచి పారిపోవాలని అనుకునే దాన్ని ప్రతి క్షణం. కానీ అప్పటికే నా కడుపులో పెరుగుతున్న బిడ్డమీద మమకారం నన్నా పని చేయనీయలేదు



నా కుటుంబ జీవితం చూసి సంతోషించా లని తాపత్రయపడ్డ మా నాన్నమ్మకివేమీ చెప్పలేదు. తెలిసిన మరుక్షణమే ... నాకున్న ఒక్కగానొక్క అండ, ఆదరణ శాశ్వతంగా దూరమౌతుందని భయపడ్డాను.

నేను కుమిలికుమిలి ఏడవటం చూసి మా అత్తగారు సాటి ఆడదానిగా కూడా ఓదార్చేవారు కాదు. తన ఒక్కగానొక్క కొడుకు వీరత్వం చూసి, ఆడదాన్ని ఎంత చాకచక్యంగా అదుపులో పెట్టు కోగలడో గర్వంగా చెప్పుకునేది. మా మామగారు ఎప్పుడూ కృష్ణారామా అనుకుంటూ భగవధ్యానంలో గడిపేవారు. ఇంక నా బాధ ఎవరికి చెప్పుకోవాలో, ఎలా చెప్పుకోవాలో అర్థంకాలేదు.

నా సంసారిక జీవితం అతని పాదాల కింద నలిగిపోయింది. రోజంతా ఆ నాలుగ్గోడలమధ్య...దుఃఖంతో, వంటరి తనంతో గడిపేదాన్ని. పల్లవి పుట్టింది. నాకు సంగీతమంటే చాలా ఇష్టం. పెళ్ళి కాకముందు ఎంతో శ్రద్ధగా వీణ వాయించటం నేర్చుకుని సాధనచేశాను.

ఎప్పుడైనా ఆ వీణ పట్టుకుని సాధన చేస్తున్నా ఇష్టపడేవారు కాదు. అందుకే అతను లేని టైములో సాధనచేసుకుంటూ వుండేదాన్ని. అదే నాకు గొప్ప మనశ్శాంతి.

అందుకే పల్లవికి ఆ పేరు పెట్టాను. బిజినెస్సు, డబ్బు సంపాదన మీద అతని దృష్టి ఎక్కువ. పల్లవినెప్పుడూ దగ్గరకి తీసుకునేవారు కాదు. ఆ ప్రేమే వుండేది కాదు. పాక్కుంటూ వెళ్ళి అతని కాళ్ళకు చుట్టుకుంటే రెండు నిముషాలు ఎత్తుకుని దించేసేవారు.

పల్లవి ముద్దు మాటలు వింటూ న బాధని కొంత మరచిపోగలిగేదాన్ని. కా ఒక్కోసారి దాని ముఖం చూసినప్పుడ అంతులేని భయంగా వుండేది. న పోలికలన్నీ పుణికిపుచ్చుకున్న పల్ల జీవితం నా జీవితంలా కాకూడదని వే దేవుళ్ళకు మొక్కుకునేదాన్ని.

బాబు పుట్టిన తర్వాత కూడా నా జీవిత గమనంలో మార్పేమీ లేదు. మా నాన్నమ్మ నా పేరున రెండు మూడు లక్షల వరకూ ఆస్తి వదిలి పైలోకాలకు వెళ్ళిపోయింది. నాకి జీవితం ఒక అలవాటుగా అయిపోయింది.

స్వప్నా... చచ్చిపోవాలని ఎన్నో సార్లు అనుకున్నాను. సహజంగా మనం మనకోసం బతికే మనుషుల కోసమైనా బతుకుతాం. కానీ నా కోసం తాపత్ర యపడే మనిషి ఎవరూ లేరనిపింంది. నా పిల్లలకి నేను తోడుండటం కోసు... కన్న నేరానికి బతుకుతున్నాను. నేను చచ్చిపోతే నా పిల్లలు అనాథలై.... లాలించి బుజ్జగించి అన్నం తినిపించే వాళ్ళే వుండరని బతుకుతున్నాను. వాళ్ళ నలా వూహించుకుంటే... నా హృదయం పగిలిపోతుంది.

వాళ్ళకా స్థితి పట్టటం నేను భరించ లేను. నా చిన్నారి పిల్లల కోసమైనా నే నరకం అనుభవించక తప్పదు. ఊహలు, ఆలోచనలు, ఆనందం—సర్వ చాలా దారుణంగా చచ్చిపోయాయి. ఇం నా బతుకింతే! ఇలాగే ఈ అవస్థలతో ఈ బాధలతో గడిచిపోవలసిందే!" నిస్స హాయత, దైన్యం, నైరాశ్యం, బాధ అన్నీ కలగలిసి ఒక్కసారిగా మహా సముద్రమై కంటినుంచి ధారగా ప్రవ హిస్తోంది.

పదినిముషాలు గడిచినా, ఆమెలోని




సర్వశక్తులూ బలహీనమైనట్టు దుఃఖాన్ని తనలో తాను మింగలేకపోతోంది.

ఆమె చెప్పేది వింటున్న స్వప్న నిలువెల్లా వణికిపోయింది. కళ్ళల్లో రౌద్రం, కోపం జ్వలిస్తుంది. మనసు నిండా భగ్గున చెలరేగే మంటలు.

ఆవేశం, క్రోధం, ఒక వుప్పెన...

సూటిగా కృష్ణవేణి వైపు చూసింది ఒక్కసారి. దుఃఖోద్వేగంతో కదిలి పోతోంది ఆమె.

ఆమెను తనేవిధంగా ఓదార్చగలదు. ఓదార్పునంతలో ఆమె బతుకు బాగు పడుతుందా ?! ఆమెలో బాధనీ, ఆ గుండెల్లో మంటల్ని ఆ కన్నీరే ఆప గలదేమో! 'ఏడవనీ, హృదయం చల్లబడు తుంది ఆ కన్నీటి వేడికి' అనుకుంది.

కొన్ని జీవితాలు ఎందుకిలా అయిపో తాయి. ఏ రాగమూలేనట్టు, మనసు కోతుల్నీ, వేదనా బాధల్నీ తెలిపే చక్రవాకరాగమొక్కటే వాళ్ళ జీవితా నికి అన్వయింపబడుతుందేం?

ఆంటీ తనపట్ల చూపే ఆప్యాయతకి కృతజ్ఞతగా ప్రేమనీ, సానుభూతినీ పంచి పెట్టాలి. తనకోసం ఎవరూ లేరని అలమ టించే ఆమె హృదయానికి– ఆమె కోసం, ఆమెచిరునవ్వు కోసం తపించేఒక బంధం, ఒక మనిషి వుందని ఓదార్పు కలిగించాలి. ఆమెపట్ల తనకి ఎక్కడలేని ఆప్యాయత, ఆర్తి వున్నాయని చెప్పాలని అనుకుంది.

మనసునిండా ఆలోచనల రగడ...

కృష్ణవేణి భుజంమీద చేయి వేసి నెమ్మదిగా తట్టింది స్వప్న.

కొద్దిసేపటికి తేరుకుంది ఆమె.

"స్వప్నా! నా కథ చెప్పి నిన్ను బాధ పెట్టాను. నువ్వు ఇవేమీ పట్టించుకోకు. కొందరి జీవితాలు అంతే! అది వాళ్ళ దురదృష్టం'' అంది నెమ్మదిగా.

"దురదృష్టం కాదాంటీ...పిరికితనం. ఒకవిధమైన స్తబ్దత. మీలాంటి చదువు కున్నవాళ్ళ తెలివి, జ్ఞానం జీవితాన్ని సరిదిద్దుకోడానికి కాకుండా, నాశనం చేసుకోడానికి వుపయోగిస్తున్నారు. మీ కథ వింటే నాకు సానుభూతికన్నా జాలే ఎక్కువ కలుగుతోంది. సృష్టిలో ఆడ మగ పుట్టుక ఒక్కటే ! ఎందుకు... ఎందుకు మగాడి పాదాలకింద నలిగి పోవటం? మీకు అందముంది, చదువుంది, ఆర్థిక స్వాతంత్ర్యం పుష్కలంగా వుంది. ఆ రాత్రే...ఆ మొదటి రాత్రే, మీ మెడలో పదికాసుల బరువుతో వేలాడుతున్న ఆ తాళి అతని ముఖానకొట్టి బైటికి రావల సింది. ఏస్తే...మీ బతుకిలా వేదనగా మారేది కాదు.

సంఘం కట్టుబాటు అంటూ సంఘం మీదికి తోయకండి...జీవితం మీది. పది పైసల పసుపుతాడు భర్తకి భార్య మీద ఎక్కడలేని అధికారాన్ని ఇచ్చే సంఘ నీతిని పట్టుకుని వేలాడవలసిన అవసరం ఏ ఆడదానికి లేదు. మీ కోరికల్నీ...మీ అందమయిన జీవితాన్నీ ఇంతదారుణంగా, ఇంత ఘోరంగా ధ్వంసం చేశారంటే మీరు కాబట్టి సహిస్తున్నారా మనిషిని. నేనే అయితే నిముషంలో ఒక్క నిము షంలో... ఎందుకులెండి. బాధపడతారు" అంది ఆవేశంగా.

పేలవంగా నవ్వింది కృష్ణవేణి.

"సంఘనీతికోసం భయపడటం కాదు స్వప్నా! నిర్లిప్తత. అతన్నికాదని బయట కొచ్చి ఏంచేయాలి. చదువుకుని ఉద్యోగం చేస్తాను. ఉద్యోగంచేస్తూ వంటరిగా బతుకుతున్న ఆడదంటే లోకానికెంత అలుసో తెలీదా? ఒక మనిషికి మరో

మనిషి తోడులేనిదే బతుకులేదు. మన అందం చూసో, ఐశ్వర్యం చూసో మంచి మనసుతో మళ్ళీ ఎవరయినా పెళ్ళి చేసు చేసుకుంటే కొద్దిరోజులు పోయాకఅతనూ మామూలు మనిషిలా ప్రవర్తించడని నమ్మకం ఏమిటి? అప్పుడు అతన్నీ వదిలివేయాల్సిందేగా! ఇలా జీవితం గట్టి దెబ్బలతో నలిగిపోతుంది. మళ్ళీ కథ మొదటికే వస్తుంది కదా! ఏ రాయి అయితేనేం పళ్ళూడగొట్టుకోడానికి" అంది.

"నిజమే ఆంటీ! ఆ మనిషి ఎలాంటి వాడో అని ఆలోచించేలోపే ఆడదాని బతుకు నలిగిపోతుంది; కళ్ళుతెరచి నాలుగు రోజుల సాంగత్యంలో అతని బుద్ధి, లక్షణాలు బయటపడ్డాక అవి క్రూరమయిన వనిపిస్తే, కనీసం వాటిని సరిదిద్దటాని కయినా ప్రయత్నించవచ్చు కదా" అంది.

"సరిదిద్దటమంటే....?"

"సంస్కరించటం. 'నీఇష్టమొచ్చినట్లు నడవటానికి, నువ్వు చెప్పినట్లు చేయటానికి నేను నిన్ను చేసుకోలేదు ఇంత కట్నంపోసి. 'మనం మనకోసం బతికేలా ఒకర్నొకరు గౌరవించుకోడానికీ, జీవిత చరమాంకంలో నీకోసం నేనూ, నాకోసం నువ్వూ దూరమయిపోతున్నందుకు నాలుగు కన్నీటిబొట్లు రాల్చటానికీ' అని చెప్పాలి. ఇక మాటలు సామభేద దండోపాయాలు అంటారే అలా చెప్పాలి. వినని మూర్ఖుడైతే అతన్ని వదిలి దూరంగా రావటంలో తప్పులేదు. ఆంటీ! జీవితంలో అలాంటి ఘోరమయిన అనుభవం జరిగిన తర్వాత తోడుకోసం అంటూ మళ్ళీ పెళ్ళి ఎలా చేసుకోబుద్ధి పుడుతుంది. మనం కోరుకుంటే మనకు మనఃశ్శాంతి లభించే





మార్గాలు అనేకం వుంటాయి" అంది.

"పిల్లల గతేమిటి? విడిపోయే పరిస్థితే వస్తే పిల్లల్ని ఇద్దరూ పంచుకుని వాళ్ళతో దెప్పిపొడిపించుకోవాలి.తల్లినో, తండ్రినో దూరం చేశారని. వాళ్ళనలా ఏడిపించే హక్కు మనకెక్కడుంది. చుట్టూ సమాజపు నీడలు వద్దనుకున్నా మన మీద పడుతూనే వుంటాయి. తల్లిదగ్గర పెరిగే బిడ్డ తల్లి ఆలోచనలతోనూ, తండ్రి దగ్గర పెరిగిన బిడ్డ తండ్రి ఆలోచనలతోనూ పెరుగుతారు. అంటే మళ్ళీ అలాంటి ఇద్దరు వ్యక్తులు తయారవుతున్నారనేగా! వాళ్ళకి పెళ్ళిళ్ళయ్యాక ఇదే సంఘర్షణ కదా! అందుకే నాకని పిస్తుంది-మగవాడిలో మార్పురాదు. ఆడదాని జీవితం మారదు అని" అంది కృష్ణవేణి చాలా దృఢంగా. అంత ఖచ్చితంగా చెప్పటానికి ఆవిడ జీవితానుభవాలే కారణమేమో!

"హుఁ ఆంటీ" అని దీర్ఘంగా నిట్టూర్చి "ఆంటీ! మార్పు కోరుకునే మనిషి మాట్లాడవలసిన మాటలు కావివి" అంది.

"మార్పు! ఆ మార్పు కోరుతూనే మన వెనకతరం నశించింది. మన తరమూ అంతే! మన పిల్లల తరంకూడా అలా ఎదురుచూస్తూ చూస్తూ...అలా కాకూడదని నా ప్రార్థన" ఆమె కళ్ళల్లో నీళ్ళు.

"ఎందుకుఆంటీ, మీరంత సెన్సిటివ్‌గా ఆలోచిస్తారు. మార్పు రాకుండానే మన మింతటివాళ్ళమయ్యామా! పూర్వ కాలానికీ, ఇప్పటికీ ఎంత గొప్ప మార్పు వచ్చిందో మర్చిపోతున్నారు మీరు" అంది.

"ఈ మార్పుకే మురిసిపోనవసరం లేదు స్వప్నా! పెద్ద పెద్ద చదువులు చదువుకుని, మంచి పదవులు నిర్వహిస్తూ భర్త మాటకి ఎదురుచెప్పలేని ఆడవాళ్ళ

ఎంతమందో మన దేశంలో? కట్నాల కోసం కాళ్ల పారాణి ఆరని అబలల ప్రాణాలను బలితీసుకునే ప్రబుద్ధులు ఎంతమందో! ఎన్ని...ఎన్ని సమస్యలు ఈ స్త్రీ జాతికి. ఎందుకు వాళ్ళలా కుమిలి పోతున్నారు. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం వుండటం, లేకపోవటం కాదు సమస్య కట్టుకున్న మనిషి మంచివాడా, కాదా అనేది సమస్యగా అనిపిస్తుంది నాకైతే" అంది ఆవేశంగా.

"మీ అనుభవాలు మీకలాంటి అభిప్రాయాలేర్పడేలా చేశాయికానీ, అడవాళ్ళల్లో చైతన్యాన్ని కోరుకునేవాళ్ళు తక్కువ. అందుకే ఇన్ని సమస్యలు. అవన్నీ వదిలేయండి. ముందు మీ భర్తని మీరు మార్చుకోడానికి ప్రయత్నించకూడదూ!" అంది.

"చేశాను స్వప్నా! అలా చేయబట్టే ఆయనకు నా మీద మరింత ద్వేషం. భార్యంటే భార్యలానే వుండాలి. అతన్ని ఎదిరించి, అతని అధికారాన్ని కాదంటే ఏ భర్తా సహించలేడు. 'నువ్వెంత అందగత్తెవీ, ఐశ్వర్యవంతురాలివైనా నా నీడలో బతకాల్సినదానివే' అంటారాయన.

ఈరోజు ఆదివారం అని పిల్లల్ని తీసుకుని అలా సినిమాకి వెళ్దామన్నాను. వద్దన్నారు. నేనైనా పిల్లల్ని తీసుకుని షికారుకి వెళ్తానన్నాను. అంతే! బజారు దానిలా బరితెగించావంటూ ఇష్టమొచ్చినట్టు తిడుతూ, కొట్టి వెళ్ళిపోయారు.

స్వప్నా... ఆయనలో మార్పు రావటమంటే ఎడారిలో నీటి కోసం ప్రయత్నించటమే! పులిలా వేటాడి వేటాడి హింసిస్తుంటారు. రానురానూ అదోవిధమైన భయం ఏర్పడింది. ఆ భయంతోనే నా బతుకు గడిచిపోతోంది. ఇంక ఎలా బతికేతేనేం?..."

ఆమె మాటల్ని పూర్తి కానివ్వలేదు స్వప్న.

"మీ జీవితం అలా కావటానికి వీల్లేదు. జీవితాన్ని సరిదిద్దుకుని బంగారు బాటకి పునాదులు వేసుకోండి. బంగారపు పునాదులు వేసుకోవడమంటే... మీ భర్తని విడిచిపెట్టేయమని చెప్పటం లేదు. మీ భర్తలో కనిపించే సంస్కార హీనమైన లక్షణాల్ని...ఎప్పటికప్పుడు ప్రతిఘటించే ధైర్యాన్ని తెచ్చుకోమంటున్నాను. పూర్తిగా మీకనుగుణంగా ఏమీ మార్చుకోనవసరం లేదు. కొన్ని విషయాల్లో మీరు ఆయన అభిరుచుల్ని మన్నించాలి. ఇలా పరస్పరం సామరస్యంతో, ప్రేమతో దాంపత్యాన్ని సరిదిద్దుకో వచ్చుకదా!" అంది.

కానీ కృష్ణవేణి ఆమె అభిప్రాయాల్ని అంగీకరించలేకపోతోంది. ఇలాంటి సమస్య తననొక్కదాన్నే కాదు, సమాజమంతటినీ పట్టి పీడిస్తోంది. ఈ సాంఘిక దురాచారాన్ని రూపుమాపడమంటే... సమాజంలోని పరిస్థితులు, నమ్మకాలు అలా వున్నంతకాలం అది సాధ్యంకాదు. అలాంటి మంచిరోజు దగ్గర్లో లేదనే నిరాశావాదం ఒకటి ఆమెలో పాతుకుపోయింది. తర్కానికి పోతే నిజమేనేమో కూడా!

కానీ స్వప్న ....ఆమె అలా నిరాశావాదంలో బతకటాన్ని సహించలేకపోతోంది. ఆమె మనసుని, వుత్సాహాన్ని, అందాన్ని చక్కగా ఆలోచించగల విజ్ఞానాన్ని అతను బలవంతంగా అణగదొక్కుతున్నాడనుకుంటుంది. సంఘాన్ని ఉద్ధరించే తలంపు కాకపోయినా తన కళ్ళెదురుగా ఒక స్త్రీ....తనంటే

ఆప్యాయతని పంచిపెట్టే ఒక స్త్రీమూర్తి జీవితం అలా పతనంకావటం భరించలేక సాటి ఆడదానిగా కనీసపు ధైర్యాన్నయినా ఇవ్వాలనే ప్రయత్నం ఆమెది.

"ఆంటీ! నేనంటే మీకేమాత్రం ప్రేమ, అభిమానం వున్నా నా మాట వినండి. మీ జీవితాన్ని సరిదిద్దుకోడానికి ప్రయత్నించండి. ప్లీజ్... ఒక పుస్తకం చదవకుండా, ఏ వ్యాపకం లేకుండా, బయటి ప్రపంచం తెలియకుండా ఇలా పంజరంలో బతికితే— మీలో చైతన్యం, ఉత్సాహం పూర్తిగా నశిస్తాయి. జీవితం జీవించటానికి. సమాజాన్ని ధిక్కరించే సాహసాలు మీరేం చేయనవసరం లేదు. అలా చేసినా బాధలోవుండి బైటకొచ్చిన ఆడదానికి సాటి స్త్రీయే నిలువనీడ కూడా ఇవ్వని సమాజం మనది. అందువల్ల మీ భర్త ఆలోచనల్ని ధిక్కరించి,సంస్కరించి మీ సంసారాన్ని అందంగా మలుచుకోండి. అలాంటి ధైర్యాన్ని, ఆలోచనల్ని ప్రేరేపించే సాహిత్యం చదివి జీవితం పట్ల ఒక అవగాహన ఏర్పరచుకోండి, ఈ పుస్తకాలూ అవీ మీవారికేం తెలియనవసరం లేదు. ఆయన లేనిటైములో పూర్తిగా చదువుకోవచ్చు. మీరుచదవాలి. అంతే!" అంది ఆమెచేతులు తన చేతిలోకి తీసుకుని గట్టిగా నొక్కుతూ.

కృష్ణవేణి మౌనంగా వుండిపోయింది. ఆమె హృదయం బరువుగా, మాటలు రానంత అశక్తిగా వుండిపోయింది.

స్వప్న ఒకటికి పదిసార్లు చెప్పింది ఆమెకి ధైర్యాన్ని.

'తనంటే ఈ పిల్లకెందుకింత మమత' అనుకుంది పదేపదే!

మరో పావుగంట కూర్చుని, వెళ్ళిపోవటానికి లేచింది. వెళ్తూవెళ్తూ ఒక్కసారి గుమ్మంలో ఆగి, వెనక్కి తిరిగి చూసింది స్వప్న. కృష్ణవేణి తనకేసి చూసే చూపుల్లో ఎన్నో అర్థాలు గోచరించాయి. వాటి అర్థాలు వెతుక్కుంటూ బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది స్వప్న.

కృష్ణవేణి కళ్ళల్లో ఆర్ద్రత రెట్టింపై... స్వప్న రూపం మంచుపొరలా అస్పష్టంగా కనిపించింది.

కళ్ళు తుడుచుకుని లేని వుత్సాహాన్ని బలవంతాన తెచ్చుకుందుకు ప్రయత్నిస్తూ పిల్లల్ని లేపటానికి వెళ్లింది.

పల్లవి దగ్గర మరింత జాగ్రత్తగా వుంటుంది కృష్ణవేణి. ఆమె ఏమాత్రం బాధపడుతున్నట్టు కనిపించినా లక్ష ప్రశ్నలు వేస్తుంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు చూస్తే ఆ పిల్ల సహించలేదు. ఆ చిన్న మనసులో ఎలాంటి తీవ్రమైన ఆలోచనలూ కలుగచేయకూడదనీ, తామిద్దరి మధ్యా ఘర్షణ తెలియనివ్వకుండా వుండాలనీ, తెలిస్తే తండ్రిపట్ల ద్వేషాన్ని పెంచుకుంటుందనీ కృష్ణవేణి భయం.




సాగరమెప్పుడూ ప్రశాంతంగా వుండదు. ఉత్తుంగ తరంగాల వంటి పిల్ల కెరటాలు, వెల్లువలా ముంచెత్తే పెద్ద కెరటాల్లాంటి స్వల్పమైన చైతన్యాలతో పాటు మహోధృతంగా మనిషిని ముంచెత్తే

తుఫానులు, ఉప్పెనలూ మామూలే! స్తబ్దంగా ప్రవహిస్తున్న కృష్ణవేణి జీవన ప్రవాహంలో ఆ రోజు జరిగిన సంఘటన పిల్లకెరటంలా ఆమెని తాకటంతో, అప్పటి వరకూ ఆమెలో నిద్రాణమైవున్న ఉత్సాహం వళ్లువిరుచుకుంది.

ఆరోజు మురళి రైల్వే డివిజనల్ ఆఫీసులో కొత్తగా జాయినయిన భాస్కర్‌ని తన ఇంటికి డిన్నర్‌కి ఆహ్వానించాడు. వర్క్సుని ఓకే చేయించుకోడానికి, బిల్లుల్ని పాస్ చేయించుకోడానికి జూనియర్ ఇంజనీరు దగ్గర్నుండి డివిజనల్ ఇంజనీరు వరకూ... అందరికీ తరచూ ఇలాంటి పార్టీలు ఇవ్వటం మురళికి అలవాటే.

డిన్నరుకి కావలసిన వంటలన్నీ కృష్ణవేణే చేస్తుంది– వెంకటేశు సాయంతో అలా చేయకపోతే మురళికి కోపం.

అతను రాత్రి ఎనిమిది గంటలకి వస్తాడంటే మధ్యాహ్నంనుంచే వంటింట్లో సతమతమయ్యింది వంటతో.

ఏడుగంటలకల్లా వంట పూర్తిచేసి చీర కొంగుతో ముఖం తుడుచుకుంటూ, హాల్లోకి వచ్చి ఫాన్‌కింద రిలాక్స్‌గా వెనక్కివాలి కూర్చుంది.

అయిదునిముషాలు గడిచేసరికి కారు హారన్ శబ్దమైంది. గబగబ లేచి కిచెన్‌లోకి వెళ్లిపోయింది.

మురళి కారు దిగి, రెండోవైపు డోరు కేసి చూస్తూండగా అందులోంచి ఒక యువకుడు దిగాడు. ఆరడుగుల ఎత్తు తెల్లగా, అందంగా వున్నాడు. ఆరెంజ్ కలర్ షర్టు, వైట్ పాంటు టక్ చేసి హుందాగా నడుచుకుంటూ లోపలికి వచ్చాడు.

కృష్ణవేణి డైనింగ్ హాల్లో భోజనానికి అన్నీ సిద్ధంచేస్తోంది. కొత్తగా వచ్చిన ఇంజనీరు పల్లవిని, బాబుని పలకరించటం వినిపించింది.

పావుగంట తర్వాత మురళి, అతనూ డైనింగ్ రూమ్‌లోకి వచ్చి, వాష్ బేసిన్‌లో చెయ్యి కడుక్కుంటుండగా– కృష్ణవేణి అక్కడినుంచి ఇవతలికి వచ్చేయబోయింది.

మురళి ఆమెని పిల్చాడు.

"ఈమె నా భార్య... కృష్ణవేణి" అంటూ పరిచయంచేశాడు. అతన్ని చూపిస్తూ "ఈయన భాస్కర్" అని వూరుకున్నాడు.

ఆమె తలెత్తి అతన్ని చూస్తూ రెండు చేతులు జోడించి "నమస్తే" అంది. ఆమె ముఖంలో ఎలాంటి భావమూ లేదు.

కానీ అదే సమయంలో ఆమెకు ప్రతి వందనం చేస్తూనే ఆశ్చర్యంతో అతని భృకుటి ముడివడింది. ఆ చూపునలాగే నిలిపి అంతులేని ఉత్సాహంతో "మీరు..." అని ఏదో అనబోయాడతను.

మురళికి వెనుకగా నిలబడ్డ కృష్ణవేణి– తల అడ్డంగా వూపింది 'చెప్పద్దు' అన్నట్టు.

ఒక్కక్షణం అతనికేం అర్థంకాక మౌనంగా వుండి మరు నిముషం ఆత్మీయతను, గౌరవభావాన్ని మేళవించి, "మిమ్మల్ని చూస్తే ఎవరో జ్ఞాపకం వచ్చినట్లు అనిపించింది... దట్సాల్" అన్నాడతను చిరునవ్వుతో వాళ్ళిద్దరి వైపు చూసి.

"కూర్చోండి'' అంటూ కుర్చీ చూపించాడు మురళి– అతని మాటల్ని పట్టించుకోకుండా!

కృష్ణవేణి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

వెంకటేశు దగ్గరుండి అన్నీ వడ్డిస్తున్నాడు.

ఒకపక్క భోజనం చేస్తూనే, బిజినెస్‌కి సంబంధించిన విషయాలేవో మాట్లాడేస్తున్నాడు మురళి వేగంగా!

భాస్కర్ మనసు పరధ్యానంగా వుండి,



'ఆఁ...వూ' అంటూ, ''ఏమన్నారూ" అని మళ్ళీ అడుగుతున్నాడు.

మురళి నవ్వేసి, "మీరేదో ఇబ్బందిగా ఫీలవుతున్నారు... అవునా?" అన్నాడు.

"నో నో... అదేంలేదు" అంటూ నవ్వేశాడు.

కొద్ది నిముషాల తర్వాత భాస్కర్ మురళికేసి చూస్తూ, "మీది రాజమండ్రి అన్నారుకదూ! మీరు పెరగటం, చదువు అన్నీ అక్కడేనా?" అన్నాడు.

''లేదు...రాజమండ్రిదగ్గర పల్లెటూరు మాది. మా నాన్నగారు ఆ వూరి ప్రెసిడెంట్‌గా వుండేవారు. నేను రోజూ రాజమండ్రి వెళ్ళి చదువుకునేవాణ్ణి పెళ్ళయ్యాక రైల్వే బ్రిడ్జి కాంట్రాక్టుమీద అయిదేళ్ళు వుండిపోయాం. తర్వాత ఇక్కడికి వచ్చేశాం" అన్నాడు.

వాళ్ళలా మాట్లాడుకుంటూనేఉన్నారు. లోపల కృష్ణవేణి పిల్లలతో హోంవర్కు చేయిస్తూంది. భాస్కర్‌ని చూసిన క్షణం నుంచీ ఆమె మనసు పరిపరి విధాల పోతోంది.

భాస్కర్ డిగ్రీలో తన క్లాసుమేటు అని గ్రహించేసరికి ఒక్కసారి పాత జ్ఞాపకాలు అలల్లా కదలాడాయి. ఎంత వెలుగు వెన్నెలలేని తన జీవితంలో కూడా కొన్ని పాత జ్ఞాపకాలు మధుర మైనవిగా మిగిలిపోయాయి.

తన పెళ్ళి ఇంకా నెలరోజులుందనగా, ఒకరోజు కాలేజీ నుంచి నడచి వస్తుంటే, క్లాసులో అత్యంత ఉత్సాహంగా వుండే భాస్కర్ తనని చూసి విష్‌చేశాడు.

తనతోకలసి నడుస్తూ ... మాట్లాడు తుంటే చాలా తమాషాగా అనిపించింది.

"ఇన్నాళ్ళూ నాకు కవిత్వం రాదనే బాధలేదు. కానీ మిమ్మల్ని చూసిన తర్వాత, కవిత్వం రాని జన్మ ఎందుకు

బి.వి.ప్రసాద్

అనిపిస్తోంది. నిజంగా మీరు నమ్ముతారో లేదో కానీ మిమ్మల్ని చూస్తూ, కవిత్వం రాసుకుంటూ, అలాగే బతికేయాలని పిస్తుంది ఈ జన్మంతా" అన్నాడు.

తను పకపకా నవ్వింది.

తన నవ్వు చూసి, "మీరలా ఎప్పుడూ నవ్వుతూ వుండండి. గోదారి గట్లు తెంచుకుని ప్రవహిస్తున్నట్టు మీ నవ్వు అలలు అలలుగా తేలిపోతుంది మబ్బుల్లో. ఆ మబ్బుల్లో నేనూ ఒక మబ్బునై...మీ ఆనందాన్ని ఆస్వాదించే భాగ్యాన్ని కలుగ జేయండి" అన్నాడు. అతను చాలా నెమ్మదిగా, తమాషాగా మాట్లాడుతుంటే నవ్వుతూ విన్నది తను.

కొద్దిసేపయాక తనే చెప్పింది- తనకి వివాహం నిశ్చయమైందన్న విషయం. అతను ఆ విషయం తట్టుకోడానికి ప్రయత్నిస్తున్నట్టుగా, అతని నరాలన్నీ బిగుసుకుని ముఖం ఎర్రగా కందినట్ల యింది.

తర్వాత తేలిగ్గా నవ్వేస్తూ, "కంగ్రాచ్యులేషన్స్... మీ గుర్తుగా మీతో ఈ చిన్ని పరిచయం చాలు నాజన్మకి" అన్నాడు.

అంతే! ఆరోజు కనిపించటమే అతను. మళ్ళీ ఇంతకాలానికి...ఇక్కడ....ఇలా అతన్ని చూడవలసి వస్తుందనుకోలేదు.

ఇన్ని సంవత్సరాల తర్వాత అతను కనిపిస్తే తను మాట్లాడలేకపోయింది. తన నిస్సహాయతని అతను అపార్థం చేసుకోడు కదా! ఒక స్నేహితుణ్ని పలకరించే స్వేచ్ఛ కూడా తనకి లేదు అనుకుని నిట్టూర్చింది కృష్ణవేణి.

"మమ్మీ! నిద్రొస్తోంది... పడుకోమంటావా?" అంది పల్లవి ఆవులిస్తూ.

ఇద్దర్నీ పడుకోబెట్టి నడుంపరకూ దుప్పటిలాగి ఇవతలికి వచ్చింది.

భాస్కర్ ఎప్పుడు వెళ్లిపోయాడో, మురళి బెడ్‌రూమ్‌లో పడుకుని పేపరు చదువుతున్నాడు. కృష్ణవేణి రెండు ముద్దలు తిన్నాననిపించి వచ్చి పడుకుంది అలసటగా.

అయిదునిమిషాలు గడిచాయి. ఇంతలో ఫోన్ మోగింది. "ఫోన్ చూడు" పేపర్లోంచి మొహం తీయకుండా అన్నాడు.

ఆమె లేచి రిసీవర్ అందుకుని "హల్లో... హూ ఈజ్ స్పీకింగ్?" అంది నెమ్మదిగా.

"కృష్ణవేణీ....నేను భాస్కర్‌ని!" అవతల అతని కంఠంలో ఆతృత.

"రాంగ్‌నంబర్ ప్లీజ్" అని పెట్టేసి వచ్చి పడుకుంది. గుండె వేగంగా కొట్టుకుంది. భయంతో వళ్లు కంపించింది. ఒక్కసారిగా. తనలో మార్పు మురళి గమనిస్తాడేమోనని పక్కకు తిరిగి కళ్లు మూసుకుంది.

మరో పదినిమిషాలకి మళ్ళీ రింగ్ అయింది ఫోను. ఈసారి వెంటనే తనే లేచి "యస్" అంది.

మళ్ళీ అదే పిలుపు.

"మీరడిగే నంబరు ఇదికాదు. ఒకసారి డైరెక్టరీ ఎంక్వైరీకి ఫోన్‌చేసి కనుక్కోండి" అంటూ పెట్టేసింది.

"ఎవరూ..?" అన్నాడు మురళి పేపరు పక్కన పడేసి.

"ఎవరో రాంగ్‌నంబర్" అంది.

"వాడితో సోదేమిటి? రిసీవర్ తీసి పక్కన పడెయ్యి" అన్నాడు చిరాకు పడుతూ.

అదే మంచిదనుకుంది ఆమెకూడా! ఆ పని చేసివచ్చి పడుకుంది.

లైట్ ఆఫ్‌చేశాడు మురళి.

* * *




స్వప్న ఓ పది పదిహేను పుస్తకాల వరకూ తెచ్చి బెడ్‌మీద పడేసి కృష్ణవేణి పక్కన కూర్చుంది.

"స్వప్నా! ఒక్కసారే ఏమిటన్ని పుస్తకాలు" అంది కృష్ణవేణి బిత్తర పోతూ!

"మంచికో చెడ్డకో జీవితాన్ని ఇన్‌ఫ్లూయన్సుచేస్తాయనుకున్న రచనలు" పుస్తకాలన్నీ తీసి ఆమె చేతిలో పెడుతూ, "ఈ రచనలన్నీ స్త్రీల అసహాయతమీద, స్త్రీ అంటే అనుభవించిపారేసే వస్తువని భావించే దుర్మార్గులైన పురుషాధిక్యత మీదా ధ్వజమెత్తినట్టుగా రాశారు. స్త్రీ విలువలేని వ్యవస్థమీద తిరగబడాలని రాశారివి.వీరందరి పేర్లుమీరువిని వుండరని కాదు! విన్నా చదివివుండరని తెచ్చాను. ఇవి చదవండి...మీరు మీరుగా బతకటానికి కావలసిన ఆలోచనన్నీ,ధైర్యాన్నీ ఇస్తాయి" అంది.

పుస్తకాలు చదివి స్త్రీ జాతికి మగాళ్ల మీద తిరగబడేంత ధైర్యం, ఆలోచన వస్తుందంటే ఈపాటికి ఆడదాని పరిస్థితి మారిపోయేవుండేది. అలా అంటే స్వప్న వప్పుకుంటుందా! ఆమె తృప్తి కోసమైనా చదవాలి అనుకుంది కృష్ణవేణి మనసులో.

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?" అంది స్వప్న. డ్రెస్సింగ్ టేబిల్ ముందర కూర్చుని తన ముఖాన్ని అద్దంలో చూసుకుని పైట సరిచేసుకుంటూవుంటే కృష్ణవేణి స్వప్న కేసిచూసింది మెచ్చుకోలుగా.

ఆరెంజ్ కలర్ షిఫాన్ చీరలో నాజూగ్గావుంది స్వప్న. కనుబొమలు సన్నగా దిద్ది, నుదుట చిన్న బొట్టు పెట్టుకుంది. ఆమె ముఖానికి ఆ తలకట్టు ఎక్కడలేని అందాన్ని తెచ్చిపెట్టినట్టుంది మెడలో సన్నటి గొలుసు. కుడిచేతికి వాచీ.

"ఏమిటి స్వప్నా! అంత ట్రిమ్‌గా తయారయ్యావు. విశేషం ఏమిటో?" అంది కవ్వింపుగా.

"అవునాంటీ! నా బాయ్ ఫ్రెండ్‌ని కలుసుకోడానికి పార్కుకి వెళ్తున్నా" అంది క్రీగంట ఆమెను గమనిస్తూ.

కృష్ణవేణి ఆశ్చర్యపోయింది ఆమె చెప్పిన తీరుకి. ఏదో జోక్ చేస్తుందనుకుని "వేషాలు", అంది.

గట్టిగా నవ్వేసింది స్వప్న. ఆమె పక్కన కూర్చుంటూ- "ఏం ఆంటీ! నాకు బాయ్ ఫ్రెండ్ వుండకూడదా..వుండదా! వున్నా చెప్పకూడదా... చెప్పనా!" ఆమె వాక్ప్రవాహానికి అడ్డుపడింది కృష్ణవేణి.

"అబ్బా స్వప్నా ! ఇంత కొంటె పిల్లవైతే ఎలా! నీ అల్లరి భరించే శక్తి నీ బాయ్ ఫ్రెండ్‌కి వుందో లేదో తెలుసుకున్నావా ముందు" అంది.

"ఇద్దరం ఒకే పడవలో ప్రయాణం చేసేవాళ్ళం. ఇంక భరించేదేముంది" అంది ధీమాగా.

"అయ్యో" అంటూ పకపకా నవ్వింది కృష్ణవేణి.

ఆ నవ్వే స్వప్నకి ఎంతో ఇష్టం. మళ్ళీ వినలేనేమోనన్నంత ఆత్రుతతో మనసుని స్థంభింపజేసి వింటుంది. బాధల్లో పడి గిజగిజ కొట్టుకునే ఏ హృదయమైనా ఆ నవ్వు వింటే ఏదో హాయిగా వుంటుంది. తూర్పు దిక్కున పొడిచే వేగుచుక్క అందంలా ఎప్పుడూ ఆ నవ్వులో మెరుపులే'మగాడినైనా అయ్యాను కాదు...ఆంటీని ప్రేమించి పెళ్ళాడే దాన్ని...ప్చ్' అని బరువుగా నిట్టూర్చింది.



"స్వప్నా..ఎవరి గురించీ ఆలోచన?" అంది.

"ఏం లేదు.... ఇంక వెళ్తాను ఆంటీ" అంది లేస్తూ.

"ఈ అల్లరి పిల్లని కట్టుకునే అదృష్టవంతుడెవరో చెప్పనేలేదు" అంది నవ్వుతూ.

"చెప్పాలనే అనుకున్నాను. ఆ అవకాశం ఇప్పుడే ఇలా వచ్చింది. అతను మా క్లాసుమేట్ శరత్ అనీ బావుంటాడు" అంది సిగ్గుపడుతూ.

ఆమె సమాధానానికి నవ్వొచ్చి తలమీద చిన్నగా మొట్టి– "తర్వాత..." అంది.

"నా అభిరుచులకి సరిపడ్డ తత్వం. ప్రేమించి... పెళ్ళిచేసుకుని జీవితాంతం ఆ ప్రేమలోనే బతకాలని కలలు కంటున్నాము. మాట, మనసు అన్నీ ఒకటై ఇద్దరిదీ ఒకటే జీవితంగా, ప్రేమంటే ఒక యోగం అనే సిద్ధాంతంలో బతకాలనే పిచ్చి కోరిక. నిర్మలమైన వాతావరణంలో మా జీవితాల్ని అందంగా తీర్చిదిద్దుకోవాలనే తపన.

ఆంటీ...అతని చూపు, మాట నాపై అతనికున్న వెర్రి అభిమానం... ఎంత మహత్తరమైన అనుభూతులో! అతని కోసమే దేవుడు నాకు జన్మనిచ్చాడేమోననిపిస్తుంది. అతను లేకపోతే నేను బతకలేను. మా ఇంట్లో పరిస్థితి మీకు తెలుసు కదా....నాన్నగారు ఒప్పుకోరు. అయినా శరత్ కోసం ఆయన్ని అంగీకరింపజేయాలి.

ఇష్టపడకపోతే ఖచ్చితంగా చెప్పేస్తాను- శరత్‌ని తప్ప ఎవరి ముఖమూ చూడనని. చూద్దాం... ఇంకా టైముంది కదా! ఇప్పటినుంచి ఆలోచించి బాధపడటం టైము వృధానేమో" అంది తేలిగ్గా నవ్వేస్తూ.

ఇంతలో ఫోన్ మోగింది.

కృష్ణవేణి రిసీవర్ అందుకుని "హల్లో" అంది.

"నేను... భాస్కర్‌ని కృష్ణవేణీ. ఫోన్ పెట్టేయకండి. రాత్రి రెండుసార్లు నిర్దాక్షిణ్యంగా కట్ చేశారు. నామీద కోపం లేదా కృష్ణవేణీ" అన్నాడు.

"కోపమా! దేనికీ?"

"అదే ఆరోజు నా ప్రేమని వ్యక్తం చేసినందుకు మీ మనసేమైనా నొప్పించానేమో కదా" అన్నాడు.

"అదా... ఆ విషయమే నాకసలు జ్ఞాపకం లేదు"

"మరెందుకు ఫోన్ పెట్టేశారు. నాతో మాట్లాడటం ఇష్టం లేదా? దాదాపు పదేళ్ళ తర్వాత ఒక్కసారిగా మిమ్మల్ని చూసేసరికి ఎంత ఆనందమనిపించిందో తెల్సా! స్నేహపూర్వకంగా మాట్లాడటం కూడా మీకిష్టం లేకపోతే... క్షమించండి" అన్నాడు.

అతని గొంతులో ప్రతిధ్వనిస్తున్న బాధకీ, అభిమానానికీ ఆమె హృదయం రెపరెపలాడింది. వణుకుతున్న కంఠాన్ని అదుపులో పెట్టుకుంటూ, "భాస్కర్... మీకెలా చెప్పాలో, ఏం చెప్పాలో అర్థం కావటంలేదు. మన మధ్య ఆ కొద్దిపాటి పరిచయం కూడా ఆయనకి తెలియటం నాకిష్టంలేదు. బాధ పెడితే క్షమించండి" అంది.

ఆవతల కొద్దిక్షణాల మౌనం.

"కృష్ణవేణీ! నేను మీ ఇంటికి రావచ్చా?"

"రాకూడదు" అని ఫోను పెట్టేసింది. వచ్చి కేన్ ఛైర్‌లో కూర్చుని, తల వెనక్కి





వాల్చి దీర్ఘంగా నిట్టూర్చింది.

స్వప్న కోసం చూసింది. కాని ఆమె అక్కడలేదు.

పదినిమిషాల తర్వాత రెండు సంపంగి పువ్వులు కోసుకుని ఒకటి తన తలలో తురుముకుంటూ వచ్చింది.

మరొక పువ్వు కృష్ణవేణి తలలో పెట్టి "నే వెళ్తాను ఆంటీ'' అంది.

"ఊఁ... శరత్ చెట్లమధ్య తపస్సు చేస్తుంటాడు. ఆలస్యమయితే కాషాయ వస్త్రాలు ధరిస్తాడేమో వెళ్ళు త్వరగా!" అంది నవ్వుతూ.

"పోండి ఆంటీ!" సిగ్గుపడుతూ అంది.

స్వప్న పార్కుకి వెళ్ళేసరికి ఆరుగంటలు అవుతోంది. చిరుచీకట్లు అలముకుంటున్నాయి. పార్కునిండా ఎక్కడ చూసినా యువజంటల నవ్వులతో కళకళలాడుతోంది.

శరత్‌కోసం చూసింది. దూరంగా ఒక పెద్ద చెట్టుకి చేరగిలబడి, అన్యమనస్కంగా గడ్డిపరకలు తుంచుతూ కనిపించాడు. అప్పటివరకూ కాలేజీలో గేమ్స్ ఆడి వచ్చినట్టుగా అలసటగావుంది ముఖం.

ఆవేళ స్వప్న కాలేజీకి ఎగనామం పెట్టి ఇంట్లో కూర్చుంది. భుజంగరావు గారు ఆక్రితంరోజు మద్రాసు వెళ్లారు. బిజినెస్ వ్యవహారాలమీద అప్పుడప్పుడు లాంగ్‌టూర్స్ వేస్తుంటారాయన.

ఆయనలేని ఆ వారం పదిరోజులు ఇల్లు కళకళలాడుతున్నట్టుగా, మనుషులతోపాటు ఆ ఇంటి పూలమొక్కలు, చెట్లు పరిసరాలు కూడా హాయిగా గాలి పీల్చుకుంటున్నాయనిపిస్తుంది.

స్వప్న తల్లిని బలవంతంగా సినిమాలకీ, బజార్లకీ తీసుకెళ్తుంది. లీలాదేవికి సినిమాలూ అవీ అంత ఇష్టంవుండవు. "నాకిలా అలవాటయిపోయింది. మీరు వెళ్ళండి. మీ నాన్నగారికి తెలిస్తే కేకలేస్తారు. ఎందుకొచ్చిన గొడవ. నన్నిలా బతకనివ్వు" అంటుంది.

"అదేం కుదరదు. నువ్వు రావాలి. వస్తున్నావు... అంతే! ఇరవైనాలుగ్గంటలూ ఇల్లూ, భర్త, పిల్లలు, పూజ– ఇవేకానీ జీవితానికింకే పరమావధి లేదా? అసలు సరదాగా బతకాలనే వుండదా అమ్మా నీకు" అంటుంది.

ఆవిడ అవుననీ, కాదనీ అనదు. అయిష్టంగానే స్వప్నకోసం బయలుదేరుతుంది. ఆ కొద్దిగంటలూ తాత్కాలికంగా కలిగే ఆనందం మనసుకేమాత్రం తృప్తి కలిగించకపోయినా కూతుళ్ళ ఆనందమే తన ఆనందం అనుకుంటుందావిడ.

వద్దన్నా వినకుండా, ఇంగ్లీషు పిక్చర్స్‌కి తీసికెళుతుంది. అర్థంకాక కొన్ని చోట్ల రక్తంగడ్డకట్టే సీన్స్‌చూసి చిరాగ్గా స్వప్నని మందలిస్తే, ఆ దృశ్యాలు చూస్తూ చిన్నపిల్లలా ఆనందిస్తుందేతప్ప వినిపించుకోదు.

ఆయన వూళ్లో లేనన్నిరోజులూ అలా గడిచిపోతాయి వాళ్ళకి రోజులు.

అలాగే రాత్రికూడా ఆయన మద్రాసు ప్రయాణం కట్టేసరికి స్వప్న మనసు పురకలువేస్తున్న మహాప్రవాహమే అయింది. కాలేజీ ఎగ్గొట్టి ఇంట్లోనే కూర్చుంది.

శరత్ ఫోన్‌చేసి పార్కులో కలవమనగానే రెక్కలు కట్టుకుని వాలింది.

అతను వచ్చి చాలా సేపయినట్టుగా గమనించి వెళ్ళి అతని పక్కనచేరి "ఏమిటీ తపస్సా!" అంది కొంటెగా.

"అవును. నామీద ఎలాంటి ప్రేమా దోమాలేని అమ్మాయిని ప్రేమించాను.

ఇంకెప్పుడూ ప్రేమలో పడకూడదని నిర్ణయించుకుని, దేవుణ్ణి ప్రార్థిస్తేనయినా ముక్తి వస్తుందని.." అన్నాడు సీరియస్‌గా.

"సరే అయితే. ముక్కు మూసుకుని తలకిందులుగా చేస్తే ... రెండురోజులు ముందే వస్తుంది ముక్తి. నేను మరో బాయ్‌ఫ్రెండ్‌ని వెంటేసుకుని, పల్లీలు నములుతూ నువ్వు శ్రద్ధగా చేస్తున్నావో లేదో గమనిస్తుంటాను" అంది.

శరత్‌కి నవ్వొచ్చింది.

"ఎందుకింత లేటయింది స్వప్నా?" అన్నాడు.

''కృష్ణవేణి ఆంటీ దగ్గరికి వెళ్ళాను. చెప్పానుకదా ఆమె గురించి. ఆమె జీవితం అలా నలిగిపోవటం నేను భరించలేక పోతున్నాను శరత్! ఎలా అయినా ఆమె సంసారంలో మార్పు తీసుకురావాలనీ, ఆంటీ స్వేచ్ఛగా, హాయిగా బతకాలనీ కోరిక. ఆమెకీ, నాకూ ఏర్పడిన అనుబంధం అలాంటిది" అంది.

అతను మౌనంగా విన్నాడు.

కొద్దిసేపయాక చందూ, శశి సినిమా ప్రోగ్రాం వేసినట్టుగా చెప్పాడు.

అప్పటికే చాలా టైమైందని ఆటోలో బయల్దేరి వెళ్ళారు శరత్ స్వప్న ,థియేటర్ దగ్గరికి.

నలుగురూ చాలా సరదాగా, అల్లరిగా గడిపేశారు ఓ మూడుగంటల కాలాన్ని.

* * *

నెలరోజుల తర్వాత...

ఉదయం పిల్లలు స్కూలుకి వెళ్ళిపోయాక కృష్ణవేణి హాల్లో కూర్చుని పుస్తకం చదువుతోంది. వెంకటేశ వెనక పూలమొక్కలకి పాదులు చేస్తున్నాడు.

స్వప్న ఇచ్చిన పుస్తకాలన్నీ ఒక టొకటిగా శ్రద్ధగా చదువుతోందికానీ తన జీవితానికి అన్వయించుకోలేకపోతోంది ఏ విషయాన్నీ.

ఇంతలో కాలింగ్‌బెల్ మోగింది.

తలుపు తెరచివుండగా కాలింగ్‌బెల్ నొక్కిందెవరా అనిగుమ్మంకేసి చూసింది.

ఎదురుగా భాస్కర్ నిలబడివున్నాడు.

ఉలిక్కిపడింది.

అతను గుమ్మం అవతల నిలబడి లోపలికి రావచ్చా అన్నట్టు సందేహంగా చూస్తుంటే ... "లోపలికిరండి" అంది తడబాటుగా.

"మీరు రావద్దని చెప్పినా అంత సభ్యత లేకుండా ఎలా వచ్చాడా అని చూస్తున్నారా? ఫోన్‌లో ఆరోజు మీరు చెప్పిన తర్వాత, ఇంకెప్పుడూ మీ గుమ్మంలో అడుగుపెట్టకూడదనే అనుకున్నాను. కానీ రావలసివచ్చింది..బై దిబై అర్జంటుగా మురళిగారితో మాట్లాడాలి. నేవచ్చానని చెప్పండి. మీ ఫోను పలకడం లేదు పిలుద్దామంటే'' అన్నాడు గుమ్మంలో నిల్చునే.

ఆమె ముఖం చిన్నబోయింది. అపరాధిలా తల దించుకుంది. అనవసర మనిపించినా, తప్పనిసరైన పరిస్థితిలో ఆలోచనల్లో ఒక్కక్షణం కొట్టుకుపోయిం దామె.

తన ఆలోచనల్నీ, మనసునీ, తన చుట్టూ పరిస్థితుల్నీ ఎలా చెప్పాలతనికి! ఇవేమీ తెలీక...తనని అపార్థం చేసుకున్నాడు. అయినా అస్పష్టమైన గమ్యం కేసి పయనించే తనకి, స్మృతిపథంలో కొన్ని మధుర గీతాలాలపింపజేసే సంఘటనల్ని మర్చిపోకూడదేమో! అవే తన జీవితానికి వెన్నెల మరకలు. ఈ జ్ఞాపకాల రొదలో భాస్కర్ పరిచయం ఒక అందమైన వర్ణ చిత్రం. భయాలకి




లొంగి, అతన్ని సంస్కారహీనంగా రావద్దని చెప్పింది. అతనలా నిష్ఠూర మాడటం సహజమే! తనే పొరపాటు చేసింది.

అభిమానంగా, ఆప్యాయంగా పలక రించే మనిషేలేక తన హృదయం ఏ బంధానికీ, ఏ రాగానికీ చలించని రాయిలా గడ్డకట్టుకునిపోయింది. ఇలాగేసాగితే తన బతుకు ఏ రసానుభూతి లేక, ఘనీభవిం చుకుపోతుండేమో! అలా కావాలనేకదా తనూ కోరుకునేది.

కోరుకున్నా ఆ స్థితికి తనింకా చేరుకో లేదు. అందుకే... తనలో ఈ మంచి చెడుల సంఘర్షణ. ఆ ఘర్షణనుంచీ తన కెప్పటికో విముక్తి. భగవాన్! ఈ జీవితం నాకు వద్దు. నాకేదైనా విముక్తిమార్గం చెప్పు... ప్లీజ్. అప్రయత్నంగా కళ్ళలోంచి ఉరకబోతున్న కన్నీటిని వెలుపలికి రానీయని ప్రయత్నంలో ముని పంటితో నాల్క పట్టి చటుక్కున సోఫాలో కూలబడింది.

ఆమెనుంచి ఏ సమాధానం రాక వెళ్ళి పోబోతున్నవాడల్లా ఒక్క క్షణం ఆగి, ఆమె ముఖంలో కన్పిస్తున్న భావాలు చదవటానికి ప్రయత్నిస్తూ ఆశ్చర్యంగా చూశాడు ఆమెని. ఏవో కలగాపులగమైన ఆలోచనలు అస్పష్టంగాతోచి అప్రయ త్నంగా లోపలికి అడుగుపెట్టాడు.

అతనేం మాట్లాడలేదు. అలాగే నిలబడి చూశాడు ఆమెనొకసారి. ఎప్పుడూ తన స్మృతిపథంలో మెదిలే ఆమె రూపును తలచుకున్నాడు ఒక్కసారి. గలగల పారే గోదారిలా ఆమె అడుగులో ప్రతిధ్వనించే మంజీరవాలతో భూమి పునీతమైనట్టుండేది. ఆమె నవ్వులు ఉజ్వల ఉదయానికి దారి చూపుతున్నట్టూ, కాలేజీలో ప్రతి చెట్టు పుట్ట, గడ్డి దేనినడగనీ ఆమెమీద ప్రేమతో పరవశిస్తున్నామనేవి. ఉద యించే సూర్యుణ్ని చూసి, భక్తితో ప్రద క్షిణలెట్లా చేస్తామో మనుషులతోపాటు ప్రకృతి ఆమె చుట్టూ తిరిగేది!

ఆ సౌందర్యం, ఆ చల్లని చిరుజల్లు ఏ ఇంట్లోవిరియజేస్తుందో, వాటిని పొందిన అదృష్టవంతుడెవరోననే ఆలోచనలతో తన హృదయం రెపరెపలాడేది. ఆ రూపాన్ని ఇప్పుడు కళ్ళెదురుగా చూస్తుంటే చెమ్మగిలిన మనసు బరువుగా, లోలోపల్నించి అర్థం అయీకాని భావా లతో బాధలో మునిగింది.

ఒకడుగు ముందుకు వేసి, చనువుగా ఆమె చేయిపట్టుకుని తలని తనకెదురుగా తిప్పుకున్నాడు.

అనుకోని ఈ పరిణామానికి విస్తు పోతూ చల్లగా మృదువుగా తాకిన స్పర్శకు వళ్ళంతా జల్లుతో తడిసినట్టు లోపలి బాధ మంచులా చల్లబడింది.

"కృష్ణవేణీ!" అన్నాడు నెమ్మదిగా. అతని పిలుపులోని లాలన, సంస్కారం తనలోని బాధని మింగేసి ఆనందాన్ని పంచినట్టు అనిపించింది. ఆ ఆనందానికి ఆమె కళ్ళనుంచి నీళ్ళు కారుతున్నాయి. ఆమె సాంసారిక జీవితంలోని అనుభవాల దయనీయ పరిస్థితిని దాచలేని నేత్రాలు కన్నీటితో వర్షించాయి.

ఉద్వేగంతో కొట్టుమిట్టాడుతున్న ఆమెను చూసి అతను బాధపడ్డాడు.

అయిదునిమిషాలు నిశ్శబ్దంలో కలసి పోయాయి.

ఆమె నెమ్మదిగా తేరుకుంది. ఏమిటి? తనిలా ప్రతి చిన్న కదలికకు బాధపడి పోతోంది. ఇదివరకటిలా స్తబ్దంగా, నిర్జీ వంగా వుండలేకపోతోంది దేనికి? ఒక

చల్లటి చిరునవ్వుకి, ఒక రసమయ పిలుపుకీ తన మనసెందుకిలా వూగిపోతోంది. కన్నీరు ఇంకిపోయిన కళ్ళలో మళ్ళీ ఎక్కణ్ణించి నింపుకుంటోంది నీటిని. తనిలా బైటపడిపోవటం ఎంత తప్పు... ఎంత తప్పు అనుకుంది.

"కృష్ణవేణీ! ఆరోజు మీతో ఫోన్‌లో సంభాషించిన తర్వాత మీరు చెప్పకుండానే మీ జీవితం గురించి కొంత అర్థంచేసుకున్నాను. ఈవేళ పూర్తిగా అర్థమైంది. దేవుడికి నిజంగా మనసులేదు. ఈ వెన్నెల వెలుగుని ఆకాశంలో వుంచక భూమ్మీద పడేసి ఆనందిస్తున్నాడెందుకో! కృష్ణవేణీ...నన్ను క్షమించండి. తొందరపాటుగా ఇంతకుముందు ఏదో అనేశాను. మీ మనసు క్షోభపెట్టాను" అన్నాడు. అతని కంఠంలో అవ్యక్తమైన బాధ, పశ్చాత్తాపం వెల్లడవుతున్నాయి.

కృష్ణవేణి మౌనంగా వుండిపోయింది.

కొద్దిసేపయాక "ఆయనలేరు. అనుకోకుండా రాజమండ్రి వెళ్లారు పొద్దున్నే! రేపొచ్చేస్తారు. మీరే ఫోన్ చేయటమో, కలుసుకోడమో చేయండి. మీరు వచ్చి వెళ్లినట్టుగా చెప్పటం నా కిష్టంలేదు" అంది తలొంచుకుని.

ఒకసారి గాఢంగా నిట్టూర్చి "నే వెళ్తాను" అంటూ లేచాడు.

"అయ్యో... కూర్చోండి. ఏదో పరధ్యాన్నం..కాఫీకూడా ఇవ్వకుండా పంపించేస్తున్నాను. ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది.

అతని మనసంతా గజిబిజిగా తోచింది. తలొంచుకుని క్షణాలు లెక్కిస్తున్నాడు భాస్కర్.

కాఫీకప్పు అతని చేతికందిస్తూ "పిల్లలెంతమంది? ఒకసారి మీ భార్యనీ, పిల్లల్నీ తీసుకురాకూడదూ" అంది.

అతని ముఖం వాడిపోయింది.

"నా పెళ్ళయి అయిదేళ్ళు. నా భార్య చనిపోయి మూడేళ్ళు కావస్తోంది" అన్నాడు.

విస్తుపోయి చూసింది అతన్ని.

బాధని దాచుకుంటూ తలొంచుకున్నాడతను.

"డెలివరీలో ఆపరేషన్ సక్సెస్ కాక అలా జరిగిపోయింది. అప్పటినుంచి ఒంటరి బతుకే నాది. మళ్ళా పెళ్ళి చేసుకోవాలనిపించలేదు" అన్నాడు.

ఆమె ఏం మాట్లాడలేదు.

"ఇట్సాల్ రైట్...నే వెళ్తాను" అంటూ లేచాడు.

అతను ఠీవిగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్తుంటే అక్కడే నిలబడి చూసింది ఒక్క క్షణం.

అతను స్కూటర్ స్టార్ట్ చేస్తూ, ఆమెను చూశాడు.

అప్రయత్నంగా చెయ్యి వూపింది. నవ్వాడతను చిన్నగా.

స్కూటర్ వేగంగా దూసుకుపోయింది ఆమె కళ్ళ ముందునుంచి.




అప్పుడు రాత్రి తొమ్మిదిగంటలౌతోంది. వెంకటేశు వంటింట్లో మురళి వచ్చే టైమైందని, భోజనానికి అన్నీ సిద్ధం చేస్తున్నాడు. పల్లవి, బాబు నిద్రపోతున్నారు.

కాంపౌండులో వెలుగుతున్న మెర్క్యూరీ లైట్ కాంతికి మేడ కొత్త అందాలు చిమ్ముతోంది. మొక్కలు నిద్రలోకి వొరుగుతున్నట్లు సన్నగా జోగుతున్నాయి.

వాటి సంరక్షణ అంతా వెంకటేశే చూసుకుంటాడు.

అందుకే అవి అంత పచ్చగా, బలంతో, గర్వంతో తలలూగిస్తున్నాయి.

బెడ్‌రూమ్‌లో కృష్ణవేణి చదువుతూ చదువుతూ నిద్రలోకి జారిపోయింది. గుండెలమీది పుస్తకం ఆమె హృదయానికేవో పాఠాలు నేర్పుతున్నట్టు ఫాను గాలికి రెపరెపలాడుతోంది.

బైట కారు హారన్ శబ్దం వినిపించి, వెంకటేశు పరుగెత్తుకెళ్ళి గేటు తీశాడు.

మురళి కారు గారేజ్‌లో వుంచి వచ్చాడు. అతని ముఖం పగలంతా చాలా అలసిపోయినట్టుగా వాడిపోయింది. టక్ చేసుకున్న షర్టు నలిగి, చెమటతో తడసినట్టుగా వుంది. షూసు విప్పి పక్కన పడేసి, హాల్లోంచి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

కర్టెన్ తొలగించి లోపలికి అడుగు పెట్టగానే ఎదురుగా కృష్ణవేణి ప్రశాంతంగా నిద్రపోతూ కనిపించింది. ఆమె గుండెలమీద పుస్తకం చూసి, అతని భృకుటి ముడిపడింది. విసురుగా వెళ్ళి పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు. ముఖం మాడిపోయింది. హృదయం కుతకుత వుడికిపోయింది.

ఎదురుగా టేబిల్ మీద మరిన్ని పుస్తకాలు. అసలు పుస్తకాలే ముట్టుకోని ఆమె.... ఒక్కసారిగా ఇన్ని పుస్తకాలు ముందేసుకునేసరికి ఆపుకోలేని ఆవేశం కట్టలు తెంచుకుని ప్రవహించింది.

చేతిలోని పుస్తకం శక్తికొద్దీ నేలకేసి విసిరికొట్టి, "కృష్ణవేణీ... నిన్నే" అని అరిచాడు.

అతని అరుపుకి వులిక్కిపడి.




భయంతో ఒక్క వుదుటున లేచిందామె.

ఎదురుగా వ్యగ్రరూపంలో మురళి. ఆ రూపం ఆమెకి మామూలే అయినా ఆ కోపం ప్రదర్శించటానికి కారణ మేమిటో అర్థంకాక–"ఏమిటండీ... చాలా సేపైందా మీరు వచ్చి" అంది.

దూరంగా తను విసిరిపడేసిన పుస్తకం చూపిస్తూ–"ఏమిటిదీ అడ్డమైన పుస్తకాలూ చదివి ఎవర్ని ఉద్ధరించాలని. నాకిలాంటివి ఇష్టం వుండదు" అన్నాడు గట్టిగా.

ఆమె ప్రాణ్ని డిపోయినట్టు వెర్రిచూపు చూస్తోంది. నెమ్మదిగా ధైర్యాన్ని కూడదీసుకుని, "ఎందుకలా గొంతు చించుకుంటారు. కానిపనేం జరిగిందిప్పుడు. పుస్తకం చదవటం కూడా తప్పేనా! ఇరవై నాలుగ్గంటలూ గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోటం... పిచ్చిపడు తుందేమోననిపిస్తుంది. పక్కింట్లో స్వప్నని అడిగి తీసుకున్నాను కాలక్షేపానికి" అంది.

కోపోద్రేకంతో వూగిపోయాడు మురళి. ముఖం కఠినంగా మారిపోయింది. ఆ పుస్తకాల్ని, ఆమెనీ కూడా భస్మం చేయా లన్నంత కోపంతో చూస్తున్నాడు.

"ఛీ....నువ్వు ఆడదానివికాదు. భర్త మాటంటే విలువలేదు. పగలంతా కష్టపడి నీ కోసం, నీ పిల్లల కోసం నా రక్తంతా ధారపోస్తున్నాను. లోకంలో స్త్రీలంతా నీలాగే ప్రవర్తిస్తున్నారా? ఈ చెత్తంతా చదివి నన్ను గాడిదని చేద్దామను కుంటున్నావేమో! నిన్ను పెళ్ళి చేసుకుంది నిన్ను పల్లకిలో ఊరేగించి అందలం ఎక్కిద్దామనికాదు....నాకింత సేవచేసి, నా దగ్గర పడుంటావని. ఇంకె ప్పుడైనా ఇలా చూస్తే నేను సహించను" అన్నాడు కళ్ళల్లో నిప్పుల వర్షం కురిపిస్తూ.

కృష్ణవేణి తలొంచుకుని నించుంది.

'నేను చదువుతాను.ఇంకా...ఇంకా.. చదివి నీలాంటి దౌర్భాగ్యుణ్ని ఛీత్కా రించుకునేలా మనసుకు పదును పెట్టు కుంటాను. తిరగబడి నా హక్కుల్ని, బాధ్యతల్ని, స్వాతంత్ర్యాన్ని గెలుచు కుంటాను. నీకు జ్ఞానోదయమయ్యేలా, ఆడదంటే నువ్వనుకునే కీలుబొమ్మ కాదనీ, ఒక పుస్తకం చదవటంవల్ల, సినిమా చూడటం వల్ల పవిత్రతపోతుందీ అనుకునే ఛాందసుడివీ, సంస్కార హీనుడివీ అయిన నీకు పెద్ద నమస్కారం చేసి నా పిల్లలతో హాయిగా బతకటానికి పునాదులు వేసుకుంటాను' ఆవేశంతో గట్టిగా అతని చెవులు చిల్లులు పడేలా అరవాలనుకుంది.

కానీ గొంతు పైకి లేవలేదు. బాధ... హృదయమంతా కలచివేస్తున్న అతని మాటల్ని మననం చేసుకుంటూ ఆక్రోశిస్తోంది. కంటినుంచి రెండు కన్నీటి చుక్కలు రాలి హృదయం మీదుగా జారి, కింద పడ్డాయి.

కిందపడ్డ పుస్తకాలు చేతిలోకి తీసుకుంది.

"ముందా పుస్తకాలు కాల్చిపారెయ్యి. లేకపోతే నేనే ఆ పనిచేయాల్సి వస్తుంది" అన్నాడు షర్టు విప్పి హాంగరుకి తగిలిస్తూ.

కృష్ణవేణి మౌనం విడలేదు.

ఇంతలో తండ్రి కేకలకి ఉలిక్కిపడి లేచిన పల్లవి పరుగెత్తుకుంటూ వచ్చింది గదిలోకి.

కృష్ణవేణి కంగారుపడింది. "నిద్ర పోకుండా ఎందుకు లేచావమ్మా!" అంది పల్లవిని దగ్గరికి తీసుకుని.

పల్లవి తల్లి మాటలు వినిపించుకో లేదు. తండ్రి వంక తీవ్రంగా చూస్తోంది.

అది గమనించిన మురళి "ఏమిటా చూపు... వెళ్ళి పడుకో" అన్నాడు గట్టిగా.

"డాడీ...ఎప్పుడూ మీరలా కోపంగా వుంటారెందుకు. అందరు మమ్మీలు, డాడీలు ఇలా వుండరు. ఇంకెప్పుడు మీరు మమ్మీని తిట్టద్దు" అంది. ఇంకేదో తనలో ఎప్పటినుంచో పేరుకున్న భావాలన్నీ వ్యక్తపరచాలని ఆ పిల్లలో తాపత్రయం. కానీ మాటలు సరిగ్గా రావటంలేదు.

మురళి ముఖంలో భావాలు వర్ణనకు అందటంలేదు. ఆ పిల్ల అలా ప్రశ్నించడం తనకి తీరని అవమానంగా తోచింది.

"పిల్లల్లో నాపట్ల ద్వేషాన్ని నూరిపోసి ఈవిధంగా వుసిగొల్పుతున్నావన్న మాట. నీ శిక్షణలో వాళ్ళెంత బాగా పెరుగుతున్నారో అర్థమైంది. నిన్నేం చేసినా పాపం లేదు" అంటూ మళ్ళీ కృష్ణవేణి మీద విరుచుకుపడ్డాడు.

వేగంగా వెళ్ళి తండ్రిని చుట్టేసి "డాడీ... మీరలా తిట్టకండి మమ్మీని... ప్లీజ్" అంది ఏడుస్తూ.

పల్లవిని పక్కకు నెట్టి విసురుగా బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

అతని హృదయపు అట్టడుగుపొరల్లోని తండ్రి మనసు కరిగినట్లనిపించింది ఒక నిముషంపాటు. అందుకే తగ్గి అవతలికి వెళ్ళిపోయాడు.

ఒక్క ఉదుటున పల్లవిని దగ్గరకు తీసుకుని కన్నీరు కార్చింది కృష్ణవేణి.

తన గురించి కాదు బాధ. తన బాధలేమీ పిల్లలకి తెలియకుండా పెంచాలని తాపత్రయపడుతోందామె. అందరి పిల్లల్లా సంతోషంగా కేరింతలాడుతూ తిరుగుతుంటే చూడాలని ఆమె కోరిక. కొన్ని నిముషాల క్రితం జరిగిన సంఘటనతో ... పల్లవి మనసులో పేరుకున్న బాధనెలా తుడిచివేయాలో తన విఫలమైన జీవితపు నీడలేమీ ఆ పిల్లల మీద పడకుండా ఎలా చూడాలో అర్థంకావటంలేదని ఆలోచిస్తోంది.

పల్లవిని తీసుకుని వెళ్ళి అనంత్ పక్కన పడుకోబెట్టి, "పల్లవీ! డాడీకి ఇంకెప్పుడూ అలా అయిష్టంగా మాట్లాడనని చెప్పు" అంది.

"మరి డాడీ.... నిన్ను ఎప్పుడూ..." అంటూ తల్లివంక చూసింది జాలిగా.

"డాడీది ఉత్తుత్తి కోపం. పాపం... పగలంతా బిజినెస్ చూసుకుంటారు కదా! అలిసిపోయి అలా కోపంగా వుంటారు. నువ్వలా అనకూడదు . తెలిసిందా" అంది బుజ్జగిస్తూ.

ఆ పిల్లకి నమ్మకం కుదిరినట్టు లేదు. ఏం మాట్లాడకుండా పడుకుంది.

పల్లవిని నిద్రపుచ్చి లైటు తీసి, భోజనాల గదిలోకి వెళ్ళింది. మురళి అప్పటికే భోంచేసి చేయి కడుక్కుంటున్నాడు.

కృష్ణవేణి ముఖం కడుక్కుని వచ్చి వెంకటేశని భోంచేసేయమని చెప్పి వచ్చేస్తుంటే... "మీరెన్నిసార్లని ఇలా అన్నం మానేసి పడుకుంటారమ్మా! ఒక్క ముద్ద తిని వెళ్ల తల్లీ" అన్నాడు ఆప్యాయంగా.

నిర్లిప్తంగా నవ్వేస్తూ, "ఆకలి లేదు వెంకటేశూ! నువ్వు తినేసెయ్యి ఈ పూటకి" అని వెళ్ళిపోయింది అక్కడి నుంచి.

'బంగారుతల్లీ! నీకీకష్టాలన్నీ ఏమిటో




ఆ భగవంతుడికి నిజంగా దయలేదు' అను కుని చాప పరచుకున్నాడు.

కలతనిద్రతో తెల్లవార్లూ కొట్టు కుంటూనే వుంది కృష్ణవేణి.

* * *

ఎండ వెలుగు అద్దాల తలుపుల్లోంచి లోపలికి వచ్చి చురుక్కుమనిపిస్తున్నా పక్కమీంచి లేవబుద్ధికాలేదు కృష్ణవేణికి. వళ్ళంతా నొప్పులుగా, సలసల కాలు తున్నట్టనిపించింది. రాత్రంతా నిద్రలేక కళ్ళు మండుతున్నాయి. కాలాన్ని తెలియ జేస్తూ గడియారం చప్పుడు.

కళ్ళు తెరచి చూసింది. పదిగంటలు సూచిస్తోంది.

"అయ్యో.. టైమే తెలీలేదు. పిల్లలు స్కూలుకి ..." అనుకుంటూ లేవ బోయింది. శక్తంతా పూర్తిగా నశించినట్టు మంచంమీద పడిపోయింది. కాళ్ళు వణుకు తున్నట్టుగా, తల పగిలిపోతున్నట్టు అనిపించింది.

వెంకటేశుని పిలిచింది.

అతను రాగానే-"పిల్లల్ని స్కూలుకి పంపించావా?" అంది.

"పంపించానమ్మా"

"అయ్యగారు...?"

"చాలా పొద్దుటే వెళ్లిపోయారు పనుందని. పల్లవి, బాబూ మమ్మల్ని లేపారు. మంచి నిద్రలో వున్నారని నేనే టిఫిను తినిపించి, పాలు కలిపి ఇచ్చే శాను. ఏమ్మా! నీరసంగా వున్నారు" అన్నాడు.

"జ్వరమొచ్చినట్టుంది వెంకటేశూ. చూడూ కారెట్, కొబ్బరి సాంబారు చేసి పట్టుకెళ్లు కారేజీ. బేబీ ఇష్టంగా తింటుంది. బాబుకి పెరుగు ఎక్కువెయ్యి. కూర తినడు... ఏం" అంది.

"అలాగేనమ్మా! మీరు పడుకోండి. కాఫీతెస్తాను" అని వెళ్ళి రెండు నిముషాల్లో వేడివేడి కాఫీ తెచ్చి ఇచ్చాడు.

అతనెంత బతిమాలినా కృష్ణవేణి కాఫీ ముట్టుకోలేదు. అలా జీవచ్ఛవంలా మంచం మీదే పడుకునివుంది.

మధ్యాహ్నం రెండుగంటలు. ఫోను మోగటం వినిపించింది మగతనిద్రలో.

వెంకటేశే తీసి మాట్లాడాడు.

ఎవరు, ఏమిటి అని అడగలేదామె. ఒక అరగంట తర్వాత తన గదిలోకి ఎవరో వచ్చిన అలికిడై...కళ్ళ మూతలు విప్పి చూడాలని ప్రయత్నించింది కృష్ణ వేణి.

నుదుటిమీద చల్లటి స్పర్శకీ, 'కృష్ణ వేణీ' అని వినిపించిన పిలుపుకీ బరువుగా రెప్పలు విడదీసి చూసింది.

ఎదురుగా భాస్కర్ కనిపించాడు.

"జ్వరం మండిపోతోంది. కాఫీ కూడా తాగలేదట... ఎందుకని ?" అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

ఆమె కళ్ళు మూసుకుంది. కనుకొసల నుండి నీళ్ళు కారుతున్నాయి. రెండు నిముషాల తర్వాత అంది-

"ఇష్టం లేకపోయినా, నిస్సహాయంగా జీవితంతో పోరాడుతున్నదాన్ని. అంత తేలిగ్గా నేను చావను" గాద్గదికంగా అంది.

కన్నీటిసంద్రంలోంచి, చిక్కని చీకటి లోంచి రగిలిన ఆక్రందనలా వినిపించా యతనికి ఆమె మాటలు. అతని హృదయం గిజగిజలాడింది. పెనుచీకటిని తరమటానికి వెన్నెల చేసేపోరాటంలా మనసంతా అలజడి. అతని నిర్మలమైన హృదయాంతరాళాల్లో ఆమె పట్ల ప్రేమ, సానుభూతి, అనురాగం, ఆరాధన వంటి మహోన్నతమైన భావాలు స్పష్టమై...

అనంతమై శతకోటి కెరటాల జలపాతమై ప్రతి అణువులోంచి బైటికి వురికింది.

ఆమె తలదగ్గర కూర్చుని, ఆమె చేతిని తన చేతుల్లో బంధించి కనుకొన ల్నుంచి జారుతున్న నీటిని మృదువుగా తుడిచాడు.

"భాస్కర్..."అంది కంపిస్తూ. అది పిలుపుకాదు— ఆమె గుండె లోతుల్లోంచి వచ్చిన ఆక్రందన. ఆమె చూపు వెనక పొంగుతున్న సముద్ర ఘోష తన హృదయానికి వినిపించినట్టుగా 'కృష్ణా' అని పిలిచాడు.

అతని చూపులో ఒక లాలన, ప్రేమ, సానుభూతి... ఒక రకమైన ఔన్నత్యం ప్రతి ఫలించాయి.

ఒక్కసారి ఆ భావనల రసమయ ప్రపంచంలో మునిగిపోయింది. మహో జ్వలమైన ఉద్వేగంతో "భాస్కర్" అంటూ వెక్కి వెక్కి ఏడ్చేసింది. నరాలు తెగేట్టు, హృదయం పగిలేట్టు దుఃఖించింది. యుగాల తరబడి పేరుకున్న బాధ, దిగులు ఒక్కసారిగా కన్నీరై ప్రవహించింది.

ఆమె తల నిమురుతూ, "వూరుకో, ఏడవకు... ప్లీజ్" అన్నాడు.

నెమ్మది నెమ్మదిగా హృదయంలో బరువు దిగిపోతున్నట్టుగా, మోకాళ్ళమీద గడ్డమానించి స్తబ్దంగా వుండిపోయింది.

భాస్కర్ లేచి, వెంకటేశతో తెప్పించిన టాబ్లెట్స్ ఆమె చేతికిచ్చి కాఫీ తాగమన్నాడు.

టాబ్లెట్ వేసుకుని కాఫీ తాగింది. ఆమె చేతిలో ఖాళీ కప్పు తీసుకుని పక్కన పెట్టాడు.

కాస్సేపు నిశ్శబ్దంలో పడ్డారిద్దరూ— ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ! ఆమె చూపులు గతం మరుగై కొత్త ప్రపంచాన్ని చూస్తున్న ఆనందంతో మెరుస్తున్నట్టున్నాయి. ఆ చూపుకి అతని గుండె లయబద్ధంగా ధ్వనిస్తోంది.

"ఒక జోక్ చెప్పనా! కొత్తగా పెళ్ళయిన ఒక పిసినారి భర్త భార్యను కూడా తీసుకెళ్తే డబ్బు ఖర్చు అవుతుందని ఒక్కడే వెళ్ళాడట హనీమూన్‌కి! ఎలా వుంది. ఇది నా జోక్ కాదు...ఒక సినిమాలోది" అన్నాడు.

ఆమె పకపకా నవ్వింది.

ఆమెనలాగే చూస్తూ తన చేయి ముందుకి చాచి, "కృష్ణవేణీ! చూడు ఇంక నువ్వెప్పుడూ ఇలాగే నవ్వుతూ వుంటావనీ, ఎలాంటి కష్టసమయంలోనూ కన్నీళ్ళు పెట్టుకోననీ మాటివ్వు" అన్నాడు.

రెండు నిముషాలాగి సాలోచనగా "అలాగే" అంది—అతని చేతిలో చేయి వేయకుండానే.

అతని మాటల్లో అంతర్లీనంగా వినిపిస్తున్న ప్రేమ భావం సూటిగా ఆమె గుండెను తాకింది. అదొక మహత్తరమైన అనుభూతి.

సంఘ నియమాలు, నీతి, కట్టుబాట్లు, ప్రేమ లేని పెళ్ళిళ్ళు...నీటి బుడగల్లా ఒక్కసారి పగిలిపోయాయి ఇద్దరి మధ్యా. మహోదయం కోసం ఎదురుచూస్తున్న వారిలా... చల్లటి ప్రభాతవేళలో, నదీతీరాన, ప్రకృతి వడిలో పరవశిస్తూ, ఏక కంఠంతో సుమధుర సంగీతాన్ని ఆలాపించే రసమూర్తుల్లా వున్నారు వారు.

లేచి, "వస్తాను కృష్ణా" అన్నాడు. అతని గొంతులో అనునయం, మరింత దిగులు.

"వెళ్ళిరండి" అంది నెమ్మదిగా.

అతను గుమ్మందాటి వెళ్తూ, ఒక్కసారి

వెనక్కి తిరిగి వెంకటేశుని పిలిచి, "రాత్రి పడుకునేముందు మీ అమ్మగారికి, నువ్వు తెచ్చిన మిగతా రెండు టాబ్లెట్స్ ఇచ్చి, కాఫీ తాగమను" అన్నాడు.

"అలాగేనండి" అన్నాడు వెంకటేశు.

పదినిముషాల తర్వాత కృష్ణవేణి నుంచి పిలుపు వినిపించింది.

"వెంకటేశూ! ఆయనెవరో తెలుసా?" అంది.

"భాస్కర్ బాబుగారు.... ఆమధ్య నెప్పుడో అయ్యగారు డిన్నర్‌కి పిలిచారు. ఈయనేనా కదమ్మా?" అన్నాడు.

"అవును. ఈయన నాతోపాటు కాలేజీలో చదివారు" అంది.

వెంకటేశు ఆశ్చర్యపోయి చూశాడు. "ఆ రోజలా తెలియనట్టుండిపోయా రేమ్మా?" అన్నాడు.

"మీ అయ్యగారి సంగతి నీకు తెలీందేముంది?" అంది.

"నిజమేనమ్మా! లేనిపోని అనుమానం. ఇందాక అయ్యగారి కోసం ఫోనుచేశారు. లేరన్నాను. మీరేం చేస్తున్నారని అడిగితే నా ప్రాణానికి కంగారుపుట్టింది మీ గురించి అడుగుతున్నారేమిటా అని. అయినా చెప్పాను-జ్వరంతో పడుకున్నారని'' అన్నాడు.

"అయ్యగారికి భాస్కర్ వచ్చినట్లు చెప్పకు...గొడవ"అని ''పిల్లలు స్కూల్లో చూస్తుంటారేమో... వెళ్ళి తీసుకురా టైమైంది'' అంది.

అతను బైటికొచ్చేశాడు అక్కడి నుంచి.

అతనటు వెళ్ళిపోగానే దిండులో ముఖం దాచుకుంది కృష్ణవేణి.

మరో పావుగంటకి పిల్లలు స్కూలు నుంచి వచ్చి తల్లికి జ్వరమని తెలిసి,ఆమె పక్కనే కూర్చుని బిస్కట్లు తిని, పాలు తాగారు.

ఆరోజు స్కూల్లో విశేషాలు తల్లికి చెప్తూ ... ఆడుకున్నారు కాసేపు. టేపు ఆన్‌చేసి, అందులోంచి వచ్చే వెస్టర్న్ మ్యూజిక్‌కి అనుగుణంగా, పల్లవి బాబు డాన్సు చేస్తుంటే నవ్వుతూ చూసింది.

"మమ్మీ... నాకు డాన్సు నేర్పించు మమ్మీ"అడుగులువేస్తూ అడిగింది పల్లవి.

"డాన్సు వద్దమ్మా! సంగీతం నేర్చుకుందువుగానీ. డాన్సు నువ్వు కంటిన్యూ చేయలేవు" అంది కృష్ణవేణి.

బాబు వెంటనే అందుకుని,''మమ్మీ... మరి నాకు డిస్కో'' అన్నాడు.

"మైగాడ్!వేలెడంత లేవు నీకు డిస్కో! అలాగలాగే''అంటూ పకపకా నవ్వేసింది.

చీకటిపడింతర్వాత స్వప్న, శాంతి వచ్చారు - కృష్ణవేణికి జ్వరమని తెలిసి! స్వప్నని చూడగానే బాబు, పల్లవి వూపిరాడకుండా కబుర్లు చెప్పటం మొదలు పెట్టారు.

స్వప్న కృష్ణవేణితో మాట్లాడుతుంటే, శాంతి పిల్లల్ని దగ్గర కూర్చోబెట్టుకుని కబుర్లు వింటోంది.

స్వప్నని చూస్తే చాలు వాళ్ళలో ఎక్కడలేని వుత్సాహం వస్తుంది. తమని ఆప్యాయంగా దగ్గరికి తీసుకుని కబుర్లు చెప్తుందనీ, తమ అమ్మా నాన్న చూపించని ప్రదేశాలకీ, షికార్లకి తీసుకెళ్తుందనీ ఆమె అంటే చెప్పలేని అభిమానం ఏర్పడింది.

ఆమధ్య ఒకసారి స్వప్న గోల్కొండ, గండిపేట తీసుకెళ్ళింది పిల్లల్ని. శరత్, చందూ, శశిలతోపాటు మరో నలుగు రైదుగురు ఫ్రెండ్స్‌తో కలసి వెళ్ళారు. ఆరోజు ఆ పిల్లల ఆనందానికి అంతం




లేకుండాపోయింది.

స్వప్న కృష్ణవేణితో మాట్లాడుతూండ గానే మురళి వచ్చినట్లు కారు హారన్ వినిపించింది.

అతను లోపలికివచ్చి షూసువిప్పుతూ, ''వెంకటేశూ ! నాకోసం ఎవరైనా వచ్చారా?" అన్నాడు.

''లేదండీ. ఎవరూ రాలేదు''అన్నాడు షూసు పక్కన పడేస్తూ.

''ఫోన్సూ...!''

"వచ్చాయండి'' అంటూ చేసినవాళ్ళ పేర్లు గుర్తుపెట్టుకుని చెప్పాడు.

మురళి లోపలగదిలోకి వెళ్ళబోతుంటే బాబువచ్చి "డాడీ... మమ్మీకి జ్వర మొచ్చింది" అన్నాడు.

ఆ మాటలు వినిపించుకోనివాడిలా మరో అడుగు ముందుకు వేశాడు. ఇంతలో స్వప్న, శాంతి లోపల్నించీ బైటికి వచ్చారు.

అతన్నిచూసి "నమస్తే" అంది స్వప్న.

ఇంతకుముందెన్నడూ ఆమెను చూసి వుండకపోవటంవల్ల "మీరూ.." అన్నాడు.

"స్వప్న. భుజంగరావుగారి అమ్మా యిని. మీ పక్క బిల్డింగ్ మాదే" అంది వినయంగా.

"నమస్తే... కూర్చోండి" అన్నాడు. స్వప్నని చూడగానే రాత్రి సంఘటన గుర్తుకొచ్చింది. కోపంతో ముఖం ముడుచుకుపోయింది. రోషంతో బుసలు కొట్టాడు ఒక్కక్షణం.

"స్వప్నంటే మీరేనన్నమాట. కృష్ణ వేణికి పుస్తకప్రపంచాన్ని చూపించి పుణ్యంకట్టుకునే అమ్మాయి నీవేనా?! ఇంకెప్పుడూ ఎలాంటి పుస్తకాలు ఆమెకి అందివ్వనవసరంలేదు" అన్నాడు. ఎంత శాంతంగా పలకాలనుకున్నా సాధ్యం కావటంలేదు అతనికి.

"వాడ్డూయూ మీన్ బై ఇట్"

"పుస్తకాలు చదవటంవల్ల ఆలోచ నలు తప్పుదారిపడతాయని నా ఉద్దేశం. ఇంట్లో టీవీ, టేప్‌రికార్డర్ ఇన్నివుండగా తోచకపోవటానికేముంది" అన్నాడు.

స్వప్నకి అతని వుద్దేశం అర్థమైంది. ఇంతకుముందు ఆంటీ కూడా చెప్పింది రాత్రి జరిగిన గొడవగురించి.

అతని మాటలు వింటుంటే స్వప్నకి వళ్లుమండినట్లు అనిపించింది. ఘాటుగా సమాధానం చెప్పాలనుకుంది కానీ తను వెళ్లాక తన మీది కోపం ఆంటీ మీద చూపించవచ్చుననుకుని చిన్నగా నవ్వి అంది-

"అలాగేనండి. నాకూ పెద్ద ఇంట్రస్టు లేదు పుస్తకాలమీద. ఏదో బుక్‌షాపుకి వెళ్తే కొత్త పుస్తకాలొచ్చాయండి అంటూ ఇచ్చాడు. తప్పనిసరై తీసుకున్నాను. కొన్ని ఆంటీకిచ్చాను బలవంతంగా. మీకిష్టంలేదని తెలిస్తే అలా జరిగేదికాదు" అంది.

అతనులేచి "ఓకే ఓకే" అనుకుంటూ లోపలికి వెళ్ళిపోయాడు.

*  *  *

ఆరాత్రి కృష్ణవేణిని జ్వరమేమిటి, ఎలా వుందనీ ఏమీ పలకరించలేదు మురళి. వెంకటేశు అన్నం వడ్డిస్తే తిని వచ్చి పడుకున్నాడు. వెంకటేశే కాఫీ కలిపి టాబ్లెట్సు ఇచ్చి వచ్చాడు.

భర్త పలకరించనందుకు ఆమె ఏమీ ఆశ్చర్యపడలేదు. ఆవిధమైన జీవితానికి ఆమె బాగా అలవాటుపడిపోయింది. ఇప్పుడామెకు ఆలోచన అది కాదు. భాస్కర్ వెళ్లిపోయిన దగ్గర్నుంచీ ఒక

విధమైన భావసంఘర్షణలో మునిగి పోయింది. ఎందుకిలా జరిగింది..ఎందుకిలా జరిగింది? కలా...నిజమా? ఎలా అయితే మనసుకి సంతృప్తి? తన మనసెందు కిలా వూగిసలాడుతోంది?

అన్నీ ప్రశ్నలు... ప్రశ్నలు. మన సంతా గజిబిజి.

తన ఆలోచనల మైదానపు అంచున చివరకు దొరికిన సమాధానం ఒక్కటే. తనకోసం బాధపడి, తాపత్రయపడే ఒక మనిషి-ప్రేమ, ఆరాధన, ఆనందం అనే అద్భుతమైన అనుభూతులను పంచే ఒక మనసు దొరికినందుకు ఆమె మనసు విచిత్రమైన సంతృప్తితో నిండిపోయింది. ఆ సంతృప్తితోనే తన వివాహమైన ఇంత కాలానికి హాయిగా సర్వావస్థల్నీ మరిచి నిద్రపోయింది ఆమె.

* * *

కాలప్రవాహంలో భాస్కర్,కృష్ణవేణి మధ్య అనుబంధం మరింత బలీయ మైంది. ఆడపాదడపా మురళి లేనిటైములో ఇంటికి రావటం, గంటలకొద్దీ కూర్చుని ఒకరి జీవితాల గురించి ఒకరు కబుర్లుగా చెప్పుకుంటూ, ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటూ గడపటం పరిపాటి అయి పోయింది.

అదొక అనిర్వచనీయమైన తృప్తి ఇద్దరికీ.

అలా ఒకరిలోకి ఒకరు చూసుకుంటూ నవ్వుకుంటూనే తనకి తెలియకుండానే కృష్ణవేణి కళ్ళ నుంచి వెచ్చటి కన్నీరు కారేది.

ఇంతకాలం తను బతికిన బతుకుచాలా నిస్పృహగా, నిర్లిప్తంగా గడిచిపోయిందనీ ఇకనైనా తన జీవితానికి కొత్త అర్థాలు సృష్టించుకోవాలనీ, తన బాధలకి కృత్రిమ త్వాలకి దూరంగా, ప్రశాంతంగా సేద తీరాలనే తపన చిగురించాయి.

డబ్బుకో, నగలకో ఆశపడో, పెళ్ళి అనే సామాజిక నిబంధనలకి కట్టుబడో కాపురాలు చేసే స్త్రీల్లా... ఆ పరిధిలో తనని బంధించుకోలేకపోయిందామె. ఒక చల్లటి చిరునవ్వుకి ఆశపడింది. ఒక అనురాగపూరితమైన చూపు కోసం తపించింది. తనని తానుగా ప్రేమించే మనిషికోసం వివాహంతో తన జీవితంతో ముడిపడ్డ మనిషిని కూడా మరిచిపోవటానికి ప్రయత్నించింది.

ఆరకమైన ప్రేమ, అనురాగం, ఆప్యాయతలు భాస్కర్‌లో చూసింది. ఆ భావనల చిరునవ్వుడికి ముగ్ధురాలైంది కృష్ణవేణి. ఇంత ఆనందం, సంతోషం, ఆశ్చర్యం ఇంతకుముందెన్నడు చవి చూడలేదనిపించిందామెకి. అందుకే అతని పట్ల ఆమెకంత నమ్మకం, గౌరవం, ప్రేమ.

ఆ ఉద్విగ్నతలోనే ఒక వర్షపు సమ యంలో చల్లని మధ్యాహ్నంవేళ ఇద్దరి తనువులు అనుకోకుండానే ఒకటయ్యాయి.

అతని బిగికౌగిలి తీవ్రతకు భయంతో బిగుసుకుపోతున్నా నిరాకరించలేక పోయింది. తనకోసం సమస్తం సమర్పించ టానికి తహతహలాడుతున్న అతని ప్రేమకి బందీ అయిపోయింది కృష్ణవేణి.

ఆమె అంగీకారం అతనిలో ధైర్యాన్ని రెట్టింపుచేసింది. ఆమె చెక్కిలి మీద ముద్దుపెట్టుకుని, గాఢంగా పెనవేసు కున్నాడు. వారిలో వేడి సెగలుపొగలుగా కమ్మేసింది. వువ్వెత్తున లేచిన కెరట మొకటి ఆమెను మధురమైన అను భూతిలో ముంచెత్తి, స్వర్గంలోకి విసిరేసి వెనుతిరిగిపోయింది.




చెదిరిన ముంగురులు సరిచేసుకుంటూ అతని ఒడిలో తలపెట్టుకుని, అతని కళ్ళల్లోకి చూసింది ఏకాంతంగా!

అతని ముఖంలో ఉద్రేకం, విశ్వాసం స్పష్టంగా కనిపిస్తున్నాయి ఆమెకి.

"నీ స్నేహాన్ని, యౌవనాన్ని నా స్వార్థంకోసం బలిచేశానని అపార్థం చేసుకోకు! జీవనదులు సైతం ఏకమయ్యేలా మన తనువు, మనసు, ప్రాణం సర్వస్వం ఒకటైన మహాప్రవాహం. మన ప్రేమ ఫలించాలి. తూర్పున వుదయించే సూర్యునిలా, గుట్టల్నీ కొండల్నీ దాటి మహోన్నతంగా పెరిగిన శిఖరంలా కనిపిస్తున్నావు కృష్ణవేణీ! ఆ శిఖరాన్ని చేరుకోవాలనే తపనతో ఋషిలా తపస్సు చేస్తున్నాను. నా తపస్సు భంగం చేయకు" అన్నాడు బాధగా.

అతని మాటలకి సంతోషంతో స్థంభించిపోయింది. అంతులేని ఆనందంతో, చెమర్చిన కళ్ళతో అతని హృదయంలో తలదాచుకుంది. ఆమె నుదుట చుంబించి, తననించి విడిపించి వెళ్ళటానికి సిద్ధమయ్యాడు.

దిగులుతో, తిరిగి కలుసుకోగలమో లేదోనన్నంత బాధతో, వీడ్కోలు చెప్పింది అతనికి.

అతనటు వెళ్ళిపోగానే, గదిలోంచి బైటకొచ్చేసరికి వెంకటేశు స్కూల్నుంచి పిల్లల్ని తీసుకుని లోపలికి వస్తూ కని పించాడు.

* * *

అప్పుడే ఆకాశమంతా నక్షత్రాలు పరచుకుంటున్నాయి. వుండి వుండి చిరుగాలి తెరలు. వాటికి తోడు మొక్కలు పూలతో చేసే నాట్యాలు...ఆకాశంలో ఆతృతగా కదిలిపోతున్న మేఘాలు... వాటిని పలకరిస్తూ చంద్రోదయం.

వెంకటేశు తీరిగ్గా మొక్కల మధ్య గడ్డిలో కూర్చుని పల్లె పదాలేవో కూని రాగాలు తీస్తున్నాడు.

బాల్కనీలో నుంచుని కొద్ది గంటల క్రితం జరిగిన సంఘటన తలుచుకుంటూ వెంకటేశుని చూసింది.

ఎందుకో ఆమెకు తెలియకుండానే అతనిపట్ల అభిమానం పొంగింది. తన పెళ్ళయిన కొత్తలో వంట చేయటానికి కుదిరాడు కొత్తగా! అతని ప్రవృత్తి తనకెంతో నచ్చేది.

తన సాంసారిక జీవితం సంతృప్తికరంగా సాగటంలేదని అతను త్వరగానే గ్రహించాడు. తను మేడమీద ఒంటరిగా కూర్చుని దుఃఖిస్తున్న సందర్భాల్లో... ఎన్నోసార్లు ఓదార్చేవాడు. అతని ఆప్యాయతను ధిక్కరించలేక తనే ప్రాణంగా పెంచిన నాయనమ్మే ఈ రూపంలో ఇక్కడ ప్రత్యక్షమై వుంటుందని భావించేది. ఎడారిలో ఒంటరిగా పయనిస్తున్న తనకి వెంకటేశు పితృవాత్సల్యం ఒక వర్షపు చినుకులా మనసుని చల్లబరిచేది.

అతను తన కొడుకునీ, కోడల్నీ వదిలి రాకపోతే తను మరీ ఒంటరిదై పోయేది. ఈ ఇంటి పూర్తి బాధ్యత అతనిదే. తన భర్తకి ఏ టైమ్‌లో ఏం చేయాలో, ఎవరి దగ్గర ఎలా మసలుకోవాలో సమస్తం అతను చక్కగా నిర్వహిస్తాడు. దానికి తోడు పిల్లలు.

పసితనంనుంచీ అతని ఒడిలోనే పెరగటంతో క్షణం కనిపించకపోతే అతని కోసం గాలించేస్తారు. 'వారి ఆటాపాటే నాకు ప్రాణం' అంటాడు. తండ్రితో పెద్ద చనువు లేకపోవటంతో తమ కబుర్లు,

 

కథలు అన్నీ అతనితో చెప్పి సంతృప్తి పడతారు.

అలా తన శక్తినీ, ప్రేమనీ తన కుటుంబానికే అంకితం చేశాడతను. ఇది ఏ జన్మలో అనుబంధమో! అతనే లేకపోతే తనూ, తన పిల్లలు ఎలా వుండేవారోననిపిస్తుంది.

తను జీవితంలో ఎన్ని బాధలు పడుతుందీ, ఎలాంటి అనుభవాలు పొందిందీ ఈ జీవితాన్ని తలుచుకుని ఎంతగా కుమిలిపోయిందీ - అన్నీ చూస్తూనే వున్నాడు. ఓదార్చటం తప్ప అతనేం చేయగలడు.

భాస్కర్‌తో తన అనుబంధం ఎలా పెనవేసుకుంటుందీ ఈసరికే గ్రహించి వుంటాడు. ఒక్కమాట ..ఒక్కమాట కూడా అతను బైటపడలేదు. తన గురించి అతనేం వూహిస్తున్నాడు. తన మీద కోపమా, అసహ్యమా, జాలా, సానుభూతా? ఏమిటి?

వడివడిగా మేడమెట్లు దిగి అతన్ని చేరింది కృష్ణవేణి. ఆమెను చూసి మట్టి దులుపుకుంటూ లేవబోయాడు. అతన్ని వారించి కూర్చోమంది.

ఎదురుగా వున్న సిమెంట్ దిమ్మమీద కూర్చుని "వెంకటేశూ! నిన్ను ఒక విషయం అడగాలనుకుంటున్నాను" అంది నెమ్మదిగా.

అతను నవ్వి "పిచ్చితల్లీ! నాకర్థమైంది మీరడిగేది! భాస్కర్ బాబు గురించేకదూ" అన్నాడు.

ఆశ్చర్యపోతూ చూసిందామె.

"తల్లీ...మురళీబాబుగారితో మీరెంత సుఖపడుతుందీ నాకు తెలుసు. కానీ భర్త ఎన్ని కష్టాలెట్టినా అతనితోనే బతకమంటారు పెద్దోళ్ళు. అలా అని నేననటంలేదుకానీ, ఇప్పుడైనా మీజీవితాన్ని నలుగురూ వేలెత్తి చూపనివిధంగా సుఖపడేట్టు దిద్దుకోమంటాను. అదెలాగో ఏంటో మీరే ఆలోచించుకోండి" అన్నాడు.

అతని ఆ రెండు మాటల్లోనే ఆమెకి ఎన్నో ఆలోచనలు, ప్రశ్నలు రేకెత్తించాయి.

"వెంకటేశూ... ఈ జీవితాన్ని ఇంక ఆయనతో ఈదే శక్తిని కోల్పోయాను. క్షణక్షణానికీ అవమానాలు, ఈ దెబ్బలూ నా గుండె మోయలేకపోతోంది. నన్ను నన్నుగా, ఆదరించే మనిషికోసం ఆశపడుతోంది. ఆ మనిషే దొరికినప్పుడు ఈ లోకం ఏమనుకుంటే నాకేమిటి? నువ్వు మాత్రం నన్ను అపార్థం చేసుకోవని..." ఆమె కంఠం వణికింది.

"లేదమ్మా! మీరు సుఖపడాలని రోజూ ఎందరు దేవుళ్ళకి మొక్కుకుంటున్నానో! నేను చచ్చిపోయేలోగా ఆ ముక్క మీ నోట వినాలని నామనసెంత ఆశపడుతోందో" అంటూ ఆమెను ఓదార్చేడు.

ఆమె నిశ్శబ్దంగా వుండిపోయింది. అయిదు నిమిషాల తర్వాత వెంకటేశు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

కృష్ణవేణి ఆ మొక్కల మధ్య అలా కూలబడి చాలాసేపు, 'మామ్మా...సీతో పాటు నన్నూ ఎందుకు తీసుకుపోలేదు' అంటూ కన్నీరు కార్చింది.

పైన ఆకాశం తనకేం పట్టనట్టు నిశ్చలంగా వుంది.

* * *

ఆరోజు స్వప్న కాలేజీనుంచి వచ్చీ రావటంతోనే పుస్తకాలొకమూలకీ, చెప్పులొకమూలకీ విసిరికొట్టి మంచంమీద పడిపోయింది అలసటగా. వాతావరణం

డల్‌గా వున్నట్టనిపించింది. ఆకాశంలో మబ్బులు కమ్ముతూ, చీకట్లు నింపుతున్నాయి.

స్వప్న మోచేయి నుదుటిమీద పెట్టుకుని కళ్ళు మూసుకుంది. చల్లటిగాలి కిటికీలోంచి ముఖానికి తగులుతుంటే హాయిగా అనిపించి కళ్ళు తెరవబుద్ధి కాలేదు.

పావుగంట తర్వాత గదిలో వినిపించిన అడుగుల చప్పుడుకి బలవంతంగా కళ్ళు విప్పిచూసింది.

టీ, బిస్కట్స్ తీసుకుని శాంతివచ్చింది లోపలికి.

"అక్కా! టీ తీసుకో" అంటూ ఒక కప్పు స్వప్నకి అందించింది.

ఓపికచేసుకుని లేచి బిస్కట్స్ టీలో ముంచుకుని తింటూ, "పరీక్షలెప్పట్నించీ నీకు?" అంది.

"ఇంక రెండునెల్ల టైముంది. ఏం ఫర్వాలేదు. రివిజన్ చేయటమే!" అంది.

"అబ్బ! ఎంత ధైర్యంగా చెప్పావే శాంతీ" అంది నవ్వుతూ.

"ఏం? ఎప్పుడూ పడీపడీ చదువుతావెందుకే అని నవ్వేదానివి. ఇప్పుడీ అభినందనలేమిటో!" అంది.

"అప్పుడే పరీక్షలు దగ్గరకొస్తున్నాయ్ అని నేనేడుస్తూంటే, నువ్వు పాసయిపోయినంత స్వేచ్ఛగా చెబుతుంటేనూ!" అంది స్వప్న.

"ఇంకా టైముంది కదా! సినిమాలు షికార్లు బంద్‌చేసి చదవరాదూ!"

"నాకేం పట్టింది?"

"అదేమిటి?"

"పాసయితే పది టెంకాయలు కొడతానని మొక్కుకున్నాను దేవుడికి. మనకా శ్రమలేదు" అంది ధీమాగా కూర్చుని.

ఇద్దరూ నవ్వేశారు ఒక్కసారే!

కొద్దిసేపయాక ముఖం కడుక్కుని ముఖాన బొట్టు దిద్దుకుని, "శాంతీ! అలా ఆంటీ దగ్గరికి వెళ్లొస్తాను. అమ్మ వంట చేస్తున్నట్టుంది...చెప్పు" అంటూ స్లిప్పర్స్ వేసుకుని బయలుదేరింది.

కృష్ణవేణి ఇంట్లో అడుగుపెట్టేసరికి ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. వెంకటేష గానీ, పిల్లలుగానీ కన్పించలేదు. ఏమైపోయారనుకుంటూ, కృష్ణవేణి గది ముందు నిలబడి కర్టెన్ పక్కకి తీసింది. తలుపు దగ్గరగావేసి వుండటంచూసి 'ఈవేళప్పుడు నిద్రపోతున్నారా ఏమిటి?' అని అనుకుంటూ నెమ్మదిగా తలుపు తోసింది.

అంతే! లోపలి దృశ్యం చూడగానే కంగారుగా ఇవతలికి వచ్చేసింది స్వప్న.

రెండునిమిషాలు గోడకి చేరబడి అశక్తిగా నిలబడిపోయింది. నెమ్మదిగా వాస్తవంలోకి వచ్చి, వేగంగా నడుస్తుంటూ ఇంటికివచ్చి తన గదిలోపడింది.

కొద్దిక్షణాల క్రితం తను చూసిన దృశ్యమే పదే పదే కళ్ళముందు కదలాడుతోంది.

ఎవరు? ఎవరా అపరిచిత వ్యక్తి! అతని ఒడిలో తలపెట్టుకుని ఆంటీ ఏదో అంటున్నారు. ఆమె నుదుటి మీద అంత ధైర్యంగా తన తల ఆనించి అనునయించే వ్యక్తి ఎవరయివుంటారు?

భర్త మాటంటే గడగడలాడే ఆమెకి అంత తెగింపు ఎలా వచ్చింది. అతను బంధువా, స్నేహితుడా, ప్రేమికుడా? ఆంటీ తన జీవితానుభవాలు వివరించిన సమయంలో అతని గురించి ప్రస్తావించు లేదే! ఇదేదో మిస్టరీలా వుందే! తలుపు తోయటం వాళ్ళు గమనించలేదు కదా!

తనెంత తప్పు పనిచేసింది? ఆంటీకి తెలిస్తే ఏమనుకుంటారు... ఆలోచనలతో ఆమె తల వేడెక్కింది. ముఖం వాడిపోయింది.

ఎంత వద్దనుకున్నా తను చూసిన దృశ్యమే కళ్లల్లో! 'ఎందుకో ఆంటీని ఆ దృశ్యంలో ఊహించుకోలేకపోతోంది! అతను ఆమెను ప్రేమిస్తున్నాడా? ప్రేమిస్తే అదెలాంటి ప్రేమ? వారిద్దరి మధ్య వున్న బంధం ఏమిటి... అని అనేక విధాల ఆలోచనలతో సతమతమయ్యింది స్వప్న.

కృష్ణవేణి గురించి తన అభిప్రాయాన్ని అంత తేలిగ్గా అంచనా వేయలేకపోతోంది స్వప్న.

అస్తవ్యస్తంగా సాగిపోతున్న ఆలోచనలు తనలో ఇముడ్చులేక సతమతవుతూ, శిలలా కూర్చున్న ఆమె ఒక్క ఉదుటున లేచి కృష్ణవేణి ఇంటికి బయల్దేరింది.

గుమ్మంలో అడుగు పెట్టబోతూండగా కృష్ణవేణి నవ్వుతూ ఎదురొచ్చింది.

స్వప్న అక్కడే ఆగిపోయి పరిశీలనగా ఆమె ముఖంలోకి చూసింది. ఇదివరకటి కన్నా రెట్టింపు అందం, ముఖంలో అదో రకమైన సంతృప్తి, ఆనందం కలగలిసి కళకళలాడుతోంది.

'ఆ అందానికి తనే చూపు తిప్పుకోలేకపోతోంది. ప్రేమ, ఆప్యాయతల కోసం అలమటించే ఒక అందమైన అతి దానికి ఏ మగాడు చేరువకాకుండా పోతాడు. కానీ ఆ చేరువలో వుద్దేశం... అదే తన ప్రశ్న, ఆలోచన, బాధానూ!' ఆమె ఆలోచనల సుడిగుండంలో తిరుగుతూనే వుంది ఇంకా!

"స్వప్నా! రాలోపలికి. అక్కడే నిలబడి పోయావు!" అంది కృష్ణవేణి తొలకరి జల్లులా నవ్వుతూ.

ఎర్రటి షిఫాన్ చీరలో ఆమె శరీర కాంతి బంగారంలా మెరుస్తోంది. తూరుపు సంధ్యనే నుదుట తిలకంగా దిద్దుకున్నట్టు వెలిగిపోతోంది ముఖం. రోజూ విచ్చి వాడిపోయే గులాబి ఈరోజు ఆమె జడలో గర్వంగా నవ్వుతోంది.

'ఆంటీలో ఏదో కొత్త అందం కనిపిస్తోంది. ఎప్పుడూ ఇలా కన్పిస్తే ఎంత హాయిగా వుంటుంది' అనుకుని ఆమె వెనకే నడిచివెళ్లి సోఫాలో కాలుమీద కాలు వేసుకుని కూర్చున్న భాస్కర్‌ని చూసి ఆగిపోయింది.

కృష్ణవేణి వైపు చూసింది ఎవరన్నట్టు.

"ఫర్వాలేదు. కూర్చో స్వప్నా! ఇతను భాస్కర్ అని నేను కాలేజీలో చదువుకునే రోజుల్లో నా క్లాస్‌మేటు. ఇప్పుడు ఇక్కడ రైల్వే ఇంజనీరుగా చేస్తున్నారు. ఈమధ్య మీ అంకుల్ ఒకసారి ఈయన్ని డిన్నరుకి ఆహ్వానించారు. అప్పుడు గుర్తుపట్టాం ఒకరినొకరం" అని ఒక నిముషమాగి, "ఈ అమ్మాయి స్వప్న అని చాలా అల్లరి" అంది నవ్వుతూ.

నవ్వుతూ చేతులు జోడించింది స్వప్న. ఇంతకుముందు ఆంటీతో గదిలోవున్న వ్యక్తి ఇతనే అయ్యుంటాడని నిర్ధారించుకుంది.

'నమస్తే' అన్నాడు అతనుకూడా!

ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుని, తనకి కావలసిన అర్థాలు అతని ముఖంలో వెతకటానికి ప్రయత్నిస్తోంది.

అతని చూపులు తనమీదే వుండటాన్ని గమనించి, ఇబ్బందికరంగా కదిలింది కుర్చీలో స్వప్న.

అది గమనించి తనచూపుల్ని పక్కకి తప్పించాడు.

కృష్ణవేణి టీ తేవటానికి లోపలికి





వెళ్ళింది.

ఈలోపల అతను స్వప్న చదువు గురించి, అభిరుచులు గురించి, ఇష్టమైన సినిమాల గురించి అడిగాడు.

అతను మాట్లాడుతున్నా, నవ్వుతున్నా ముఖంలో విచిత్రమైన ఆకర్షణ కలుగుతోంది. మాట్లాడేతీరు సౌమ్యంగా, మృదువుగా అనిపించింది. మాటల్లో మర్యాద. అతనిపట్ల మంచి భావమేర్పడింది స్వప్నకి.

హృదయం తేలికపడినట్లనిపించింది.

కృష్ణవేణి టీ తెచ్చింది.

"మురళిగారు లేరా ఆంటీ" అంది స్వప్న.

ఆమె మామూలుగా అడిగినా, కృష్ణవేణి ఉలికిపాటుగా ఆమెవైపు చూసింది. అంతలోకే సర్దుకుని, "లేరు స్వప్నా! ఏదో పనిమీద వైజాగ్ వెళ్ళారు" అంది.

"పిల్లలు...?"

"వెంకటేశుతో ఆడుతున్నారు"

భాస్కర్ మరో పావుగంట కూర్చుని లేచాడు వెళ్ళటానికి.

ఇంతలో పల్లవి,బాబులోపలికివచ్చారు. స్వప్నని చూడగానే, పల్లవి ఆమె వళ్ళో చేరింది.భాస్కర్ బాబుని ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు.

అయిదు నిముషాల అనంతరం అతను వెళ్ళిపోతోంటే 'గుడీవినింగ్' చెప్పారు పిల్లలు.

అతను వెళ్ళిపోవటంతో కృష్ణవేణి ముఖంలో లీలగా దిగులు, విచారం కొట్టొచ్చినట్టు కనిపించాయి స్వప్నకి.

అతని గురించిన వివరాలేమీ చెప్పక పోవటంతో కొద్దిసేపు కూర్చుని వచ్చేసింది స్వప్న.




చూస్తుండగానే రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి. స్వప్న పరీక్షలు దగ్గరికిరావటంతో బాగా చదివి, సంతృప్తికరంగా రాశాననిపించింది.

ఆమె మనసులో ఒక్కటే దిగులు—శరత్‌ని చూడకుండా ఎలా వుండగలగటమా అని! అతని వియోగం వల్ల... తన స్వేచ్ఛనీ, మనసునీ హరించే ఈ ఇంట్లో తన జీవితం ఎంత దుర్భరంగా వుంటుందో వూహించుకోడానికే భయపడుతుందామె.

ఎప్పుడో ఒకసారి వచ్చే అతని ఫోనుతోనే సంతృప్తిపడలేకపోతోంది. సందర్భమొచ్చినప్పుడు...పెళ్ళి విషయం మాట్లాడితే బావుంటుందని అంది శరత్‌తో! అతను కాదనలేదు కానీ అది ఎంతకాలం పడుతుందనేది ప్రశ్నగా మిగిలింది. వాళ్ళకి.

ఆ వుదయం చదువుతూ కూర్చున్న స్వప్నకి ఫోను మోగటం వినిపించి వెళ్ళి రిసీవర్ తీసి "హల్లో" అంది.

"స్వప్నా! నేను... శరత్‌ని. హౌ ఆర్ యూ?"

"ఫైన్...సువ్వూ" అంది సంతోషాతిశయంతో.

"ఏం చెప్పమంటావు. ఇలా బోర్ కొట్టుకుంటూ ఆ రూమ్‌లో కూర్చోటం

నావల్ల కావటంలేదు. నిన్ను చూడకుండా ఒక్క నిముషం కూడా గడపలేనని పిస్తోంది స్వప్నా! ఉన్నపళంగా ఒక్కసారి నీముందు వాలాలనిపిస్తోంది" అన్నాడు.

నవ్వి, "రావచ్చును కదా!" అంది.

"అలాగే అంటావు. మీవాళ్ళింకా మన పెళ్ళికి గ్రీన్‌సిగ్నల్ ఇవ్వలేదు కదా! ఎంతకాలం పడుతుందో! స్వప్నా... మీ నాన్నగారికి చెప్పి పెళ్ళికి అనుమతి తీసుకుందాం" అన్నాడు.

"అలాగే" అంది.

"ఆయన ఒప్పుకోకపోతే?"

"ఇలా వుండిపోదాం! ఏం చేస్తాం... ఈ జన్మకింతే ప్రాప్తం. నెక్స్ట్ టైం బెటర్‌లక్ అనుకోడమే" అంది అతన్ని ఉడికిస్తూ.

"స్వప్నా... జోక్ చేస్తున్నావా? నీ ఇష్టం. నా బాధ నీకర్థం కాదు. నీకేం అందరిమధ్య...హాయిగా సంతోషంగా వుంటావు. నేనసలు జ్ఞాపకానికి కూడా రానుకదా" అన్నాడు.

అతని గొంతులో పలికిన వేదనకి ఆమె కదిలిపోయింది. "శరత్! నీకంతే అర్థమైంది. ఈ పదిరోజుల్లో నువ్వు గుర్తురానిక్షణం లేదు. నా మనసంతా నీమీదే లగ్నమై, నీ జ్ఞాపకాలచుట్టే తిరుగుతోంది. ఆ క్షణంలో ఈ ఒంటరితనం భరింప శక్యంకాకుండా వుంది. ఈ వేదన, ఆర్తి నీతో పంచుకోవాలనివుంది. కానీ భయంతో నీదగ్గరకు పరిగెత్తుకురావాలనే ఆలోచనల్ని బలవంతంగా అణచుకుంటున్నాను. శరత్! నీమీద నా ప్రేమ, అనురాగం ఎలా చెప్తే అర్థం అవుతాయి" ఆమె గొంతులో దుఃఖపు స్వప్నడి.

"స్వప్నా! బాధపడకు. వూరికే అన్నాను. నాకు తెలీదూ...నీ మనసంతా నాతోనే అని. నాకోసం పరితపించే ఒక హృదయం అక్కడ వుందనీ, మన అందమైన జీవితం గురించి కలలుకంటూ, మధురమైన భావనావీచికలో పయనిస్తూ, నాకోసం నీ హృదయపువాకిలి తెరచి వుంచుతావనీ ఈ మనసుకెంత తృప్తో! చూడు...కాలం కానీ,మనుషులుకానీ ఎంతో కాలం మనల్ని దూరంగా ఉంచలేరు. మన దూరాలని ఓడించి, ఎడబాటు తరిమేసి నా కౌగిలిలో ఇమిడిపోయి, నా జీవితాన్ని నీతో ఎప్పుడు ముడివేసుకుంటావో, లేదో నీ ఇష్టం'' అని అతనన గానే స్వప్న అందుకుని అంది—

"ఈ అంతరాలూ, అడ్డుతెరలూ ఎంతోకాలం వుండవనిపిస్తుంది శరత్! సందర్భం చూసుకుని మా నాన్నగారితో మన విషయం చెప్తాను. కని, పెంచి రెక్కలొచ్చేలాచేశారు. అవసరం తీరిందని వాళ్ళని కాదని ఎగిరిపోవటం మంచితనం కాదుకదా! అప్పటివరకూ దుప్పటి ముసుగుపెట్టుకుని కలలుకంటూ వుండు. కలలో మనం కలుసుకుందాం. ఆ కలలో ఇక ముందైనా 'అయ్ ఫర్ యూ...యూ ఫర్ మీ' అనే తారకమంత్రం జపిద్దాం" అంది స్వప్న.

"కలలో కూడా అలా మంత్రాలు జపించటమేనా? నావల్ల కాదు... నిన్ను నా బిగి కౌగిట్లో బంధించి అందిన చోటల్లా ముద్దులతో..."

"మైగాడ్..శరత్! నిన్నూ..ఫోన్‌లో.. దగ్గర లేకుండా పోయావు" సిగ్గుతో కోపంతో మాటలు తడబడ్డాయి.

"ఫోన్‌లో కాబట్టే ఇంతటితో ఆగింది వలపు వెల్లువ. ఎదురుగా వుంటే..." అంటూ నవ్వాడు చిన్నగా.

ఆ మాటలకి ఆమెలో ఏదో విద్యుత్





ప్రవహించినట్లుగా కొద్దిసేపు మాట్లాడలేకపోయింది.

"స్వప్నా! ఏమిటలా మూగదానివైపోయావు" అన్నాడు.

"ఏయ్... అలా మాట్లాడితే ఫోన్ పెట్టేస్తాను శరత్"అంది.

తేలిగ్గా నవ్వేశాడు. రెండు నిముషాల తర్వాత తనే అన్నాడు-"స్వప్నా! రేపు మావూరు వెళ్తున్నానుఅమ్మని చూద్దామని. ఒక పదిరోజులు గడిపి ఎమ్మే చేయటమో, వుద్యోగ ప్రయత్నమో, జాబ్‌చేస్తూ చదవటమో... ఏదో ఆలోచించాలి. ఈ పది రోజులూ నీ వియోగ బాధ ఎలా తట్టుకోవటమో!" అన్నాడు.

"వెళ్ళిరా శరత్! నువ్వు దూరంగా వున్నా...నీ ఆలోచనలు నాలో ఆగిపోవు. అవే నాకు వూపిరిపోసేది" అంది.

"వుంటాను స్వప్నా! మళ్ళీ ఎప్పుడు చూస్తానో నిన్ను. ఆ తీయటి క్షణంకోసం ప్రతి క్షణం నిరీక్షిస్తూనే వుంటాను" అన్నాడు.

"శరత్! అయ్ లవ్ యూ... అయ్ లైక్ యూ"అంది రహస్యం చెప్తున్నట్టు.

"థాంక్యూ స్వప్నా!" అంటూ ఫోన్ పెట్టేశాడు. తనూ ఫోన్ పెట్టేసి, మనసంతా మూగవోయినట్టు ఒక్కక్షణం అక్కడే నిలబడిపోయింది.

నెమ్మదిగా తన గదిలోకి నడిచివెళ్ళి, కిటికీలోంచి బైటకు చూస్తూ నిలబడింది. ఎందుకో తెలీకుండానే ఆ క్షణం నిస్తేజంగా అనిపించిందామెకి.

శరత్‌తో స్నేహం, ప్రేమ, అతనితో కాలక్షేపం చేసిన అందమైన సాయింత్రాలు... అన్నీ గుర్తుకొచ్చి ఏదో మధురమైన భావనలో ముంచినట్లు చేసింది. ఈ కొద్దిరోజులే అతని దూరాన్ని సహించలేకపోతుందే తను... తన తండ్రి కాదంటే జీవితాంతం అతన్ని దూరంచేసుకుని బతుకుతుందా! ఏం జరగబోతోందో! మనం తలచింది జరగకపోవటమే జీవితం అంటారు. ఒకవేళ అలా జరిగితే తను సహిస్తుందా!

లేదు... అలా జరగటానికి వీల్లేదు. శరత్ సాంగత్యంలోనే తను జీవితం గడపాలి. తండ్రి అడ్డుపడితే అతని కోసం తన తండ్రినీ, తల్లినీ, అన్నిటినీ వదులుకుంటుంది. అంతే! ఆశనిరాశలమధ్య ఆలోచనలతో గడిపేసిందామె చాలా సేపు.

ఆ విధమైన మానసిక సంఘర్షణలోనే నలిగిపోకుండా మధ్యాహ్నం భోజనాల టైములో లీలాదేవి స్వప్న పెళ్ళి విషయం తీసుకురావటానికి ముందు వుపోద్ఘాతంగా-

స్వప్న వద్దంటున్నా మీగడ పెరుగు మరింత వడ్డించిందావిడ.

"ఏమిటమ్మా... వద్దంటే వినవు. ఇంట్లో కూర్చుని ఇట్లా తింటుంటే నెల రోజులకే గుమ్మాలు వెడల్పు చేయాల్సి వస్తుంది. నాకు ఎమ్మే చేయాలనుంది. నాన్నగారికి చెప్పమ్మా... ప్లీజ్" అంది గారాంగా చూస్తూ.

"ఎందుకూ...? పెళ్ళి చేసుకుని..."

"పిల్లల్నికని, పతియే ప్రత్యక్ష దైవమనీ, ఇల్లే స్వర్గసీమనీ...అలా గడిపేయమంటావు కాలాన్ని... అంతేగా!" అంది ఆవిడ మాటకి అడ్డుపడి.

స్వప్న మాటలకి ఫక్కుమని నవ్వింది శాంతి.

"నైస్‌గా చీరలు కట్టుకుని, స్టైయిల్‌గా నడిచే నిన్ను...వేలు ముడేసుకుని పెద బొట్టు పెట్టుకుని, చీరచెంగు నడుంచుట్టూ బిగించి, చంకనపిల్లతో...ఓహ్,ఊహించుకుంటేనే ఇంత అద్భుతంగా వుందే

సీన్! నిజంగా చూడబోతున్నామంటే... సంతోషంతో నా మనసు పూగిపోతోంది" అంది స్వప్నని ఉడికించటానికి.

"పూగిపోతుందా... ఇంకానయం సాగిపోతుందనలేదు. ముఖం చూడు" అంది రోషంగా.

పకపకా నవ్వేసింది శాంతి.

లీలాదేవి అందుకుంది— "అమెరికాలో ఎంబీయే చదివి, మద్రాసులో ఏదో కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్‌గా చేస్తున్నాడట. అబ్బాయి బావుంటాడట. మంచిరోజు చూసుకుని ఒక వారంరోజుల్లో నిన్ను చూడ్డానికి వస్తున్నారట" అందావిడ.

పక్కన బాంబు పేలినట్టు ధన్‌మని కుర్చీలోంచి లేచి నిలబడింది స్వప్న. ఆమె చెప్పేదేమిటో గ్రహింపుకొచ్చే కొద్దీ కాళ్ళల్లో వణుకు, గుండెల్లో బరువు అధికమయ్యాయి. ఒక్కక్షణం ఒంట్లో జీవశక్తి అంతా ఘనీభవించినట్లయింది. మరునిమిషం పైకుబికివస్తున్న దుఃఖాన్ని, బాధనీ మనసులో అదిమిపెట్టి "అప్పుడే పెళ్ళేమిటమ్మా" అంది.

స్వప్న ముఖంలో రంగుల నీడలు గమనిస్తూ అర్థంకానిదానిలా– "ఎందుకలా గాభరాపడతావు. ఈవేళ కాకపోతే రేపైనా తప్పదుగా! ఎన్ని చదువులు చదివినా, ఎంత విజ్ఞానం నేర్చినా ఆడదానికిమగాడు, మగాడికి ఆడది తోడు లేకుండా జరగదు. ఆర్థికపరమైన స్వాతంత్ర్యంకానీ, డిగ్రీలు కానీ ఆడదాని అంతస్థుని ఏవిధంగానూ కాపాడలేకపోతున్నాయి. బిడ్డలు సుఖపడాలనే తల్లిదండ్రులు వాళ్ళు అడిగినవన్నీ ఇచ్చి పంపుతారు.నీకూ ఏ లోటూ రానివ్వకుండా చూస్తాను. మీరు చిలకాగోరింకల్లా ఎప్పుడూ నవ్వుతూ ఒకరికోసం ఒకరిలా బతకాలని కోరుకుంటున్నాను" అందావిడ. అలా అంటున్నప్పుడు ఆమె గొంతు బాధతో పట్టినట్లయింది.

అన్నంలో చేయికడిగేసింది స్వప్న ఆమె మనసు మనసులోలేదు. పెళ్ళిచూపులు అనేమాట చెప్పగానే ప్రశాంతంగా సాగే ప్రవాహంలో తుఫాన్ తాకిడి తగిలినట్టుగా కదలిపోతోంది. వళ్ళంతా చెమటతో తడిసింది. కుర్చీలోంచి లేచి ఇవతలికివచ్చి గోడకానుకుని నిలబడింది. మాట్లాడాలని ప్రయత్నిస్తే దుఃఖంతో గొంతు పెగలదేమోనని అవస్థపడుతోంది స్వప్న.

లీలాదేవికి కూతురి పరిస్థితి అయోమయంగా తోచింది. "స్వప్నా!ఎందుకలా నిలబడిపోయావు. ఒంట్లో ఎలా వుందమ్మా?" అందావిడ అనునయంగా.

తనలో కలిగే అలజడి ఏమిటో ఎందుకో తల్లికి ఏవిధంగా చెప్పాలో అర్థంకావటం లేదు ఆమెకి. ఎలాగో తేరుకుని "ఆర్థికపరమైన స్వాతంత్ర్యాలు, ఆస్తి, ఐశ్వర్యాలూ– ఇవేవీ మనిషికి సుఖాన్నివ్వవు కదమ్మా! ఆ ఆస్తి, ఐశ్వర్యంలేని ఒక మనసున్న మనిషి, నన్ను ప్రేమతో ప్రేమించే మనిషి ఒకరున్నారు. అతనితో నా వివాహం చేయగలరా?" అంది.

ఆవిడ ఆలోచనలన్నీ ఒక్కసారిగా ఆగిపోయాయి. ఏదో ప్రళయం ముంచుకు రాబోతున్నట్టు భయపడిపోయింది. ఆమె చెప్పిందేమిటో గ్రహింపుకొచ్చేసరికి తల గిర్రున తిరిగినట్లయింది. ఎలాగో నిలదొక్కుకుని, "ఏమిటి స్వప్నా.నువ్వనేది? మీ నాన్నగారి సంగతి తెలిసే నువ్వలా అంటున్నావా? ఈ ఇంట్లో ఏదో వుపద్రవం తెచ్చిపెట్టినట్టున్నావు. ఆయనకి ఇష్టంలేని పనులుచేసి లేనిపోని బాధలు తెచ్చిపెడతావు. ఈ విషయం తెలిస్తే

నిన్నూ నన్నూ కూడా చంపి పారేస్తారు. పొరపాటునకూడా ఈ మాట ఆయనతో అనకు" అందావిడ.

"ఎందుకమ్మా భయపడటం... నేనేం తప్పుచేశానని. ఏ పరిచయమూలేనివ్యక్తిని తీసుకొచ్చి నా మెడకు కడితే రేపు అతను మంచివాడో, కాడో ఎట్లా తెలుస్తుంది? తెలిసీ కళ్లు తెరచేలోగానే నా జీవితం నాశనమైతే అప్పుడు నాతోపాటు మీరూ కుమిలి కుమిలి ఏడవరూ!?" అంది ఆవేశంగా.

"అయితేమాత్రం ఈ ప్రేమ లూ, పెళ్ళిళ్ళూ ఆయనకు కోపం"

"ఆయనకిష్టంలేదని ప్రేమించే మనసు ప్రేమించకుండా ఆగుతుందా? ఇప్పుడు మీరు వద్దన్నా నేను, శరత్ ఒకటికాకుండా వుండలేము. అమ్మా! శరత్ గురించి నీకెలాచెప్తే అర్థమౌతుంది. నా కోసం తన జీవితాన్ని ఒక వరంగా చేసుకుని మీరు కాదంటే జీవితమంతా అలా ఒంటరిగా గడపటానికి సిద్ధపడుతున్నాడు. అలాంటి మమతతో బంధింపబడ్డ మా మనసుల్ని వేరు చేయకండి.

ఎన్ని సంసారాలు చూడ్డంలేదూ! కేవలం డబ్బువల్ల జీవితానికి సుఖముండదని తెలీటంలేదూ! ఇంత ఆస్తి, ఐశ్వర్యం వుండి నువ్వేం సుఖపడుతున్నావు? కృష్ణవేణి ఆంటీ ఏం సుఖపడుతున్నారు? చూస్తూ చూస్తూ జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసుకోలేనమ్మా!ప్లీజ్..నాకే సంబంధాలూ చూడద్దు. శరత్ విషయం నువ్వేనాన్నగారితో చెప్పాలి"అంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

లీలాదేవి నవనాడులన్నీ కృంగిపోయి సట్టుగా కుర్చీలో కూలబడింది.'ఈ పెళ్ళిని ఆయన అంగీకరించటం అనేది కలలో మాట. స్వప్న ఆయన మాట వినేదిలేదని చెప్పేసిం... మరి ఈ సమస్యకి పరిష్కారం ఏమిటో! భగవంతుడా... అని వాపోయింది.

శాంతి జరుగుతున్నది అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తోంది.

ఆ రాత్రి ఎడతెగని ఆలోచనలతో నిద్రపట్టక సతమతమైపోయారు తల్లీ కూతుళ్ళిద్దరూ. వారంరోజుల్లో జరగబోతున్న వుపద్రవాన్ని ఎలా అయినా ఆపివేయాలని స్వప్న పట్టుదల. ఈలోపే తండ్రికి తమ ప్రేమ విషయం వెల్లడి చేయాలని ఆమె వుద్దేశం.

'శరత్‌కి ఈ విషయం ఎలా తెలియ చేయటం? రేపు అతను వాళ్ళ వూరు వెళ్ళకముందే తను అతన్ని కలుసుకోవాలి. అంతకంటే మార్గం లేదు' అనుకుంది.

ఉదయం లేవటమే గబగబా స్నానపానాదులు ముగించి అతను చెప్పిన అడ్రసు ప్రకారం ఇంటిముందు ఆపించింది ఆటో! డబ్బు చెల్లించి గేటు తీసుకుని లోపలికి వెళ్ళగానే పదేళ్ళ కుర్రాడు ఎదురయితే అతన్ని అడిగింది శరత్ వుండేది ఎక్కడని. మేడమీద గది చూపించి అక్కడినుంచి తుర్రుమన్నాడు.

మెట్లెక్కి పైకివెళ్ళి దగ్గరగా వేసివున్న తలుపులు నెమ్మదిగాతోసి గదిలో అడుగు పెట్టింది.

శరత్ కనిపించలేదుకానీ, ఆ గదికి ఆనుకునివున్న బాత్‌రూమ్‌లోంచి స్నానం చేస్తున్న శబ్దం వినిపించింది.

గదంతా ఒక్కసారి పరిశీలనగా చూసింది. చాలా విశాలంగా వుంది. ఒక వేపు మంచం, మరో పక్కగా టేబిల్,దానిముందు ఒక ఛైరూవేసి వుంది.




టేబులు మీద పుస్తకాలు నీట్‌గా సర్ది వున్నాయి. వాటి పక్కగా అతను షటిల్ ఆడుతున్నప్పటి ఫొటో. టేబిల్‌కి పైగా అమర్చిన రాక్‌లో పెద్ద పెద్ద రచయితల ఇంగ్లీషు, తెలుగు పుస్తకాలు వున్నాయి. రాక్‌కి కాస్త పక్కగా హాంగర్లకి షర్టులు, పాంట్లు తగిలించి వున్నాయి.

శరత్ బాత్‌రూమ్‌లోంచి తలుపు తీసుకుని గదిలోకి అడుగుపెట్టాడు.

ఎదురుగా హాండ్‌బాగ్ గుండెలకు ఆనించుకుని దానిమీదుగా చేతులుచుట్టి అతనికోసమే ఎదురుచూస్తున్నదానిలా సుంచున్న స్వప్నని చూసి ఆశ్చర్యంలో మునిగిపోయాడు.

'కలా, నిజమా! సాక్షాత్తూ ఆ దేవతే దిగివచ్చి ఎదురుగా నిలబడివుంటే కల ఎట్లా అవుతుంది!' అనుకుంటూ ఆమె ముఖంలోకి పరిశీలనగా చూశాడు.

ఎప్పటిమాదిరి ఆమె ముఖంలో చిలిపితనానికి బదులుగా గాంభీర్యం, కళ్లల్లో తడి మెరుస్తూండటం చూసి, "స్వప్నా! నువ్వు...వాటే ప్లెజంట్ సర్‌ప్రైజ్" అన్నాడు సంతోషం పొంగిపొరలుతుండగా.

ఏదో చెప్పాలని ప్రయత్నిస్తోంది కానీ, అతని పలకరింపుతో...రాత్రినుంచి తను పడుతున్న మానసిక సంఘర్షణంతా దుఃఖరూపంలో బయటికి ఉరకబోతోంటే కళ్లల్లో నిండుతున్న నీటిని అతను చూడకూడదన్నట్టు గిరుక్కున వెనుదిరిగింది.

అదిచూసిన అతని మనసు తపించిపోయింది. ఒక్క అంగలో వెళ్లి ఆమె రెండు భుజాలు పట్టుకుని, తనకభిముఖంగా తిప్పుకుని, ఆమె గడ్డం పుచ్చుకుని తల పైకెత్తి, "స్వప్నా! ఎందుకు... ఏమైంది నీకు" అన్నాడు అనునయంగా.

ఒక్కవుదుటున అతని గుండెకు హత్తుకుపోయింది. ఆమె కళ్ళనుంచి వర్షిస్తున్న నీటితో అతని గుండె తడిసిపోయింది.

నాలుగు నిముషాలకి తేరుకుంది స్వప్న.

"ఇక్కడ...ఇక్కడే నా స్థానం.నువ్వు లేకుండా నేను బతకలేను శరత్. మనిద్దరి కలయికకోసం ఎవరినయినా ఎదిరిస్తాను. కానీ మరొకరి భార్యను మాత్రం కాను... కాలేను" అతని గుండెల్లోంచి తల తియ్యకుండానే అంది.

అతను కొంత విషయం గ్రహింపు కొచ్చినట్టుగా, "ఓహో..దేవిగారికివివాహం నిశ్చయం చేయబోతున్నారన్న మాట. ఇంకేం మీ నాన్నగారు చెప్పిన అబ్బాయిని హాయిగా కొంగున ముడేసుకుని జీవితాన్ని ఆనందంగా గడిపేసెయ్యి స్వప్నా" అన్నాడు.

ఆమెని తననుంచి విడిపించి, వెళ్ళి షర్టువేసుకుని, ఫ్లాస్కులో కాఫీ రెండు కప్పులనిండా నింపాడు.

అతని కంఠంలో ఎలాంటి మార్పు లేకపోయినా, అతని మాటల్లో తన కిష్టంలేని సమాధానం స్ఫురించేసరికి స్వప్నకి కోపం వచ్చింది.

"కాఫీ తీసుకో స్వప్నా!" అన్నాడు.

నేలకేసి విసిరికొట్టింది కోపంతో. పది ముక్కలైంది కప్పు, సాసరు కిందపడి.

విస్తుపోయి చూశాడు శరత్.

"నీకు కోపం వచ్చినప్పుడల్లా ఇలా సామాను పగలగొట్టేస్తుంటావని మీవారికి చెప్పి, కట్నంతోపాటు నెలకు నువ్వుపగలకొట్టేవాటి ఖరీదు లెక్కకట్టి వసూలు చేస్తుండమని చెప్తాను" అన్నాడు నవ్వుతూ

అతని మాటలకి రోషంతో కళ్ళు

పెద్దవి చేసుకుని చూసింది అతన్ని. "నే వెళ్ళిపోతున్నాను" అని రెండడుగులు ముందుకు వేయగానే గట్టిగా నవ్వేస్తూ పరుగున వెళ్ళి ఆమె చేతులు రెండూ తన గుప్పెట్లో బంధించి పెదవుల కానించుకుని గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

నెమ్మదిగా ఆమె భుజంచుట్టూ చేయి వేసి నడిపించుకుంటూ తీసికెళ్ళి కుర్చీలో కూర్చోబెట్టి, "ఎంత కోపం వచ్చింది స్వప్నా! ఇప్పుడు పోయిందా?" అన్నాడు.

"ఊఁ... నేనంత బాధపడుతుంటే నీకన్నీ వేళాకోళాలు" అంది.

ఆమెకెదురుగా మంచం మీద కూర్చుంటూ, "నేనన్న దాన్లో తప్పేముంది స్వప్నా! నువ్వు కోరుకుంటే కొండమీద కోతినైనా తెచ్చి ఇవ్వగల సామర్థ్యం, స్తోమత వుంది మీ నాన్నగారికి. ఈ అర్భకుణ్ణి ప్రేమించి పెళ్లిచేసుకుంటే నీ జీవితానికెలాంటి సుఖమూ, శాంతీ వుండవు. నీ ఇంట్లో సుకుమారంగా, ఏలోటూ లేకుండా పెరిగావు. అలా నిన్ను చూడగలనా అని భయం వేస్తోంది స్వప్నా!

నువ్వసలు నా ప్రేమను తిరస్కరించి వుండాల్సింది. కానీ నువ్వు నీలాకాశంలో చందమామలా ప్రేమను నాపై కురిపించి, నిన్ను కొలిచే భక్తుణ్ణి చేశావు. నా గుండెను గుడిచేసి అందులో నిన్ను ప్రతిష్ఠించటం నేను చేసిన తప్పిదం కదూ! నీ స్టేటస్‌ను గమనించకుండా పెళ్ళి చేసుకుంటే.... కోరి కష్టాల సుడి గుండంలోకి తీసుకుపోతున్నానేమోనని పిస్తోంది. ఇప్పుడైనా నష్టం ఏం లేదు స్వప్నా! నాకు ఉద్యోగం ఎప్పటికి దొరికేనో, ఏమో. మనం పెళ్ళి చేసుకుని ఏం తింటాం. నన్ను చేసుకోకపోతే ప్రపంచం ఏమీ మునిగిపోదు. నా పిడికెడు గుండె ఆగిపోయినా ఎవరికి బాధ? సృష్టి స్థితి, లయల్లో మార్పు వుండదు కదా! అప్పుడైనా మనం కలసి తిరిగిన మధురక్షణాలు, నవ్వుల్లో ముంచెత్తిన సంఘటనలు, తీయని జ్ఞాపకాలు గుర్తుకు వస్తే ఈ నిర్భాగ్యుడికోసం ఒక కన్నీటి చుక్క రాల్చు. అది చాలు నా ఆత్మశాంతికి" అతని కంఠం రుద్ధమైంది.

అతని మాటలు వినలేక కన్నీరు కార్చుతూ-"శరత్! ఎందుకలా మాట్లాడతావు. నామీద నీకున్న నమ్మకం ఇదేనా! ప్రేమించుకున్నాం, పెళ్ళి చేసుకుందామను కుంటున్నాము. నీకంటే నాకా ఆస్తి, ఐశ్వర్యం ఎక్కువేం కాదు. అందులో వుండే కష్టసుఖాలన్నీ అనుభవైక వేద్యమే! మనకేం తక్కువ. ఇద్దరం ఉద్యోగాలు చేసుకుంటూ హాయిగా బతగ్గలం. సెటిలయ్యాక నేను రిజైన్ చేసి, నీ ఆలనా పాలనా చూసుకుంటాను... సరేనా" అంది.

ఆమె చేతిని తన చెంపకు రాసుకుంటూ "స్థిరపడటమంటే ఎప్పుడికి? ఈ దేశంలో ఏ అండ లేకుండా స్థిరపడటమంటే జీవిత కాలం సరిపడదు స్వప్నా! ఆకలి, ఆర్థిక బాధలు, మనుగడ–ఈ సమస్యలు మనల్ని, మనలోని ప్రేమని తినేస్తాయి. ఆ క్షణాలను నేనూహించుకోలేకపోతు న్నాను. భవిష్యత్తు భయాన్ని కలిగిస్తోంది" అన్నాడు.

"నువ్వింతపిరికిగాఆలోచిస్తావనుకోలేదు. కష్టాలనేవి మనుషులకి కాక మానులకి వస్తాయా! సుఖపడటానికి ప్రయత్నించాలి. కష్టేఫలీ అన్నారు. కష్టాలూ, సుఖాలు తరచి చూసేనే థ్రిల్ వుంటుంది. అదే అసలైన జీవితం" అంది. ఆమె మాటల్లో




పదునూ, స్థిరత్వం ధ్వనించాయి.

"నా బాధ నీకర్థంకాదు. నా మనసులో నీకెలాంటి స్థానం వుందో నువ్వు ఊహించలేకపోతున్నావు. అందుకు భిన్నంగా నిన్ను నాతోపాటు సమంగా కష్టాలతో... నిన్నూ హించలేక పోతున్నాను" బాధనిగుండెల్లోఅదిమిపెడు తున్నట్టు స్పష్టంగా తెలుస్తోంది.

"శరత్... నా తపస్సు ఫలించింది. నీ గుండె గుడిలో నా స్థానం, అనురాగ పూరితమైన నీ ప్రేమ ఇవే నా జీవితానికి సుఖమూ, ఆనందమూ. వీటిని డామినేట్ చేసే బాధ లేవీ మన మధ్యకు రావని నా నమ్మకం. నీ నిర్ణయం అదే అయితే నేనిప్పుడే చచ్చిపోతాను. అప్పుడైనా నీ మీద నా ప్రేమను అర్థంచేసుకుంటా వేమో!" ఆ మాటలు అంటూనే ఆమె ఏడుస్తూ లేచి నిల్చుంది.

అనవసరంగా ఆమెను బాధపెట్టాను. తనకోసం అన్ని బంధాలూ తెంచుకుని రావటానికి సిద్ధపడ్డ ఒక ఆడపిల్లని ఈవిధంగా బాధపెట్టి పంపటం బుద్ధి తక్కువ పని. ఆమె సుఖపడాలనే తన కోరికను ఆమె వినిపించుకోదు. ఇలాంటి ప్రేమమూర్తి కోసం ఎన్ని యుగాలు అన్వేషిస్తే దొరుకుతుంది? దొరికిన ఈ వజ్రాన్ని భద్రంగా చూసుకోవాలి. అంతే... అంతే!— అనుకున్నాడు ఆమెని చూస్తూ.

నెమ్మదిగా వెళ్ళి ఆమెని తన హృదయానికి గట్టిగా అదుముకుని "స్వప్నా! మై హార్ట్... మై సోల్. నిన్ను చూడకుండా ఒక్క క్షణం గడపలేక సతమతమవుతున్నానే! నువ్వు ఎవరి భార్యవో అయితే నేను బతకగలనా? ఇంపాజిబుల్ ... నిన్ను నానుంచిఎవరూ వేరు చేయలేరు. ప్రామిస్" అంటూ ఉద్వేగంతో ఆమె ముఖాన్ని ముద్దులతో ముంచేశాడు.




మర్నాడు ఉదయమే స్వప్న ఇంటికి బయల్దేరాడు. అతను వెళ్ళేసరికి భుజంగరావుగారు ఇంట్లోనే వున్నారు. సోఫాలో కూర్చుని ఏవో ఫైల్సు చూస్తున్నారు. మనిషి గంభీరంగా, ముఖంలో అదో విధమైన దర్పం, డాబు కన్పించాయతనికి.

ఆయన్ని చూస్తూనే 'నమస్తే' అన్నాడు.

"నమస్తే... నమస్తే" అంటూ అతని వంక చూస్తూ ఎదురుగావున్న కుర్చీ చూపించారు కూర్చోమన్నట్టు సైగచేసి.

ఉద్యోగం కోసమో, మరేదైనా సహాయం కోసమో వచ్చివుంటాడని వూహించాడాయన శరత్‌ని చూసి.

"చెప్పండి..నాతో ఏమైనా పనుందా?" అన్నారు.

"పని అంటే మీతో కాస్త మాట్లాడాలనీ..." అంటూ ఆగాడు.

"ఆహా" అని ఆగి, "ఏమిటది చెప్పండి" అన్నారు.

స్వప్న శరత్‌కి కనిపించేలా గదిలో నిలబడి చిన్నగా నవ్వింది. లీలాదేవి లోపల పనిలో వున్నారు. ఆవిడకి తెలీదు వచ్చింది శరత్ అని. శాంతికి శరత్‌ని చూపించి ఏదో చెప్తోంది స్వప్న.

శాంతి ఆశ్చర్యంగా బైటికి తొంగి చూసి 'నైస్' అంద ప్రశంసగా.

"మీ అమ్మాయి పెళ్ళి గురించి"

తక్కున ఫైలు మూసి, భృకుటి ముడిచి "స్వప్న పెళ్ళి గురించి... నువ్వు" ఆయనకి విషయం అర్థమైనట్టుగా తోచింది.

"స్వప్న, నేను ప్రేమించుకున్నాం. మీరు ఆశీర్వదిస్తే ఒకటి కావాలనుకుంటున్నాం" అన్నాడు.

చటుక్కున సోఫాలోంచి లేచి 'గెటప్' అన్నారు సీరియస్‌గా.

శరత్ లేచి చేతులు రెండూ వెనక్కి పెట్టుకుని నిలబడ్డాడు.

"అండ్ గెటౌట్" అని అరిచారాయన.

"మీ సమాధానం విని వెళ్తాను. పిల్లల మనసులు, వారి ఇష్టాయిష్టాలు గుర్తించకుండా నిర్ణయాలు చేయటం పెద్దరికం అనిపించుకోదు. మీకు సంబంధించిన విషయాల్లో మమ్మల్ని ఒక మనిషిగా గుర్తించి సంప్రదించండి. మీరు మా పెళ్ళికి అంగీకరించరని తెలుసు. మీకు చెప్పకుండా గుళ్ళో మూడు ముళ్లూ వేసి ఆశీర్వదించమని మీ ముందుకు వచ్చే ధైర్యం లేక కాదు. ఆమెకు మీరు తల్లీ, దండ్రీ అనే గౌరవం చేత" అన్నాడు.

ఆయన కోపంతో మండిపడ్డారు. కళ్ళునిప్పుకణాల్లాఎర్రబడ్డాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు దీర్ఘంగా వెలువడుతున్నాయి. ఎదురుగావున్న మనిషిని భస్మం చేయాలన్నంత ఆవేశం ముంచుకు వచ్చింది ఆయనలో.

"స్వప్నా!"అని అరిచారు. స్వప్నతో పాటు లీలాదేవి కూడా పరుగెత్తుకొచ్చింది.





శాంతి దూరంగా నిలబడింది.

"నాన్నగారూ..." అంటూ ఏదో చెప్పబోయింది స్వప్న.

"నోర్మూయ్" అని కోపంతో వూగిపోతూ, శరత్ వైపు తిరిగి, "నీలాంటి కుర్రకుంకలు చెప్పే నీతివాక్యాలు వినే స్టేజ్ కాదు నాది. నా డబ్బుకో, నా కూతురి అంతస్థుకో ఆశపడి ప్రేమించుకున్నామంటూ వస్తారు నీలాంటివాళ్లు. అడగటానికి కూడా ఒక అర్హత వుండాలి. ఇంకోసారి నీ రూపం కనిపిస్తే ఏం చేస్తానో కూడా తెలీదు... గెటౌట్" అంటూ ఇల్లు దద్దరిల్లేలా అరిచారు.

శరత్ హృదయం కుతకుత వుడికిపోయింది. తలెత్తి ఒకసారి స్వప్న వైపు చూసి, విసురుగా బైటికి వెళ్లిపోయాడు.

స్వప్నకి తండ్రి తనను పిలిచి, తన ఎదుట శరత్‌ని అలా అవమానించి పంపటం దుర్భరంగా తోచింది. కోపంతో హృదయం రగిలిపోయింది. ఆమెలోని ఆవేశం, రోషం రెచ్చగొట్టబడి- "నాన్నగారూ" అంటూ అరిచింది. దుఃఖం, బాధ సముద్రకెరటాల్లా లేచి పడ్డాయి.

"మీరు...మీరు మనుషులేనా? ఇంటికొచ్చిన మనిషితో మర్యాదగా మాట్లాడటం కూడా తెలీని సంస్కారపు స్థాయన్నమాట మీది. మీ ఇష్టమొచ్చినట్టుమాట్లాడితే పడివుండటానికి మీ భార్యాపిల్లలవంటి వాళ్ళు కాదు అందరూ! అతను ఈ ఇంటికి కాబోయే అల్లుడు. మీరంత తేలిగ్గా మాట్లాడినా, మిమ్మల్ని ఒక్కమాట... ఒక్కమాట కూడా అనకుండా వెళ్లాడంటే..అది నా ముఖం చూసి. నా మీద ప్రేమతో మిమ్మల్ని క్షమించి వదిలాడు.

మీరు కాదు... ఆ దేవుడు కాదన్నా

అతన్నే చేసుకుతీరతాను. మీ స్టేటస్‌తోనూ, ధనంతోనూ నాకేం సంబంధం లేదు. శరత్ గుణ సంపదముందు మీ డబ్బు, మీ అంతస్థు... సమస్త సంపదలూ నాకు గడ్డిపోచకన్నా హీనం" అంది.

ఆయన కోపం తారాస్థాయికి చేరు కుంది. "చాలా పెద్దదానివైపోయావు! వంశ గౌరవాన్ని, కుటుంబ ప్రతిష్టను మంటగలిపేంత ధైర్యం, తెగింపు వచ్చా యన్నమాట. మీ పెళ్ళి ఎలా జరుగు తుందో చూస్తాను. అణాకాణీ వెధవల్ని దృష్టిలో పెట్టుకుని నన్నూ, నా స్టేటస్‌నీ గడ్డిపోచగా భావిస్తున్నావు. రేపు వాణ్ణి చేసుకున్న పది రోజులకే నువ్వూ..."

ఏదో అనబోయిన ఆయన మాటలకు అడ్డువస్తూ, "ఇంకోసారి శరత్‌ని ఏమన్నా నేను సహించలేను. మీకిష్టం లేకపోతే మా పెళ్ళి చేయకండి...ఇంట్లోంచి పొమ్మ నండి. అంతే కానీ, నోటికొచ్చినట్లు మాట్లాడద్దు. మీ పట్ల వున్న ఆకాస్త రక్తసంబంధం కూడా తెగిపోతుంది" అంది.

"నువ్విలా బరితెగించటానికి మీ అమ్మే అసలుకారణం. ఇంట్లో పిల్లలెలా పెరుగుతున్నారు, ఎలా సంచరిస్తున్నారు, ప్రవర్తనెలా వుంది, ఏమిటి అని చూసు కోవలసిందిపోయి, నా మీద వ్యతిరేకతను నూరిపోసింది. మీకేం తక్కువైందని ఇలా కష్టపెట్టారు. ఈ సంపాదించేదంతా ఎవరికోసం? అది అర్థంచేసుకోకుండా తిరగపడితే ఏమిటి లాభం. ఈ ఇంటికి నేను యజమానిని. నా మాట జవదాటే హక్కు ఎవరికీ లేదు" అన్నారు కఠినంగా.

"అదే మీ మూర్ఖత్వం. సంఘ నియమానికి కట్టుబడి భార్య భర్తని పూజి స్తుంది. కలిసి బతకాలనుకుంటుంది. అలాంటి ఆడది...ఆ పరిధులు దాటి భర్తని ద్వేషిస్తుందంటే ఆ తప్పు భర్తదే! మీరు తెచ్చే డబ్బుకోసం, నలుగురిలో మీ గొప్ప కోసం, మీరు చేయించే బంగారు తొడుగుల కోసం ఆశపడరు ఏ భార్యా పిల్లలూ! ప్రేమతో, లాలనతో, దయతో పలకరిం చారా ఒక్కనాడైనా! మా సౌఖ్యంకోసం డబ్బు సంపాదిస్తున్నారు. మరి తండ్రి నుంచి కోరుకునే ప్రేమనీ, ఆప్యాయతల్నీ ఎవరిలో చూసుకోవాలి...

...మీ అధికారబలంతో మా స్వేచ్ఛను హరించారు. చదివిస్తున్నారనీ, కోరింది ఇస్తున్నారనీ మీ మీద ప్రేమ ఏర్పడదు. పిల్లల్ని పెంచటం, చదువు చెప్పించటం మీ బాధ్యత. మిమ్మల్ని చేసుకున్న దుర దృష్టానికి ఈ నాలుగుగోడల మధ్య బంధింపబడి...వళ్ళు తెలియని స్థితిలోవచ్చి అర్ధరాత్రిళ్ళు వయసు మనసు ఎదుగు తున్న కూతుళ్ళను ఇంట్లో పెట్టుకుని భార్యమీద చేయి చేసుకున్నారంటే.... మీ స్థాయి మా ముందు ఎంత దిగ జారిపోయిందో వూహించండి..

...మీ గురించి ఆవిడ నూరిపోయ టానికి మేం చిన్నపిల్లలం కాదు. మంచీ చెడూ విచక్షణ తెలుసుకోలేని పసి పిల్లలం కాదు మేం. భార్యా పిల్లలంటే...తను కని కరిస్తేనే వాళ్ళకింత తిండి, బతుకు అనే హీనమైన ఆలోచనలు మాని, ప్రేమా భిమానాలను పంచిపెట్టడం నేర్చుకోండి ఇప్పటికైనా! శరత్‌లాంటి వున్నతుడు.."

స్వప్న మాటలు పూర్తికాకుండానే భుజంగరావుగారు స్వప్న చెంపలు రెండూ పగిలిపోయేలా చరిచారు.

ఒక్క పరుగున వచ్చి లీలాదేవి స్వప్నను కౌగిలించుకుని "దాన్ని వదిలేయండి...





చిన్నపిల్ల. నేను సర్దిచెప్తాను. మీరు ఆవతలకి వెళ్ళిపోండి. దణ్ణంపెడ్తాను'' అంది ఏడుస్తూ.

స్వప్న కంటినుంచి రెండు కన్నీటి చుక్కలు రాలిపడ్డాయికానీ, స్థిరంగా నిలబడే వుంది.

ఆయన అంతటితో ఆగకుండా, స్వప్న రెక్కలు పుచ్చుకుని, ''నా ఎదురుగా తలెత్తటానికి భయపడే రాస్కెల్స్ నాకు నీతులు చెప్పటమా! ఈ పెళ్ళి ఎలా జరుగుతుందో చూస్తాను'' అంటూ బరబరా ఈడ్చికెళ్ళి గదిలో పడేసి బైట తాళం వేశారు.

''నేను చెప్పేవరకూ మీరిద్దరిలో ఎవరైనా తలుపుతీసినా, అన్నం పెట్టినా చంపేస్తాను...జాగ్రత్త'' అంటూ తాళాలు జేబులో వేసుకుని, ఫైల్సు తీసుకుని కోపంగా బైటికి వెళ్ళిపోయారు. కాసేపటికి కారు వెళ్ళిపోయిన శబ్దమైంది.

తలుపుదగ్గరే కూలబడిపోయింది లీలాదేవి దుఃఖిస్తూ. శాంతి తల్లి భుజం మీద తలపెట్టుకుని, నిశ్శబ్దంగా వుండిపోయింది.

లోపల్నించి స్వప్న కిటికీ తలుపులు తెరచి తల్లినిచూస్తూ, ''అమ్మా!ఒక్కరోజు భోజనం చేయకపోతే చచ్చిపోను. నాకేం ఫర్వాలేదు. ఆయన అహంకారం మీద దెబ్బతగిలిందని సహించలేకపోతున్నారు. అంతే!'' అంది.

''ఆయన సంగతి నీకు తెలీదు స్వప్నా! అనుకున్నది సాధించేవరకూ ఆయన నిద్రపోరు. లేనిపోని బాధలు తెచ్చిపెట్టావుకదా'' అంటూ ఆవిడ కుమిలిపోయింది.

స్వప్న ఎంత ధైర్యం చెప్పినా ఆవిడ అలాగే ఏడుస్తూండిపోయింది. ఆ మధ్యాహ్నం, రాత్రి కూడా స్వప్నతో పాటు లీలాదేవి, శాంతి భోజనం చేయకుండా కూర్చున్నారు.

రాత్రి ఎనిమిది గంటలవుతుందనగా శాంతి మారుతాళాలేవోతెచ్చి తాళం తీయటానికి ట్రైచేసింది. అరగంట కష్టపడ్డాక తక్కున వూడిపడింది. ఆ టైమ్‌లో అక్కడెవ్వరూలేరు. లీలాదేవి బెడ్‌రూమ్‌లో పడుకుని జరగబోయే సంఘటనల్ని తలుచుకుంటూ భయంతో ఆలోచిస్తోంది.

శాంతి వేగంగా తలుపుతీసి లోపలికి వెళ్ళింది. స్వప్న ఆశ్చర్యపోయింది. శాంతి అంత సాహసించిందంటే నమ్మలేకుండా వుంది ఆమె.

''అక్కా... ఈ పంజరంలోంచి వెళ్ళిపో! శరత్ నీకోసం ఎదురుచూస్తుంటాడు. ఇక్కడే వుంటే నాన్నగారు అయనకిష్టమైనవాణ్ణిచ్చి చేయటం ఖాయం. నీకెక్కడ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు, సుఖసంతోషాలు దొరుకుతాయో అక్కడకి వెళ్ళు. ప్లీజ్...గో'' అంది తొందరగా!

స్వప్నకి కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. శాంతిని కౌగలించుకుని, ''శాంతీ! నిన్నూ, అమ్మనీ వదిలి వెళ్తున్నందుకు నా ప్రతి కణం ఎంత యాతనపడుతోందో! నిన్ను ఒంటరిదాన్నిచేసి వెళ్తున్నా'' అంది.

మళ్ళీ అంతలోనే కుర్చీలో కూలబడిపోయింది స్వప్న.

''ఏమిటి'' అంది శాంతి గాభరాగా.

''నేను వెళ్ళను. ఈ తాళం తీసినందుకు నాన్నగారు నిన్నేం చేస్తారోనని భయంగా వుంది'' అంది.

''అయ్యో! నాన్నగారు రావటానికి ఇంకా చాలా టైముంది. ఈలోపు నేనేదో చేస్తానుగా'' అంది శాంతి.

"ఏంప్లాన్‌చేసినా నీమీదికి రాకుండా చూడు. నీకు తెలీదు. నాన్నగారు నామీద కోపంతో మిమ్మల్ని కఠినంగా శిక్షిస్తారేమో! నాకు బాధగా వుంది''

"అమ్మకి చెప్పవూ!''

"చెప్పను శాంతీ! అమ్మ కన్నీళ్ళు చూస్తే నా మనసు వెనక్కులాగుతుంది" అంటూ శాంతి చేయి నొక్కి ఆ ఇంటి గడపదాటింది స్వప్న.

* * *

ఆ మరుసటిరోజే ఫ్రెండ్సందరి సమక్షంలో వేంకటేశ్వరస్వామి ఆలయంలో శరత్, స్వప్నల పెళ్ళి జరిగిపోయింది. శరత్ తన మామయ్యకూ, తల్లికీ కబురుచేశాడు. అంత అర్థాంతరంగా పెళ్ళి ఏమిటని గాభరాపడుతూ వచ్చిందావిడ.

ఆవిడ రాగానే శరత్ చెప్పిన సంగతులు విని ఆశ్చర్యపోయిందావిడ. పెద్దవాళ్ళకి ఇష్టం లేకుండాఎందుకుచేసుకుంటున్నట్లని కొడుకుని మందలించింది. ఇద్దర్నీ వెళ్ళి పెళ్ళికి ఆహ్వానించమని చెప్పింది.

విషయమంతా స్వప్న ఆమెకి వివరంగా చెప్పింది. అయిష్టంగానే అక్షతలు చల్లిందావిడ.

సమస్యలతో పెళ్ళిచేసుకుని సుఖపడలేరేమోనని ఆవిడ భయం.

పెళ్ళికి శశిని వెంటనే బయల్దేరిరమ్మని ఫోనుచేసింది. శశి, చందూతోపాటు మిగతా ఫ్రెండ్సంతా ఎంతో అభిమానంతో దగ్గరుండి పెళ్లి జరిపించారు.

ఆరోజు స్వప్న మనసంతా ఒకపక్క ఆనందంతోనూ, మరోపక్క తల్లిని, చెల్లిని, కృష్ణవేణిని తలచుకుని దిగులు పడింది. కృష్ణవేణికి ఫోనుచేసింది.

"మీతో చెప్పి రావాలని ఎంతగానో ప్రయత్నించాను...కుదరలేదు.క్షమించండి ఆంటీ! మీరు రావటానికి వీలుపడదని తెలుసు. మీ మనసంతా నామీదే ఉంటుందనీ తెలుసు. మీరు వస్తే నా మనసెంత ఆనందిస్తుందో ఎలా చెప్పను" అంది.

"చాలా ధైర్యంచేశావు స్వప్నా! నిన్ను అభినందిస్తున్నాను. పెళ్లికి రావటానికి నాకు వీలుకాకపోయినా పెళ్లిపీటల మీద మిమ్మల్ని వూహించుకుని ఆనందిస్తాను. ఆయన వూళ్ళో లేని సమయంలో మీ ఇంటికోసారి వస్తాను... సరేనా. ధైర్యంగావుండు" అంటూ ఫోన్ పెట్టేసింది.

ఇంక అక్కడ భుజంగరావుగారు గదిలోని వెంటిలేటర్‌లోంచి ఒక తాడు బైటికి వేలాడదీయబడి వుండటంచూసి హతాశులై ఇల్లంతా పెద్దపెద్ద కేకలు పెట్టారు.

'నా పరువుతీసింది. నా కడుపున చెడపుట్టింది. అసలు దాన్ని చదివించి మోసపోయాను' అంటూ అరిచారు.

"ఇంక స్వప్న ఎటుపోయినా, ఏమైనా నాకనవసరం. అది ఈ ఇంటి గడప తొక్కినా, మీరెవరైనా దాని ముఖం చూసినా మిమ్మల్ని షూట్‌చేస్తాను. నాకున్నది, పుట్టింది ఒక్కతే కూతురనుకుంటాను. ఈ ఇంటితో దానికి శాశ్వతంగా ఋణంతీరిపోయింది. ఇకనుంచి దాని పేరు కానీ, దానికి సంబంధించిన వస్తువులుకానీ ఏదీ నా కళ్ళబడటానికి వీల్లేదు" అంటూ శాసించారు.

కడుపుకోత పేగుల్లో దాచుకుని కన్నీటిని కళ్ళల్లోనే నిలుపుకుని అన్నీ వింటూ నిర్జీవంగా కూర్చుంది లీలాదేవి.

శాంతి గదిలో బెడ్‌మీద పడుకుని ఆలోచిస్తోంది. ఇన్నాళ్ళూ ప్రతిగంట

చదువుకోసం తాపత్రయపడి ఇంటి విషయాలేవీ పట్టించుకునేది కాదు ఆ పిల్ల. ఇప్పుడు పరిస్థితులు ఒక్కొక్కటీ అర్థం కాసాగాయి. తన ఇల్లు, ఇంట్లో మనుషలు ఎలాంటి ఘర్షణలకు లోనవుతూ బతుకుతున్నారో తెలిసి మనసంతా వికలమైనట్టుగా అనిపించింది. పిల్లలకి అర్థంకాని సమస్యలు పెద్దవాళ్ళ ఘర్షణలు పిల్లల మీద ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో తెలుసుకుని తన భవిష్యత్తు గురించి భయపడింది మొదటిసారిగా.

స్వప్న తలపుకివచ్చి కంటినుంచి రెండు కన్నీటి చుక్కలు చెంపల పక్కగా రాలి దిండుమీద పడ్డాయి. 'ఆక్కా! ఎలా వున్నావు' అనుకుంది.

*        *        *

శరత్, స్వప్న కాపురంపెట్టి నెల రోజులైంది. వేరే ఇల్లు తీసుకున్నాడు అద్దెకి. రెండు గదులు, వరండా. గాలి, వెలుతురు బాగా వస్తుంది పైనభాగం అవటంవల్ల. తన శక్తికిమించిన అద్దె అనిపించినా స్వప్న కోసమని తీసుకున్నాడు.

తల్లి తన వూరెళ్ళిపోతూ కొడుకు చేతిలో వెయ్యిరూపాయలుంచి ఇంటికి కావలసినవి తెప్పించమని చెప్పింది.

పెళ్ళయిన మరుసటిరోజునుంచే వుద్యోగాన్వేషణలో పడ్డాడతను. ఓ పది రోజులకి ఏదో కాంట్రాక్టు కంపెనీలో ఎకౌంటెంట్‌గా అప్పాయింట్ అయ్యాడు. మంచి ఉద్యోగం వచ్చే వరకూ ఏదో ఒకటి చేయాలని అతని ఉద్దేశం.

అతనికొచ్చే ఆరువందల జీతం వారి కనీసావసరాలు తీర్చలేకపోతున్నా ఆనందంగానే జీవితాలు గడిపేస్తున్నారు. తిన్నా తినకపోయినా, ఆనందమే జీవితంగా, ప్రేమాభిమానాలే మహత్తరమైన అనుభూతులుగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు. అంత ఆనందంలోనూ స్వప్న అంతరాంతరాల్లో ఏదో అసంతృప్తి. అదీ తల్లిని గురించి ఆలోచనలతో! తనకోసం ఎంత కుమిలి కుమిలి ఏడుస్తోందోనని తలచుకుంటే, మనసు తల్లడిల్లిపోయేది. ఒక్కసారి వెళ్ళి చూడాలని మనసు తహతహలాడేది. వెళ్తే ఎదురయ్యే పరిణామాలు తలచుకుని శరత్ ఒడిలో ఒదిగిపోయి ఏడ్చేసేది.

చల్లటి చేతులతో ఆమెను దగ్గరకు తీసుకుని అనునయించేవాడు. అతని ఓదార్పు మాటలే ఆమెకు శాంతి. అతని చూపుల్లో, మాటల్లో, చేతల్లో అద్భుతమయిన ఆనందాన్ని అనుభవిస్తున్నట్లుగా వుండేది స్వప్న.

అందమయిన వెన్నెల రాత్రుల్లో వారిద్దరి శరీరాలు ఏకమయ్యే క్షణంలో అనురాగపూరితమయిన చూపులతో ఆమెను పెనవేసుకుని పక్కమీదికి చేర్చి సిగ్గుతో, మోహంతో ముడుచుకుపోతున్న ఆమెను ముద్దుమాటలతో ఒకరిలో ఒకరి ఐక్యతకోసం పడే తపన...ఆమె భుజాల మీద అతని స్పర్శతో ఆమెలో సెగలు పొగలుగా కమ్ముకున్న ఆవేశం. అతనికి అతుక్కుపోయి, అతని జుట్టులో చేయి పోనిచ్చి, అతని ముఖాన్ని తన గుండెకేసి రుద్దుకుంటున్న ఆమెలో తన సర్వస్వాన్ని అతనికే సమర్పించుకోవాలనే కోరిక.

'ఈమె లేకపోతే తన జీవితం...?' అని వూహించుకోడానికే భయపడతాడతను.

*        *        *

ఆరోజు శరత్ ఫోంచేసి గబగబ ఆఫీసుకు బయల్దేరుతుంటే... అతని కన్నీ చూసి పంపించి... అంతదూరం వెళ్ళే వరకూ చూస్తూ లోపలికి వచ్చి తలుపు వేయబోతుంటే... టాక్సీ ఒకటి తన ఇంటి ముందు ఆగటం కనిపించింది.

అందులోంచి కృష్ణవేణి దిగటం చూసి ఆనందంతో ముఖం విప్పారింది. ఆమె పైకి రాగానే 'ఆంటీ' అంటూ సంతోషంతో కౌగలించుకుంది.

తన మనసుకి అత్యంత ఆప్తురాలైన మనిషిని కొన్ని సంవత్సరాల తర్వాత చూస్తున్న అనుభూతి కలిగి అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి స్వప్నకి.

కృష్ణవేణి పరిస్థితీ అలాగే వుంది. స్వప్న తనకు దూరమై ఇక్కడికి వచ్చి నెలరోజులే అయినా కొన్ని సంవత్సరాలు దాటినట్టు మనసుబరువుగా అయిపోయింది.

తనకున్న ఒకేఒక ఆత్మీయురాలు, స్నేహితురాలూ మాత్రమే కాకుండా, ఇద్దరిమధ్యా ఏర్పడిన అనుబంధం వల్ల ఆమె దూరాన్ని చాలా భారంగా సహించింది ఇన్నాళ్ళూ! రోజూ ఒక్కసారి కనిపించి, 'ఆంటీ' అని తన మనసంతటితోటి పిలిచే ఆమె పిలుపుకోసం, ఈ కొద్దిరోజులనుంచీ ఎంత ఆరాటపడిందీ, ఆమె దూరాన్ని ఎంత అశాంతిగా భరించిందీ స్వప్నతో ఏవిధంగా చెప్పాలా అని ఆలోచిస్తోంది కృష్ణవేణి.

"లోపలికి రండి" అంటూ వరండాలోంచి లోపలికి నడవబోతోంటే కృష్ణవేణి ఆమెను ఆపి, "స్వప్నా! లారీలో సామాను వస్తోంది. అడ్రసు తెలీక వెతుక్కుంటాడేమో డ్రైవరు. రెండు నిమిషాలు ఇక్కడే నిలబడదాము. అవునూ... నీ ప్రియవిభుడు ఎక్కడ?" అంది నవ్వుతూ.

"ఫోంచేసి ఆంటీ! ఏదో చిన్న ఉద్యోగం దొరికింది. ఆఫీసుకి వెళ్ళారు. ఉదయం వెళ్తే సాయంకాలమే ఇంక రావటం" అని ఆగి, "లారీ ఏమిటి ఆంటీ?" అంది అర్థంకాక. ఆమె జవాబు చెప్పే లోపే ఇంటిముందు లారీ ఒకటి సామానుతో వచ్చి ఆగింది. లారీ నిండా ఫర్నిచర్ చూసి ఆశ్చర్యంతో నోట మాట రాక నిలబడిపోయింది.

నలుగురు కూలీమనుషులు సామానంతా పైకి తెచ్చి పెట్టి వెళ్ళిపోయారు. సింగిల్ కాట్, ఫోమ్‌బెడ్, ఐరన్ సేఫ్, డైనింగ్ టేబిల్, ఫాను, గ్రయిండరు–ఇంకా వంటింటి కవసరమయ్యే సామానుచాలా వున్నాయి.

"ఆంటీ! ఏమిటివన్నీ?" అంది తేరుకుని.

"మీ పెళ్ళికి నా కానుక. మీరు కొనలేరనీ... ఇంకోలా... ఇంకోలా భావించకండి. ఆత్మీయులకి అభిమానంతో ఇస్తున్న కానుక. మీరిద్దరూ కాదనకూడదు"

స్వప్నకి ఏం మాట్లాడటానికీ తోచటం లేదు.

"శరత్‌కి కోపం వస్తుందేమో! అయినా ఆంటీ... వీటిని కానుకలనరు. మమ్మల్ని ఆదుకోవటం అంటారు. ఇప్పుడు మాకేం తక్కువయింది. మామీద అభిమానంతోనే మీరింత చేస్తున్నా, నాకేమిటో ఇబ్బందిగా వుంది'' అంది.

కృష్ణవేణి చిన్నగా నవ్వి స్వప్న భుజంమీద చేయివేసి, "స్వప్నా! నేనే నీ తల్లినో, అక్కనో అయితే కాదంటావా? పరాయిదాన్ని కాబట్టి అలా అనుకుంటున్నావు" అంది. ఆమె మాటల్లో నిష్ఠూర భావం ధ్వనించింది.

"కాదు ఆంటీ,...అలాఎప్పుడూ అనుకోకండి. మీమీద నాకెలాంటి అభిమానమో నాకన్నా మీకే బాగా తెలియాలి" అంది నొచ్చుకుంటూ.

"నువ్వెలా వున్నావో, వచ్చీరాని పనులతో ఏం సతమతమవుతున్నావో, మీవాళ్ళని తలచుకుని ఎంత బాధపడుతున్నావో..క్షణం వదలకుండా ఇవే ఆలోచనలు" అంది కృష్ణవేణి స్వప్న వంక అభిమానంగా చూస్తూ.

స్వప్న కృష్ణవేణిని మంచంమీద కూర్చోమని చెప్పి, గబగబా వెళ్ళి కాఫీ కలిపి తెచ్చింది.

"పిల్లలెట్లా వున్నారు?"

"పల్లవి నిన్ను చూడాలని చాలా గొడవ. పెళ్ళయి, అత్తగారింటికి వెళ్ళిపోయింది అంటే... పెళ్ళెందుకు చేశారని అడుగుతోంది" అంది నవ్వుతూ.

స్వప్న కూడా పకపకా నవ్వేసింది.

చాలాసేపు కాలం తెలియకుండా కబుర్లాడుకున్నారిద్దరూ. కృష్ణవేణి కోసం వంట చేసింది స్వప్న.

స్వప్న ప్రయత్నాన్ని కాదనలేక పోయింది.

కొద్దిసేపయ్యాక స్వప్నకి హఠాత్తుగా భాస్కర్ జ్ఞాపకం వచ్చాడు. అతని గురించి తెలుసుకోవాలనే ఆసక్తి అధికమయ్యింది కానీ, తనని అపార్థం చేసుకుంటుందేమోననే భయం సందిగ్ధంలో పడవేసింది.

"స్వప్నా! ఏమిటంత నిశ్శబ్దంగా వున్నావు. ఏమైనా చెప్పు" అంది.

స్వప్న ఇంక తను అడగాలనుకున్న ప్రశ్నను అణచివేయలేకపోయింది. సూటిగా అడగలేక డొంకతిరుగుడుగా మొదలుపెట్టింది.

"మీగురించీ, మీ భర్తవల్ల మీలో రగిలే అగ్నిపర్వతాలు మిమ్మల్నెంత దహించివేస్తున్నాయో, ఎందుకు బతుకుతున్నారో అన్నీ నాకు తెలుసు. మురళిగారిని మార్చుకోవాలని ప్రయత్నించమని అన్నాను. ఆయనేమైనా మారారా?" అంది.

ఆమె గుండెల్లో బాధ ఎగదన్నినట్టుగా అయి బరువుగా వూపిరి వదిలి అంది– "లైఫ్ ఈజ్ నథింగ్ బట్ ఎ సిరీస్ ఆఫ్ ఎడ్జెస్ట్‌మెంట్స్ అంటాన్నేను – ఎవరయినా జీవితం ఏమిటని అడిగితే! అలా బతికేయటమే కానీ, మనుషుల్లో మార్పు అంత తేలిగ్గా ఎలా వస్తుంది స్వప్నా! అయితే నేనీ పరిధులు దాటి ఒకడుగు ముందుకు వేశాను" అంది నెమ్మదిగా.

"అదేమిటి...?" తొందరగా అంది స్వప్న.

కృష్ణవేణి ఒక్క క్షణం తడబడింది. 'మంచికో చెడ్డగా అనుకోకుండా జరిగిపోయిన కొన్ని సంఘటనలు తనలో తానే దాచుకుని, ఆనంద విషాదాల మధ్య నలిగిపోయింది ఇన్నాళ్ళూ! ఇప్పుడు స్వప్నకి చెప్పివేయాలి. ఆమె తన మనసునేవిధంగా విశ్లేషిస్తుందో చూడాలి' అనుకుంది మనసులో.

ఆమె గుండెలో రగులుతున్న బాధ లోంచి ఒకవిధమైన ఆనందం తొంగిచూసింది. "స్వప్నా! నాకు ఆపుస్తకాలిచ్చి గొప్ప మేలుచేశావు. ఆ రచనల వల్ల నేనెంతగానో ప్రభావితురాలినయి నాను. నాలో శక్తి, వూపిరి, రక్తం.... సమస్తం కొత్తగా నూతనోత్తేజంతో పొంగి ప్రవహిస్తున్నాయి. ఈ కొత్త ఆనందానికి, నిజమైన ప్రేమానురాగాల కోసం తపిస్తున్న నా హృదయద్వారంలో భాస్కర్ ప్రవేశం గొప్ప మలుపు.




నన్ను నన్నుగా ప్రేమించే మనసు అతనిలో వుందనిపించింది. సంఘాన్నీ, సంప్రదాయాలనూ తృణీకరించే సాహసం ఏర్పడింది నాలో!

సాంసారిక జీవితంలో సుఖశాంతులు లేక క్షణక్షణం ఆయనతో బతుకు భయంగా మారి చావు బతుకుల మధ్య గడుపుతున్న నాకు భాస్కర్ ప్రేమ, దయ, పవిత్రత కొత్త జీవితాన్ని ప్రసాదించాయి.

ఇప్పుడనిపిస్తుంది జీవితం ఎంత అందమైనదని! అనంతమైన ఆకాశం, విరబూసే ఈ పువ్వులు, స్వేచ్ఛగా విహరించే ఆ పక్షులు, పవిత్రంగా సాగే గోదావరి, ముద్దుగా తాకే గాలి, భాస్కర్ ప్రేమ పిలుపు...నాకిక బతుకులో అందమే తెలీకుండా పోతుందనుకున్నాను. ఇప్పుడు అలలు అలలుగా పొంగిపొరలే ఆనందమే నాలో" అంది.

స్వప్న నిటారుగా అయింది. ఆమె చెప్పే ప్రతిమాటనీ ఎంతో ఆసక్తిగా వింటూ-"ఆంటీ...మీ ముఖంలో ఇలాంటి ఆనందంకోసమే నేను ఎదురుచూస్తున్నాను. నాకెంత సంతోషంగావుందో చెప్పలేను. మీలో ఇంత ధైర్యం, సాహసం వచ్చాయంటే ఆశ్చర్యంగావుంది. అయితే ఒక్కమాట— భాస్కర్‌ని ప్రేమించటం తప్పుకాదుకానీ అతనిమీద మీకు సంపూర్ణమైన నమ్మకం వుందా?"

"ఎందుకు లేదు. నమ్మకం లేకుండా మనసులో చోటెలా ఇస్తాను?!"

"మీరు అందంగా వుంటారు. కాలేజీలో చదువుకునే రోజుల్లో మీకోసం తపించి పోయేవాళ్ళలో, మిమ్మల్ని ప్రేమించాలని కలలుగనేవాళ్ళలో అతనూ ఒకడు కావచ్చుగా! ఆ కోరిక ఇప్పుడు ఇలా...మీరు బాధల్లో మునిగి, అశాంతితో కుమిలి పోతున్నారని గ్రహించి, వేటికోసం ఆరాట పడుతున్నారో వాటిని అందిస్తున్నట్టు నటించి ఎప్పుడో ఆశపడ్డ కోరికలు ఈవిధంగా తీరుతున్నాయని గర్వపడే వుద్దేశం కావచ్చుకదా" అంది సాలోచనగా.

"ఇన్నిరోజుల సాన్నిహిత్యంలో అతను అలాంటివాడు కాదనీ, పెళ్ళయిన సంవత్సరానికే భార్యపోవటం, అయినా పెళ్ళిచేసుకోకుండా ఇంతకాలం వుండగలిగాడంటే అతని వ్యక్తిత్వం ఎలాంటిదో వూహించు స్వప్నా! నా మీద ప్రేమగా నటించటంవల్ల అతనికి వచ్చే లాభం ఏమిటి?" అంది.

"ఆనందం. ఆకాశంలో చందమామలా వూరిస్తూ ఎవరికీ అందకుండాపోయిన ఒక గొప్ప అందగత్తెను అనుభవించాననే ఆనందం"

కృష్ణవేణి ముఖంలో కోపం తొంగి చూసింది ఆ మాటకి.

"ఆంటీ! కేవలం నేను మిమ్మల్నీ, మీ ప్రేమనీ పరీక్షిస్తున్నాను. నన్ను అపార్థం చేసుకోకండి" అంది ప్రాధేయ పూర్వకంగా.

"నీకు తెలీదు స్వప్నా...భాస్కర్‌ది చాలా ఉన్నతమైన తత్వం. పోనీ అతను ఆ వుద్దేశంతోనే నన్ను ప్రేమించినా ఇష్టంలేని భర్తతో బాధపడటంకంటే ఇష్టమున్నట్టు నటించే ప్రియుణ్నే నమ్మటం మంచిదికాదంటావా?" అంది.

"కాదు.... మీ ఆలోచన తప్పుదారి పట్టింది అంటాను. జీవితంలో చేయ కూడని పొరపాటు చేశారంటాను. ప్రేమ లేని పెళ్లిలో పవిత్రత లేదని భావించే మీరు....ఆ పవిత్రత లేని మరో మనిషికి మనసిచ్చి జీవితాన్ని పూర్తిగా పాడుచేసు




కున్నారు అంటాను. భౌతిక, శారీరక పరమైన బంధాలకి అతీతమైన ప్రేమని అతను మీకందించగలడా? మీ స్నేహితురాలిగా అడుగుతున్నాను ... చెప్పండి" అంది స్వప్న.

"శారీరకమైన సంబంధాలున్నంత మాత్రాన అది నిజమైన ప్రేమ కాదని నీ వుద్దేశమా?"

"మీరక్కడే పొరబడ్డారు. స్త్రీలకి ఆత్మగౌరవం వుండాలి. భర్తని వదిలి మరో మగాడితో జీవించాలని నిశ్చయించుకునే సమయంలో బాగా ఆలోచించాలి. రెండోమనిషి దగ్గరకూడా అవమానింపబడితే ఆ స్త్రీకి సంఘంలో రక్షణ స్థానం లేక ప్రమాదవశమౌతుంది. మీ అనుబంధం ప్రేమవరకే అయితే చాలదు. మీరు మీ భర్త ఇల్లు సంసారం... సమస్త శృంఖలాలు తెంచుకుని బైటికి రావాలి. భాస్కర్ మిమ్మల్ని పెళ్ళాడి మీ పిల్లల్ని దయగా స్వీకరించగలడా?

నిజంగా అతణ్నించి మీకంత గొప్ప ప్రేమ దొరికిందని భావిస్తే ఆ కొత్త జీవితం వైపు బాటలు వేసుకోండి... సుఖపడండి. ప్రేమ, స్వేచ్ఛ, శాంతి అనే విలువలు జీవితాంతం వరకూ నిలుపుకోడానికి ప్రయత్నించండి. కానీ తర్వాత మోసపోయానని కుమిలిపోవద్దు. జీవితం మీద విరక్తి పెంచుకోవద్దు. పిల్లలకు దూరమై వాళ్ళ భవిష్యత్తుకి ప్రతిబంధకమయ్యే అవకాశం ఇవ్వకండి. నేను భరించలేను. వాళ్ళు మీకే కాదు-నాకూ ప్రాణమే" అప్పటివరకూ పగ్గాలు పట్టి వెనక్కి లాగుతున్న కన్నీరు ఒక్కసారిగా ధారగా ప్రవహించింది.

'ఆంటీ' అంటూ ఆమె ఒడిలో ఒరిగిపోయి ఏడ్చేసింది స్వప్న.

కృష్ణవేణి మనసు, శరీరమూ కూడా స్తంభించిపోయింది. నరనరాన ఏదో భయమూ...అశాంతి, సందిగ్ధత, కన్నీళ్లు ఇంకిపోయినట్టుగా జీవం లేని చూపు.

తన ఒడిలో తల పెట్టుకుని తన కోసం అంతగా తపించే ఒక ప్రాణిని చూసి విరక్తిగా నవ్వుకుంది.

"బాధపడకు స్వప్నా...నీ ఊహలన్నీ వట్టి భ్రమలేకదా! నా జీవితం గురించి నాకు గాఢమైన నమ్మకం. నా పూజలు స్వీకరించి, నా మొర ఆలకించిన దేవుడు నా జీవితానికి ప్రాణం పోయమని పంపాడనిపిస్తుంది. నేను మురళితో బతకలేను. ఏదో నిర్ణయం తీసుకుని, భాస్కర్ గృహస్థ జీవితంలో అడుగు పెడతాను. అతని కాళ్ళ మీద పడి పిల్లల్ని నేనే తీసుకుంటాను. పిల్లలు లేకుండా నేనొక్క క్షణం బతకలేను స్వప్నా" పిల్లలు తలపుకొచ్చి ఆమె హృదయం విలవిల్లాడింది. దిండులో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చేసింది.

వాతావరణం నిశ్శబ్దంగా, బరువుగా అయింది. ఇద్దరి మనసుల్లోనూ బాధ, దుఃఖం, ఆలోచన.

చాలా సేపు అలాగే గడిచింది.

"ఆంటీ... లేవండి. నన్ను చూడాలని ఆప్యాయంగా వచ్చిన మిమ్మల్ని అనవసరంగా బాధపెట్టాను. నన్ను క్షమించండి" అంది.

"లేదు స్వప్నా! అలా అనుకోకు. నా గురించి ఆలోచించి తాపత్రయపడే మనిషివి నువ్వే!నామంచి చెడ్డల్ని ప్రతిపాదించే హక్కు కూడా నీకు వుంది. చలనంలేని బొమ్మలా గడుపుతున్న నాకు నీ స్నేహం గొప్ప అదృష్టం. నిన్నూ, నీ ఋణాన్నీ ఎలా తీర్చుకోను" అంది

మనస్ఫూర్తిగా.

కొద్దిసేపలా మౌనంగా వున్న తర్వాత కృష్ణవేణిలేచి టైము చూసుకుని– "అబ్బా... టైమే తెలీలా! నాలుగైంది. పిల్లలు వచ్చే టైమైంది నేవెళ్తాను" అంది చీర కుచ్చెళ్ళు సర్దుకుని ముఖం అద్దంలో చూసుకుంటూ.

"స్వప్నా! మా ఇంటికి రావచ్చును కదా ఎప్పుడైనా" అంది మళ్ళీ తనే.

"రావచ్చు కానీ,మీఇంటివరకూ వచ్చి అమ్మనీ, చెల్లినీ, నాన్నగార్నీ చూడకుండా నా మనసు ఆగదు. పెళ్ళయి ఇన్ని రోజులైనా కనీసం ఏమాత్రం నాన్నగారిలోనామీద కనికరం కలగలేదు చూడండి. కన్నబిడ్డల మీద కక్షేమిటి ఆంటీ" అంది గాద్గదికంగా.

కృష్ణవేణి స్వప్నని అనునయించింది. "ఎంతకాలం వుంటారు అలా పట్టుదలగా. ఆయనే వచ్చి సకల మర్యాదలు చేసి తీసుకెళ్తారు మిమ్మల్ని" అంది.

స్వప్న మౌనం వహించింది.

కృష్ణవేణి ముఖం కడుక్కొని అద్దం ముందు నిలబడి బొట్టు పెట్టుకుంటున్న సమయంలో, లోపలికి వస్తున్న శరత్‌ని అద్దంలోంచి చూసి గిరుక్కున వెనుతిరిగింది.

అతను లోపలకు వస్తూ చుట్టూవున్న సామానువంక వింతగా చూస్తూ, వెనక్కితిరిగి వెళ్ళటానికి రెండడుగులు వేశాడు.

"అదేమిటి...వెళ్ళిపోతున్నావు?"అంది స్వప్న వింతగా.

"ఏమిటి... ఇది మన ఇల్లేనా? కాదనుకున్నాను–ఈ సామాను అదీ చూసి" అన్నాడు నవ్వుతూ.

"గొప్పే ! కృష్ణవేణి ఆంటీ వచ్చారు చూడు. రాలోపలికి" అంది.

అప్పటివరకూ అతను ఆమెను చూడలేదు. ఎదురుగా దేవతా మూర్తిలా నిలబడ్డ ఆమెను చూసి నమస్కారం చేశాడు.

"మీ పెళ్ళికి నేను రాలేకపోయాను. మీ ఇద్దర్నీ చూస్తుంటే ముచ్చటగా వుంది. కలకాలం ఒకరినొకరు అర్థంచేసుకుని కలసి బతకండి. నా ఆశీర్వాదాలివే" అంది కృష్ణవేణి.

అతను "థాంక్సండీ" అంటూ ఆమెను కూర్చోమన్నాడుకుర్చీ చూపిస్తూ. ఆమెతో అదే పరిచయం అవటంవల్ల ఏం మాట్లాడటానికి గొంతు పెగలటం లేదు అతనికి.

కృష్ణవేణి ఏవో కొన్ని పాకెట్సు విప్పి అందులోంచి స్వప్నకి, శరత్‌కి సంబంధించిన బట్టలు తీసి పట్టుకుని, "శరత్! ఇవి నేను ప్రేమతో ఇస్తున్న కానుకలు తీసుకోండి" అంటూ వాళ్ళ చేతిలో పెట్టింది.

"కృష్ణవేణిగారూ! ఇవన్నీ ఏమిటి! ఈ ఫర్నీచర్... ఈ కానుకలు. ఎవరూలేని మాకు మీ అభిమానం, ప్రేమలే కానుకలు. అవి చాలదూ మాకు! మీరిలా ఇస్తే నేను గిల్టీగా ఫీలవుతాను. మీ ఇష్టం" అన్నాడు నిదానంగా.

కృష్ణవేణి అతని మాటల్ని అంతగా పట్టించుకోలేదు. ఏదోవిధంగా అతనికి నచ్చచెప్పాలని ప్రయత్నించింది.

"శరత్! మీరలా అనుకోవద్దు. మీ ఇద్దరికీ అత్యంత సన్నిహితురాలిగా భావించి స్వీకరించండి. నా గుర్తుగా మీముందుంచుతున్నాననుకోండి" అంది ఇద్దర్నీ వుద్దేశించి.

వాళ్ళేం మాట్లాడలేదు.

మరో అయిదు నిముషాల తర్వాత ఆమె చెప్పులు వేసుకుని వెళ్ళటానికి




సిద్ధమైంది.

శరత్ వెళ్ళి టాక్సీ తీసుకువచ్చాడు. ఆమె సీట్లో కూర్చున్నాక, "నన్ను డ్రాప్ చేయమంటారా?" అన్నాడు.

"నోనీడ్ శరత్! నువ్వు రెస్టు తీసుకో. నేవెళ్తాను" అంది.

స్వప్న, శరత్ ఆమె కనిపించేవరకూ చూసి లోపలికి వచ్చారు.

స్వప్న మనసు బరువుగా అయిపో యింది. భగవంతుడు ఆమెను సమస్యల వలయంలో బంధించి ఆడుకుంటున్నాడు. వీటన్నిటిని ఎలా పరిష్కరించు కుంటుందో అనుకుంది చాలా సేపు.

ఆమె డల్‌గా వుండటం గమనించి– "ఏమైంది స్వప్నా" అని అడిగాడు.

గట్టిగా నిట్టూరుస్తూ కుర్చీలో తల వెనక్కి వాల్చి ఆమెతో జరిగిన సంభాషణ తాలూకు ఛాయలు ఇంకా మనసులోనే మెలితిరుగుతుంటే చెప్పింది.

శరత్ ఆశ్చర్యపోయి విన్నాడు. ఎందుకో అతనికి ఏదో జరగకూడనిది జరిగినట్టుగా, కృష్ణవేణి తప్పటడుగు వేసిందేమో అనిపించింది మనసుకి. ఆమె సర్కిల్ చాలా తక్కువ . మనిషి మంచి చెడులను తెలుసుకునే అవకాశం ఆమెకు లేదు కాబట్టి... బాగా ఆలోచించి వుంటే మంచిది అనుకున్నాడు.

స్వప్నతో కూడా అదే అన్నాడు.

ఆమె తలూపి వూరుకుంది.

"అతను నిజంగా ఆమెను పెళ్ళి చేసుకుని సుఖపెట్టాలనే ఆలోచన వుంటే ఆమె అదృష్టవంతురాలే కదూ!" అన్నాడు మళ్ళీ.

ఆ మాటకి ఆమేం మాట్లాడలేదు. ఏదో నిర్లిప్తత చోటుచేసుకుంది ఆమెలో.

"స్వప్నా! ఈ ఫర్నీచరూ, అదీ మనకు అనవసరం. వచ్చేజీతం తక్కువ. తినటానికే సరిపోతుంది. ఇవన్నీ భరించే శక్తి ఏది? నువ్వు తీసుకోకుండా వుండా ల్సింది" అన్నాడు.

"పోనీలే శరత్! ఆంటీ ఏదోవిధంగా మనల్ని ఆదుకోవాలనే తాపత్రయంతో ఇచ్చింది. ప్రేమించే మనుషులు కావాలంటే దొరకరు. దొరికిన ప్రేమను పదిల పరచుకోవాలి. తీసుకోకపోతే ఆమె బాధపడుతుంది. అది నాకిష్టం లేదు" అంది.

* * *

ఆ రాత్రంతా కృష్ణవేణికి నిద్రపట్ట లేదు. ముసురుపట్టిన ఆకాశంలా వుంది ఆమె మనసు. భాస్కర్ వ్యక్తిత్వాన్ని గురించి, తన భవిష్యత్తు గురించి తీవ్ర మైన ఆలోచన. భాస్కర్‌కి ఫోన్ చేయాలి. అతను రాగానే విషయం చెప్పాలి. తనింక ఈ పరిసరాల మధ్య బతకలేదు. సంఘంజోలి తనకనవసరం. జీవితం క్షణికమనీ, అశాశ్వతమనీ అంటారు. ఇప్పటివరకూ తన జీవితం నిశీధి గీతంలా, కొడిగట్టిన దీపంలా అయి పోయింది. ఆ దీపంలో చమురుపోసి వెలుగు నింపింది భాస్కరే ! నావల్ల ఎదురయ్యే మంచి చెడుల్ని, బాధల్ని, బాధ్యతల్ని భరించి సహించగల ప్రేమ వుంది అతనిలో ! నా జీవితానికింకేమిటి లోటు?! అనుకుంది.

మరుసటిరోజు భాస్కర్ వచ్చేసరికి, అతనికోసమే ఎదురుచూస్తున్నదానిలా, గుమ్మంలోనిలబడి స్వాగతం చెప్పిందామె.

స్కూటర్ స్టాండు వేసి, ఠీవిగా అడుగులో అడుగువేసుకుంటూ అంత వరకూ ఆమెను గమనించనట్లే గుమ్మం వరకూ వచ్చి, అక్కడ నిలబడివున్న

కృష్ణవేణిని చూసి సమ్మోహితంగా నవ్వాడు.

పలకరింపుగా చూసింది అతన్ని. ఆమెతోపాటు అతనూ లోపలికి నడిచాడు.

వెంకటేశు వెనకెక్కడో వున్నాడు. భాస్కర్‌ని రమ్మని కృష్ణవేణి ఫోన్ చేయటం విని పనున్నవాడిలా బైటికి వెళ్ళిపోయాడు. ఆరోజే కాదు– ఏరోజు భాస్కర్ వచ్చినా ... అతను వెళ్ళిపోయినట్లు స్కూటరు శబ్దం వినిగానీ లోపలికి రాడు.

భాస్కర్ కుర్చీలో కూర్చుంటూ– ''ఎందుకు కృష్ణా...రమ్మన్నావు. ఏమైనా పనుందా నాతో?'' అన్నాడు.

"అవును భాస్కర్...నీతో మాట్లాడాలనీ'' అంది.

"ఏమిటి?"

''మురళితో మన విషయం చెప్పి విడాకులు కోరుదామనుకుంటున్నాను. ఇంక ఈ దాగుడుమూతలు నేనాడలేను. పిల్లలిద్దర్నీ నాతో పంపమని ప్రాధేయపడతాను" అంది.

ఆమె గొంతులో పట్టుదలకి అతను ఆశ్చర్యపోయి చూశాడు. ఆమెకేవిధంగా సమాధానం చెప్పాలా అని ఆలోచించాడు



ఒక్క నిముషం.

''తొందరపడకు కృష్ణవేణీ! మురళికి అయితే కోపం ఎక్కువ. నువ్వలా ఎదుటపడి అడిగితే సహించగలడా? ఏ కారణం వల్ల విడాకులకు అప్లయి చేస్తావు. న్యాయానికి, చట్టానికి ఏవిధంగా తెలియ జేస్తావు. చట్టానికి దొరకని నేరాలు అతను పెట్టేబాధలు బాగా ఆలోచించి నేనే చెప్తాను. అతను అవునన్నా కాదన్నా మనం ఒకటి కావాలనుకుంటున్నామని చెప్తాను. అప్పటి వరకూ ఓపికపట్టు" అన్నాడు. అతని కంఠంలో ఎలాంటి దోషమూ ధ్వనించి నట్లనిపించలేదు ఆమెకి. వెంటనే అంది–

"పిల్లల్ని పంపుతారంటావా భాస్కర్. పిల్లలు లేకుండా నేను బతకలేను'' అంది గాద్గదికంగా.

"పిల్లల్ని ప్రేమగా పలకరించటం కూడా తెలియనివాడు పిల్లల బాధ్యత తీసుకుంటాడంటే నాకు నమ్మకం లేదు.



మంచి లాయర్‌తో మాట్లాడిచూద్దాం. నువ్వు భయపడకు. నీకు నేనున్నాను. నమ్మకం లేదా?" అన్నాడు.

"నమ్మకం లేకపోవటంకాదు. నీతో కలిసి బతకాలనే ఆరాటం. ఆ బతకటంలో ఉండే ఆనందం, తృప్తి తెలుసుకోవాలనే తపన... అంతే!" అంది.

భాస్కర్ ఆమె అరచేతిలో గీతలు గీస్తూ కూర్చున్నాడు చాలా సేపు. అతని మనసునిండా ఆలోచనలే! జీవితగమ్యం ఎటో, ఏమిటో అవి కూడా తలచుకోకుండా బతుకుతున్న అతనికి...ఆమె పరిచయం, ప్రేమ గమ్యం తెలిక అల్లాడి పోతున్నట్టుగా చేశాయి. పరిష్కారమెలా యోచించాలనే ఘర్షణలో నలిగి పోతున్నట్టుగా వుంది అతని వదనం.

మరో పావుగంట కూర్చుని, ఆఫీసు పని వుందంటూ వెళ్ళిపోయాడు.

కృష్ణవేణి మనసు ఆనందలోకాల్లో విహరిస్తున్నట్టుగా పరవశించిపోతోంది. గలగల్లాడుతూ వురికే ఎత్తయిన జలపాతం కింద తడిసి ముద్దవుతున్న ఆనందం. తన ఆనందాన్ని చూసి సంతోషంతో నర్తిస్తున్న ప్రకృతిలా హృదయం మహోధృతంగా పొంగుతున్న చప్పుడు.

ఆ భావనలపరవశత్వం ... ఆమెను చాలా సేపు వాస్తవంలోకి తీసుకురాలేక పోయింది. లేచి టేప్ ఆన్ చేసి తనకిష్టమైన పాటలు వింటూ కూర్చుంది.

* * *

మనిషి జీవితంలో కాలం తెచ్చే మార్పులు ఊహించనంతగా బాధపెడితే వాటిని తట్టుకుని నిలబడగలగటం కష్టమే అయినా నిలబడగల స్థయిర్యంవుండాలి. లేక పోతే జీవితం సమస్యల మయం.

రిజల్ట్సు వచ్చాయి. శశి, స్వప్న పాస య్యారు. శరత్‌కి, చందూకి క్లాస్ వచ్చింది. చందూ ఎమ్మేకి వెళ్లాలని ప్రయత్నిస్తు న్నాడు.

స్వప్న, శరత్ భవిష్యత్తుని గురించిన ఆలోచనలో పడ్డారు. ఇన్నాళ్ళూ వూహించుకున్న భవిష్యత్తు కనుచూపు మేరలో కనిపించటంలేదు వాళ్ళకి. అతను తెచ్చే జీతం నెలలో సగభాగం కూడా రావటంలేదు. ఆకలి అవసరాలు ఒకరి మీద ఒకరి ప్రేమవల్ల తీరటంలేదు.

అన్ని క్వాలిఫికేషన్సూ వుండి వుద్యోగం ఇవ్వటానికి వెనుకాడుతున్న ఆఫీసర్నుని చూసి కోపంతో రగిలిపోయేది శరత్ హృదయం.

శరత్ మాట వినకుండా పెళ్ళికోసం తొందరచేసి అతన్ని మానసిక క్షోభకి గురిచేశానని ఆమె బాధపడుతోందిప్పుడు.

అన్నీ వదిలి తనకోసం వచ్చిన ఆమెని అర్ధాకలికి గురిచేస్తున్నానని కుమిలిపోతు న్నాడు అతను. అప్పటివరకూ అతనిలో వున్న ధైర్యం నీరుకారిపోతూంది.

ఇలాగే ఇంకొంతకాలం గడిస్తే లేమి ఇద్దరిమధ్య ప్రేమానురాగాలను మింగేస్తుందేమోనని, అశాంతితో తప్పుచేశామనే భావం మొలకెత్తుతుందేమోనని, భయ పడ్డాడు.

అతని బాధని చూసి ఎంతగానో అను నయించింది స్వప్న.

తండ్రిని తనకివ్వవలసిన ఆస్తి గురించి అడుగుతానని అంది అతనితో. ఆ మాటకి అతనికెంతో కోపం వచ్చింది.

"నీకు పట్టెడన్నంకూడా పెట్టలేని ఫూల్ ననుకుంటారు మీ నాన్నగారు. ఇంకెప్పుడూ అలాంటి ప్రయత్నం చేయకు.... ప్లీజ్" అన్నాడు.

స్వప్న మాట్లాడలేదిక.




కానీ గట్టిగా ప్రయత్నించి ఏదో ఒక మంచి ఉద్యోగం సంపాదించాలనే పట్టుదల పెరిగింది అతనిలో. ప్రతి ప్రకటనకీ అప్పుచేసి మరీ అప్లికేషన్సు పంపిస్తున్నాడు. ప్రతి ఆఫీసుకీ కాళ్ళరిగేలా తిరుగుతున్నాడు.

జీవితంలో స్థిరపడ్డానికి అతనుపడే పాట్లుచూసి; ఇదివరకటి వుత్సాహం, ఆందం అతనిలో కొరవడటంచూసి అణచుకున్నా ఆగకుండా దుఃఖం వచ్చింది స్వప్నకి.

ఆరోజే అతన్ని ఒప్పించి అతనితో పాటు తనూ ఉద్యోగానికి అప్లికేషన్సు పెట్టడం మొదలుపెట్టింది.




స్వప్నకి తన చెల్లెల్ని చూడాలనిపించింది. మనసుండబట్టలేక ఎలా కలుసుకోవడమా అని ఆలోచించి శాంతి చదివే స్కూల్‌కి బయల్దేరింది.

రోడ్డు మీదికి రాగానే కృష్ణవేణికి ఫోన్ చేసింది– ఆమె ఎలావున్నదీ తెలుసుకోవాలని.

పల్లవి మాట్లాడగానే స్వప్నకి ఎక్కడ లేని ఆనందం కలిగింది.

పల్లవి సంగతి ఇంక చెప్పనేఅవసరం లేదు. రెండు నిమిషాల్లో ఎన్నో చెప్పాలని ఆ పిల్ల తాపత్రయం. కృష్ణవేణి అందుకుని "ఈవేళ ఆ నొప్పి ఈ నొప్పి 'అంటూ ఇద్దరూ ఇంట్లోకూర్చుని విసిగించేస్తున్నారు అల్లరితో" అంది నవ్వుతూ.

"పిల్లల అల్లరే ఇంటికి అందంకదా!" అంది స్వప్న.

"ఆహా... మరి మీ ఇల్లెప్పుడలా అందంతో చూస్తామో" అంది హాస్యంగా.

స్వప్న ఒక నిమిషం తర్వాత అంది– "ఇప్పుడే ఎందుకు ఆంటీ! జీవితంలో మేం స్థిరపడింది ఎక్కడ? సరైన ఉద్యోగం లేదు.పిల్లల్నికని వాళ్ళని పెంచలేక మరో బాధ కొనితెచ్చుకోడంఎందుకు?ఉద్యోగాల కోసం ప్రయత్నిస్తున్నాం ఇద్దరమూనూ! ఎక్కడా దొరికే అవకాశం కనిపించటం లేదు" అంది.

స్వప్న చాలా దిగులుపడిపోతున్నట్లు గ్రహించింది కృష్ణవేణి. ఆమెకేవిధంగా తను ధైర్యం చెప్పగలదు. ఏం చేయటానికి తన చేతుల్లో ఏంవుంది అనుకుని, ఇంతలో ఏదో తోచినట్టయి,"స్వప్నా! అలా దిగులు పడకు. చూడూ...మీకభ్యంతరం లేకపోతే ఒకసారి శరత్‌ను వెళ్ళి భాస్కర్‌ను కలవమని చెప్పు. భాస్కర్‌కి చాలా పెద్దవాళ్ళతో పరిచయం, పలుకుబడి వుంది. ఏదోఒక మంచి ఉద్యోగం దొరుకుతుంది తప్పకుండా" అంది.

"అలాగే ఆంటీ" అంది పెద్ద ఉత్సాహం చూపకుండా! అంత తేలిగ్గా తమకు ఉద్యోగాలు దొరికే ఆశ లేదని ఆమె ఉద్దేశం.

అక్కణ్ణించి ఆటోలో శాంతి చదివే స్కూలుకి వెళ్ళింది.

ప్యూన్ శాంతిని పిలుచుకు వచ్చాడు. స్వప్నని చూడటంతోనే, 'అక్కా!' అంది సంతోషంగా. ఆవేదనతో వున్న మనసులకి ఇష్టమైన వ్యక్తులు కనిపించే సరికి దుఃఖం ఎలా వస్తుందో అలా ఉంది వారి పరిస్థితి కూడా.

"శాంతీ...ఎలా వున్నావే?" అంది అభిమానంగా చూస్తూ.

"బానే వున్నాను. మీరూ...?" అంది శరత్‌ని దృష్టిలో పెట్టుకుని.

ఆ పిల్ల పలకరింపులోని ఆత్మీయతకు ఆనందపడి, "బానే వున్నాం కానీ...అమ్మ, నాన్నగారు బావున్నారా? అమ్మ వంట్లో ఆరోగ్యమేనా? ఇంకా నన్ను తలచుకొని కుమిలిపోతూనే వుందా?" అంది.

శాంతి మాట్లాడలేదు.

"ఏం శాంతీ...మాట్లాడు!" అంది స్వప్న - ఆ పిల్లని తీసుకుని అక్కడున్న బెంచీ మీద కూర్చుంటూ.

"నువ్వు లేని ఆ ఇల్లు ఎంత కళావిహీనంగా వుందో చెప్పలేనక్కా! నువ్వెక్కడున్నావో, ఎలావున్నావో అని అమ్మ కుమిలిపోని రోజు లేదు. ఆంటీకి నువ్వు ఫోనుచేసుంటావని ఆమెని అడిగితే చెప్పారు- పెళ్ళి చేసుకొని హాయిగా వున్నావని. అప్పటిగ్గానీ అమ్మ కొంత కుదుటపడలేదు.

ఇంక నాన్నగారి సంగతేముంది నన్నూ చదువు మానేసి ఇంట్లో కూర్చోమన్నారు. నేను తిండి మానేసి ఏడ్చాను. మా ప్రిన్సిపాల్ నాన్నగార్కి ఫోన్‌చేసి చెప్పాడు. చెప్పాక గానీ నన్ను కాలేజీకి పంపటానికి ఇష్టపడలేదు. రోజూ నాన్నగారే డ్రాప్ చేస్తున్నారు కాలేజీకి. కాలేజీలో ఉన్నంతసేపు ఫర్వాలేదు. ఇంటికి వెళ్తేనే బాధ అమ్మ కుమిలిపోవడం చూడలేక" అంది.

"అదే శాంతీ...నా బాధ కూడాను. అమ్మను చూడాలని మనసు కొట్టుకుపోతుంది. కానీ ఎలా? పట్టుదల అభిమానం. ఎప్పటికి అమ్మను చూడగలనో, ఏమో" ఆమె కంఠం రుద్ధమైంది.

ఇద్దరిమధ్యా కొద్దిసేపు మౌనం.

తర్వాత స్వప్న అంది- "శాంతీ... బాగా చదువుకో! అమ్మని బాధపడవద్దని చెప్పు. నేను చాలా ఆనందంగా, హాయిగా వున్నాను. ఎందుకు కుమిలిపోవడం. ఎప్పుడైనా ఇలా వస్తుంటాన్లే నిన్ను చూడటానికి... సరేనా!" అంది.

"ఈసారి శరత్‌ని, సారీ బావగార్ని కూడా తీసుకురా" అంది శాంతి నవ్వుతూ.

'ఓకే...ఓకే' అంటూ తనూ నవ్వేసింది స్వప్న.

ఓ గంటసేపు ఆ కబురు ఈ కబురు చెప్పుకుని, శాంతికి క్లాసు పోతుందని గుర్తుకొచ్చి ఇంక వెళ్తానంటూ లేచింది స్వప్న.

శాంతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. స్వప్న చూసి భుజం తట్టింది అనునయంగా. నిజానికి స్వప్న పరిస్థితీ అలాగే వున్నా నిలదొక్కుకుంది దుఃఖాన్ని.

వుండలేక విడలేక విడిపోయి, ఎవరి దారి వాళ్ళు వెతుక్కున్నారు.

ఏమిటో ఈ బంధాలు. ఈ మమతల వలయంలో చిక్కుకున్న మనిషి... వాటిని విడిపించుకోవాలని ప్రయత్నించటం అసాధ్యమేమో! తనా ఇంట్లోంచి వచ్చేస్తున్న క్షణంలో ఎవరు లేకపోయినా, ఎవరు కాదన్నా శరత్ వుంటే చాలనుకుంది. కానీ ఇన్నేళ్ళుగా తనని పెంచి పెద్దచేసిన తల్లినీ, తండ్రినీ, చెల్లెల్నీ, వారితోటి అనుబంధాన్నీ ఒక్కసారిగా తుంచివేసుకోడం కష్టమనిపించింది. అందుకే వున్నఫళంగా బయల్దేరింది శాంతిని చూడాలని. ఆమె ఆలోచనల్లో కదులుతుండగానే ఆటో ఇంటి ముందుకొచ్చి ఆగింది.




* * *

రెండు నెలలు గడిచిపోయాయి. కాలచక్రం యధావిధిగా తిరుగుతూనే వుంది.

ఆరోజు సాయంకాలం భాస్కర్ వచ్చి ఒక గంట కూర్చొని వెళ్ళాక, కృష్ణవేణి అలా పైకి వెళ్ళి బాల్కనీలో ఈజీఛైర్‌లో కూర్చొంది. మనసంతా ఏదో నిశ్శబ్దంగా అనిపించి అలా చల్ల గాలిలో కాసేపు కూర్చుంటేనైనా హాయిగా వుంటుందేమో అనుకుంది.

కుర్చీలో వెనక్కి వాలిపోయి రెండు చేతులూ వెనక రాడ్ మీద ఆనించుకొని రిలాక్స్‌గా కూర్చుంది.

చల్లటిగాలి. ఏడు గంటలు దాటింది. చిరుగాలిమృదువుగాఒంటినితాకుతున్నా... వెన్నెల చల్లదనం ఆమె మీద ప్రసరిస్తూన్నా... ఇవేమీ ఆమెలో నిస్తబ్దతను కదిలించలేకపోతున్నాయి.

కనురెప్పలు కదుల్చుతూ ఆకాశం కేసి దృష్టిసారించింది ఒక్కసారి. అనంత మైన ఆకాశంలో చందమామ ఒంటరిగా అందరూ తనని వెలేసినట్టు వేదనగా కనిపించింది ఆమెకు.

ఒక్క ఉదుటున లేచి తల ముందుకు సాచి, దీర్ఘంగా చూసింది మళ్ళీ. అదే ఆకాశం...అదే చంద్రుడు. కోటాను కోట్ల స్త్రీ హృదయాల్లో రగులుతున్న అగ్ని పర్వతాలను తనలో ఇముడ్చు కున్న జ్వాలలా వెలుగుతోంది. ఆ వేడి నార్పడానికి వెన్నెల తనకేంపట్టనట్టు నిశ్చలంగా వుంది. నక్షత్రాలు తమ సౌకు మార్యాన్ని చూడమని పరవశించిపోతు న్నాయి. కదిలే మేఘాలు ఆ వినిర్మలా కాశంలో చెరగని మరకల్లా వున్నాయి.

ప్రకృతి గంభీరంగా, ఏదో అపశకు నాన్నీ, కీడునీ సూచిస్తున్నట్టుగా వుంది.

ఆమె గుండెలు దడదడలాడాయి. తనచుట్టూ చీకటి పొరేదో కమ్మేసి దారి తెలీక తడుముకుంటున్నట్టుగా వుంది మనసు. చందమామ అలా మెరుస్తుంటే.. నక్షత్రాలలా వెలుగుతుంటే తన మనసు అందుకు విరుద్ధంగా ఆలోచిస్తుందేమిటి వేళ?

ప్రశ్నలు...అందుకనువైన సమాధా నాలూ-అన్నీ ఆమె చెప్పుకుంది కాసేపు. ఆలోచనలతో సతమతమవుతూనే ఏ క్షణానో నిద్రపట్టేసింది ఆమెకి.

తొమ్మిది దాటాక మురళి వచ్చాడు. కారు లాక్ చేసి లోపలికి వచ్చేసరికి ఎదు రుగా వెంకటేశుతో పిల్లలు ఆడుకోవటం చూశాడు. బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి మంచం మీద కూర్చుని, షూస్ విప్పి, పక్కన పడేస్తుంటగా కింద ఎవరిదో పర్సు పడి వుండటం కనిపించింది.

వంగి దాన్ని చేతుల్లోకి తీసుకుని చూశాడు. కొంత డబ్బు, భాస్కర్ విజిటింగ్ కార్డు వున్నాయి.

అంతే! ధన్‌మని మంచం మీంచి లేచి నిలబడ్డాడు. అడుగు ముందుకు వేయ బోయేవాడల్లా ఆగి– ఒక్క నిముషం ఆలోచించి, 'వెంకటేశ్' అని చాలా సౌమ్యంగా పిలిచాడు.

ఎదురుగా వచ్చి నిలబడ్డాడతను.

"భాస్కర్ వస్తానన్నాడు...రాలేదూ" అన్నాడు.

వెంకటేశుకి అతడి ప్రశ్న మొదట అర్థంకాలేదు.

"ఎవరు బాబూ!" అన్నాడు.

"భాస్కర్ వస్తానని ఫోను చేశాడు. వచ్చేడా అని అడుగుతున్నాను" అన్నాడు మళ్ళీ.

భాస్కర్ పేరు అతని నోటివెంట వినరావటంతో వెంకటేశు తలంతా తిమ్మిరెక్కినట్టు అనిపించింది. ధైర్యంకూడ దీసుకొని, "రాలేదుబాబూ!" అన్నాడు- ఏమంటే ఏంతంటావస్తుందోఅనుకుంటూ.

"రాలేదూ! ఆఫీసుకి ఫోన్ చేసి, మీ ఇంటికి వెళ్ళొచ్చాను. నా పర్సు అక్కడ మర్చిపోయాను. 'జాగ్రత్త చేయండి' అన్నానే" అన్నాడు ఏసి ఆన్‌చేస్తూ.

వెంకటేశు మతి స్థిమితం కోల్పోయింది. ముందు రాలేదనీ, ఇప్పుడు వచ్చారనీ అంటే నా ప్రాణం, అమ్మగారి ప్రాణం వుంటుందా? చంపేస్తారు. మరి ఏం చెప్పాలి?

అతను ఆలోచనలో వుండగానే అతను రెప్ప వేసేలోగానే మురళి చేతి అయిదు వేళ్లూ అతని చెంపలపై మచ్చలు తేలాయి. ఆ దెబ్బకి తల తిరుగుతున్నట్టుగా, ప్రాణం పోతున్నట్టుగా అనిపించి నిల దొక్కుకుని, చెంప పట్టుకొని నిలబడ్డాడు.

"వెంకటేశూ! చెప్పు. భాస్కర్ ఎన్నాళ్ళ నుంచి ఈ ఇంటికి వస్తున్నాడు" అన్నాడు నిలువెల్లాకోపంతో వూగిపోతూ.

వెంకటేశు చప్పున అతని కాళ్ళమీద పడిపోయి, "చదువుకునే రోజుల్నుంచే ఆళ్ళిద్దరూ స్నేహితులంట. అప్పుడప్పుడూ చూసి పోతుంటాడు. మీకు తెలిస్తే కోపం చేస్తారని చెప్పలేదు. అమ్మగారు దేవత. ఆమెనేం అనుమానించకండి.. మీకుదణ్ణం పెడతాను" అన్నాడు ఏడుస్తూ.

అతన్ని కాలితో ఒక్క తోపు తోసి, "ఎక్కడ మీ అమ్మగారు?" అన్నాడు.

"మేడ మీద కూర్చున్నారు..." అన్నాడు.

చరచరా మెట్లెక్కి బాల్కనీలోకి వెళ్ళాడు. నిద్రపోతున్న ఆమెను చూడ గానే... అతని మనసంతా అసహ్యంతో జుగుప్సతో నిండిపోయి తెరలు తెరలుగా వస్తున్న కోపాన్ని నిగ్రహించుకోలేక ఆమె దగ్గరికి వెళ్ళి, ఆమె రెక్కపుచ్చుకొని బరబర ఈడ్చుకొచ్చి బెడ్‌రూంలో పడేశాడు.

అవిసురుకి ఆమెవెళ్ళిగోడకికొట్టుకొని, తలకి తగిలిన దెబ్బకి దిమ్మెక్కిపోయింది. జరిగిందీ, జరుగుతున్నదీ ఏమీ అర్థం కాలేదు. ఒకపదినిముషాలకి వాస్తవలోకం లోకి వచ్చిపడినట్లనిపించింది.

ఎదురుగా భర్త ఉగ్రరూపం. చేతిలో పర్సు పట్టుకుని ఆవేశంతో రొప్పు తున్నాడు.

అది చూసిన కృష్ణవేణి గుండె జారి నట్టయింది. 'భాస్కర్ మనీ పర్సు... ఈయన చేతిలోకి... ఎలా వచ్చిందిఅను కుంది.

"ఏమిటలా దెయ్యంచూపు. ఈ పర్సు ఎవరిది?" అన్నాడు.

"భాస్కర్‌ది" అంది కాస్త ధైర్యాన్ని కూడదీసుకుని. ఇలాంటి పరిస్థితి ఎప్పుడో ఒకప్పుడు వస్తుందని వూహించే వుంది కాబట్టి ఇంక భయపడటం దేనికిఅనుకుంది ఆమె.

ఆమె ధైర్యానికి అతనిలో పిచ్చికోపం ఆవహించింది. ఆమె చెంపలు రెండూ అతని చేతిలో పగిలిపోయాయి.

నిర్జీవప్రతిమలా నిలబడిపోయింది కృష్ణవేణి. లోపల్నుంచి దుఃఖం కట్టలు తెంచుకొస్తున్నా శక్తినంతా కూడదీసుకొని ఆనకట్టవేసింది.

"వాడికి...ఆ భాస్కర్‌కి ఈ గది లోకి వచ్చే అధికారం, చనువు ఎలా

వచ్చింది?''

''మన ఇద్దరి మధ్య లేని అనుబంధం వల్ల...'' అంది.

మురళి షాక్ తిన్నాడు. శరీరంలోని ఒక్కో భాగం ఎవరో మంటల్లో వేసి కాలుస్తున్నట్టు మండుతున్నాయి.

కృష్ణవేణి ధైర్యం,ఆవేశం ఒక్కసారిగా అతని మీద విరుచుకపడ్డాయి.

"ఈ సమయం కోసమే నేను ఎదురు చూస్తున్నాను. నేనూ,భాస్కర్ ప్రేమించు కున్నాం. మీరనుమానించే విధంగా పెళ్ళి కాకముందు సంగతి కాదు. ఇప్పుడు పెళ్ళయి, పిల్లలుపుట్టి వాళ్ళ మంచి చెడు విచక్షణాజ్ఞానాన్ని తెలుసుకునే ఈ సమయంలో...భాస్కర్‌ని ప్రేమించాను. అందుకు కారణం చెప్పనవసరం లేదు.

''నా సంసారం గురించీ, కాబోయే భర్త గురించీ ఎన్నెన్నో అందమైన కలలు కన్నాను. లక్షలకొద్దీ మీరు సంపాదించే డబ్బు కోసం, మీరు కట్టించే మేడ మిద్దెలకోసం నేను ఆశపడలేదు. మీరు నా పట్ల ప్రేమానురాగాలతో ఉంటారనీ, నా అందాన్ని ఆరాధిస్తారనీ అనుకున్న ఆలోచనల్ని ధ్వంసం చేశారు.

''అలసిపోయి మీరు ఇంటికివస్తే ప్రేమగా లాలనగా ఆదరించబోయిన నన్ను మీరెలా ఆదరించారో, మాటలతో ఎంత క్రూరంగా హింసించేవారో ఒక్కసారిగుర్తుచేసుకోండి. పరపురుషుడి కంట పడనీయకుండా...జైలులాంటి ఈగదిలో బంధించి, కొట్టి ఆత్మాభిమానాన్ని కించ పరిచారు. ప్రేమగా పిలిచి దగ్గరకు తీసు కున్న క్షణం ఒక్కటి వుందా మన జీవితంలో! క్షణక్షణం మీతో బతుకు వేదనగా, నిస్సహాయంగా అయిపోయింది. నన్నూ, నా స్వాతంత్ర్యాన్ని హరిస్తూ ... నా వూహలకీ, కోరికలకూ సమాధికట్టి ఆనందిస్తున్నారు.

ఎంతకాలమిలా బతకాలి? నేను భరించలేను. ఈ నరకయాతన నుంచి దూరంగా వెళ్ళిపోవాలని నా మనసు ఆక్రోశిస్తున్న సమయంలో...భాస్కర్ పునః పరిచయం ఏర్పడింది. కాలేజీలో కేవలం పరిచయం...ఇప్పుడు ప్రేమగా మారింది. నా బాధనీ, మనసునీ అర్థం చేసుకుని తన గుండెలోనాకు గుడికట్టాడు. అతని ప్రేమ, సానుభూతి నాకు వరమయ్యాయి. నన్ను తన జీవితంలోకి తీసుకోడానికి సిద్ధంగా వున్నాడు" అంది.

ఇన్నాళ్ళూ తనలో రగిలే జ్వాలలు ఒక్కసారిగా పైకెగసాయి. ఉద్రేకంతో పలుకుతున్న ఆమె గొంతుక వెనక ఘోష. ప్రతి మాటలో కసి, ద్వేషం, అసహ్యం ధ్వనింపజేసింది. ఆయాసంతో రొప్పుతూంది.

మురళి మండే హృదయంతోనే విన్నాడు ఆమె మాటల్ని. ఆమె పడుతున్న వ్యధకానీ, క్షోభకానీ అతని మనసుని తాకలేదు. శిలకన్నా కఠినంగా మారింది మనసు. అతని అణువణువూ ఆమెమీద అసహ్యంతో నిండిపోయింది. అవమానాగ్నిలో రగిలిపోతూ ప్రతీకారజ్వాలలో ఆమెను ఆహుతిచేయాలనే రాక్షసత్వం.

''యూ..బ్రూట్...నువ్వు ఆడదానివి కాదు...రాక్షసివి. నీకు నీతి, జాతి, సంఘ కట్టుబాటు ఇవేమీ లెక్కలేవు. భర్తంటే భయం, గౌరవం ఏకోశానా లేవు. నీతో ఇరవైనాలుగ్గంటలూ కూర్చుని కబుర్లు చెప్పటానికి పనీపాటాలేని వెధవని కాదు నేను. కష్టపడి తెచ్చి తగలేస్తుంటే భర్త విలువ తెలీకుండాపోయింది నీకు. భర్త, పిల్లలు వుండగా నీతిలేకుండా మరొకడ్ని

మనువాడుతానంటున్నావంటే ... ఛీఛీ నువ్వు ఆడదానివి కాదు. నువ్వు వెళ్ళిపోతా ననగానే సాగనంపటానికి నేనంత చవటని కాదు. నా పరువూ మర్యాద ఏమైపోవాలి? నిన్నెలా దారిలోకి తేవాలో నాకు బాగా తెలుసు. ఆ స్కౌండ్రల్‌ని చంపేస్తాను. నన్ను అవమానించి, నా ఇంట్లో చిచ్చు పెడదామనుకుంటున్నాడా! వాణ్ణి ఇప్పుడే చంపేస్తాను" అన్నాడు ఆవేశంగా.

కృష్ణవేణి భయకంపితురాలైంది ఒక్క క్షణం. అతడు అనుకున్నది సాధించే వరకూ నిద్రపోని కఠినాత్ముడని ఆమెకు తెలుసు.

విరక్తిగా ఒక నవ్వునవ్వి-"భాస్కర్‌ని మీరేంచేసినా నేను మీతో ఇంకా సంసారం చేస్తానని అనుకోకండి. ఈ ఇంట్లో నేనింక వుండలేను'' అంది దృఢస్వరంతో.

అతను శివమెత్తినట్టుగా, ఒక్క ఉదుటున వెళ్ళి ఆమె కంఠం చుట్టూ చేతులు బిగించాడు. చంపేయాలన్నంత ఆవేశం వచ్చింది.

ఆమె అసహాయంగా పెనుగులాడింది. అతని చేతులు బిగుసుకుంటున్నకొద్దీ ... నరాలు మెలితిరుగుతున్నట్టు గిలగిల కొట్టుకుంటూ స్పృహతప్పి పడిపోయింది.

అప్పటికిగానీ ఆమెను వదలలేదు అతను. జీవచ్ఛవంలా పడివున్న ఆమెను కనికరంతో ఒక్కచూపు కూడా చూడ కుండా తలుపు తీసుకుని బైటికి వచ్చాడు.

ఏడుస్తూ దబదబ తలుపులు బాదుతున్న పిల్లలు, వెంకటేశు ... విసురుగా బైటికివచ్చిన మురళిని చూసి పక్కకు తప్పుకున్నారు.

అతను కారు తీసి బైటికి వెళ్ళిపోగానే వేగంగా కృష్ణవేణి దగ్గరకు పరుగెత్తారు.

స్పృహ లేకుండా పడున్న ఆమెను చూసి, మంచినీళ్ళు తెచ్చి ముఖం తుడిచి, ఆమె తల నిమురుతూ-"తల్లీ...లేమ్మా!" అంటున్నాడు. అంతకన్నా అతని గొంతు పెగలటం లేదు.

పిల్లలు వెక్కుతూ చూస్తున్నారు.

పదినిముషాలు గడిచాక నెమ్మదిగా కళ్ళు తెరచి చూసింది. ఎదురుగా పిల్లలు, వెంకటేశు కనిపించగానే పిల్లల్ని దగ్గరికి తీసుకుని ఏడ్చేసింది.

"వెంకటేశూ! నాకేం ఫర్వాలేదు. భాస్కర్‌కి ఫోన్ చేయి ముందు. అర్జంటుగా నేను రమ్మన్నానని చెప్పు" అంది నీరసంగా.

వెంకటేశు అందుకు వప్పుకోలేదు. "ఇప్పుడెందుకమ్మా! అయ్యగారు కోపంలో వున్నారు. భాస్కర్ బాబుని చూసి మండిపడతారు. ఇలాంటి సమస్యలు పరిష్కరించుకోడానికి కోపాలు కాదు కావలిసింది సహనం వుండాలి. ఆడది ఎదురుతిరిగితే కొంతమంది మగాళ్లు భయపడరు...మృగాల్లా ప్రవర్తిస్తారు. మీలాంటి వారు తట్టుకోలేరు. ఇవాళ్టికి విశ్రాంతి తీసుకోండి నా మాట విని" అన్నాడు బతిమాలుతూ.

తల్లి అనేదేమిటో పిల్లలకి అర్థం కావటంలేదు. ఆమెను కరుచుకుని కూర్చున్నారు.

"లేదు వెంకటేశూ...నువ్వు చెయ్యి. సహనానికీ ఒక హద్దుంటుంది. ఈరోజుతో ఆ హద్దు దాటిపోయింది. వెళ్ళు... ఫోను చెయ్యి" అంది.

ఆమె చెప్పిన నంబర్‌కి ఫోనుచేశాడు వెంకటేశు.

* * *

ఇంట్లోంచి విసురుగా వెళ్ళిన మురళి, భాస్కర్ నివసించే ఇంటిముందు కారాపి, విజిటింగ్ కార్డుతీసి చూశాడు ఒక్కసారి.

అదే అడ్రసు. కారు దిగి లోపలికి నడిచాడు. ఎదురుగా తలుపులకి తాళం వేలాడుతూ కనిపించింది. ఇంటిముందు ప్యూనుగానీ, మరెవరయినా వున్నారేమోనని చూశాడు. ఎవరూ కనిపించలేదు.

రెండు నిముషాలలాగే నిలబడి 'ఇడియట్... ఈ వేళకి బతికిపోయాడు' అని కసిగా అనుకున్నాడు.

కారులో కూర్చుని ఆక్సిలేటర్ బలంగా నొక్కాడు.

* * *

వెంకటేశు రిసీవరు పట్టుకుని పది నిముషాలు నించున్నాడు. ఎవరూ ఫోను తీసే శబ్దం కాలేదు.

కృష్ణవేణి నిట్టూర్చి, "పెట్టేసెయ్యి. ఇంకా ఇంటికి వచ్చి వుండరు" అంది.

పిల్లల్ని తీసుకెళ్ళి వాళ్ళగదిలో పడుకోబెట్టి తనూ వాళ్ళపక్కనే ఒరిగింది.

ఎప్పుడో అర్ధరాత్రి అవుతుందనగా మురళి వచ్చినట్లు శబ్దం అయింది. భాస్కర్‌తో ఏం గొడవ పెట్టుకుని వచ్చారోనని గుండె బిగబట్టుకుని చూస్తోంది. తనను లేపి మళ్ళీ ఏ రాద్ధాంతం సృష్టిస్తాడోనని కలవరపడింది కృష్ణవేణి.

కానీ అలాంటిదేం జరక్కపోవటంతో నెమ్మదిగా ఊపిరి పీల్చుకుని, సూర్యోదయంకోసం తపస్సు చేస్తున్నదానిలా కళ్లు మూసుకుని నిద్ర రాక తెల్లవార్లూ అలాగే గడిపేసింది.

తెల్లవారాక ఆమె లేచేసరికి మురళి డ్రసప్అయి బయటికి వెళ్ళటం చూసింది.

అతను కారు బయటికి తీస్తున్న సమయానికి, అతనికి తెలిసిన నలుగురు పెద్ద కాంట్రాక్టర్సు కారు దిగటం చూసి, వేగంగా వెళ్ళి వాళ్ళను లోపలికి ఆహ్వానించాడు.

ఆరోజు కొత్తగా వేయబోతున్న లోకల్ ట్రయిన్ రూట్‌లో లైన్ వేయటానికిగానూ టెండర్సున్నాయి. అది తను కూడా తీసుకోవాలని మురళి ప్లాను. ఆ




వచ్చినవాళ్లు మిగతా భాగస్తులు.

భాస్కర్‌విషయమేదోఅంతు తేల్చుకో వాలని బయలుదేరిన అతనికి వాళ్లు రావటం పొంగే పాలమీద నీళ్లు చల్లినట్లని పించింది.

అయినా ఏదోవిధంగా వాళ్ళను సమాధానపరిచే వుద్దేశంతో "నాకు ఈవేళ చాలా ముఖ్యమైన పనుంది. ఆ కాంట్రాక్టును నేను వదిలేసుకుంటున్నాను" అన్నాడు.

వాళ్లు అంగీకరించలేదు. బలవంతం చేసి మురళిని తమతో తీసుకెళ్లారు.

అతను వెళ్లిపోయాక కృష్ణవేణి పిల్లల్ని స్కూలుకి పంపించి భాస్కర్‌కి ఫోనుచేసింది వెంటనే రమ్మని.

అరగంట గడిచాక వచ్చాడు అతను. వస్తూనే కృష్ణవేణిని చూసి,ఆమె ముఖంలో కనిపిస్తున్న దిగులు, చెదరిన జుట్టు, పాలిపోయిన చెక్కిళ్ళు... ఏదో జరగకూడనిది జరిగినట్టుగా వూహించాడు.

భాస్కర్‌ని చూడగానే వచ్చి అతని చేతిలో వాలిపోయింది. ఆమెలో ఎక్కడలేని ధైర్యం, సంతోషం ఆవరించుకున్నాయి.

ఆమెను సోఫాలో కూర్చోబెట్టి, తనూ కూర్చున్నాడు.

"భాస్కర్! మన విషయం... మన విషయం ఆయనకి చెప్పేశాను" అంది తడబడుతున్న గొంతుతో.

అతనికి ఎక్కడలేని ఆశ్చర్యం వేసింది. ఆమె ఆ విషయాన్ని అంత తేలిగ్గా చెప్పటం విచిత్రమనిపించింది.

"నన్ను కొట్టారు....తిట్టారు. నిన్ను సర్వనాశనం చేస్తానని బయల్దేరారు. రాత్రి నువ్వు ఇంట్లో లేవు. ఎక్కడికి వెళ్ళావు?" అంటూ పళ్ళు మర్చిపోయి వెళ్ళిన విషయం చెప్పింది అతనికి.

కొద్దిసేపు అతనేం మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తున్నట్టుగా కూర్చున్నాడు. అసలింక ఒక్క నిముషం కూడా అక్కడ కూర్చోబుద్ధి కాలేదు అతనికి.

మురళి వచ్చి తననేమైనాబెదిరిస్తాడేమోననే భయంకాదు-ఇంక ఆమె ఇంట్లో, ఆమె ముందు కూర్చోవలసిన అవసరం కనిపించలేదతనికి. ఇలాంటి సందర్భం ఎప్పుడో ఒకసారి వస్తుందనుకున్నాడు. కానీ ఇంతతొందరగా కాదు.

ఆమె చేయి పట్టుకుని, "కృష్ణవేణీ... నువ్వు చాలా తొందరపడ్డావనిపిస్తోంది" అన్నాడు నెమ్మదిగా.

"ఏవిషయంలో..." అంది నుదుటు చిట్లించి.

"మన విషయమే! ఇప్పటికిప్పుడు మనం పెళ్ళిచేసుకుని, పిల్లల్ని తీసుకెళ్ళడం అంటే జరిగేపనేనా? ఎన్ని ఆలోచించాలి" అన్నాడు క్రీగంట ఆమెను గమనిస్తూ.

"ఏమిటి భాస్కర్ నువ్వనేది ?" ఒక్కొక్క మాటా ఒత్తి. పలుకుతూ అంది.

"మురళి నుంచి విడాకులు లేకుండా మనం ఒకటి కావటం జరిగేపనికాదు. ఇప్పుడు నువ్వతన్ని విడిచి వచ్చేస్తే లోకం నిన్నెంత అసహ్యంగా చూస్తుందో ఆలోచించావా? పైగా మురళి నిన్నూ, నన్నూ కూడా బతకనివ్వడు. కృష్ణా! సంసారంలో కల్లోలాలు సహజం. సర్దుకుపోవటం అలవాటుచేసుకోవాలి. అందరు ఆడవాళ్ళు చేసేపనే అది. అయినా ఇంకొద్ది రోజులు ఓపిక..."

ఆపైన అతని మాటలు వినలేకపోయింది కృష్ణవేణి. రుద్రమూర్తిలా

వూగిపోతూ "డోంటాక్ షిట్. బాస్టర్డ్" అని అరిచింది.

సోఫాలోంచి ఒక్క వుదుటున లేచి, పిచ్చిపట్టినట్టుగా అతని చెంపలు రెండూ ఇష్టమొచ్చినట్టు వాయించింది.

"గెటౌట్...ఇంకొక్క నిముషం నువ్వు నాముందు నిల్చుంటే సిన్నేం చేస్తానో నాకే తెలీదు. వెళ్ళిపో...వెళ్ళిపో" అంది.

"అదికాదు కృష్ణవేణీ! నేను చెప్పేది" ఆమె రెండు చేతులూ పట్టుకోబోయాడు.

ఆ పిరికి మనిషిని పట్టుకుంటే మహా పాపం అవుతుందేమో అనిపించినట్లుగా, "నువ్వు వెళ్తావా...నన్నే గెంటమంటావా? చెప్పు" అంది అతనికి దూరంగా జరిగి.

అతను వెళ్ళిపోయాడు.

ఆమె మనసులోంచి శాశ్వతంగా వెళ్ళిపోయాడు.

తలుపులు మూసి, వాటికి ఆనుకుని, దిగజారిపోతున్న గుండెను పట్టుకుని ఆశలకీ, అనుభవాలకీ మధ్య దూరం అధికమై దుఃఖమొక్కటే తన జీవితానికి మిగిలినట్టుగా గుండెపగిలేలా ఏడుస్తూ కింద కూలబడిపోయింది.

హృదయాన్ని కత్తితో కోస్తున్న బాధ. కళ్ళు నెత్తురు చిమ్ముతున్నట్టుగా. వాటివెనుకఏవో...అస్పష్టమైన దృశ్యాలు. వాటిని తలచుకుంటే తనమీద తనకే జుగుప్సలాంటి భావన. తన గుండెను నలిపి ఆనందించిన కాలంమీద కసి, ద్వేషం.

తను కట్టుకున్న కొత్త ప్రపంచపు సౌధాలు కంపించి భీకరంగా అగాధాల్లోకి కూలిపోయినట్టు చప్పుడు. గుండెలవిసిపోయేలా ఏడ్చింది.

'ఏం మిగిలింది తన బతుక్కి? ఏం సాధించాలని మనిషి జన్మనిచ్చాడా భగవంతుడు? నైరాశ్యం, బాధ, చీకటి ఇవే... ఇవే తన బతుక్కి మిగిలిన అనుభవాలు. ఇంకా ఎంత కాలమిలా బతకాలో! ఇంతకాలం భయంకరమైన అనుభవాల ఒరిపిడిలో నలిగిపోయింది. ఇంకా ఈ బతుక్కి... ఆ రొచ్చులో పడి కొట్టుకునే శక్తి లేదు. అలసిపోయింది... పూర్తిగా అలసిపోయింది. విశ్రాంతి కావాలి. ఈ ప్రపంచం, భర్త, పిల్లలు, సంసారం... ఏమైనా కానీ వాటిని పట్టించుకునే శక్తి లేదు. బాధపడే ఓపికా లేదు. ఆకులో ఆకుగా, పువ్వుల్లో పువ్వుగా, ఆకాశంలో స్వేచ్ఛగా చరించే పక్షినై... అలా బతుకుతాను. ఆ జన్మ కావాలి తనకు... అంతే!' అనుకుంది.

అలా ఆలోచించుకున్న తర్వాత గానీ ఆమె మనసు నిశ్చలంగా, నిర్వేదంగా వుండగలిగింది. శూన్యంలోకి చూపులు నిలిపి శిలలా కూర్చుండిపోయింది చాలా సేపు.



అమరుసటిరోజే చందూ ఢిల్లీ వెళ్ళాడు. అతనికక్కడ యూనివర్సిటీలో సీటు వచ్చింది. ఎమ్మెస్సీలో స్పెషలైజేషన్ చేసి, పి హెచ్ డి, ఆతర్వాత డాక్టరేట్... ఇవి అతని కోరికలు. స్కాలర్‌షిప్, అక్కా బావల ఆదరణ, ఆర్థికసహాయం వుండటంవల్ల అతను

ఢిల్లీలో చదువుకొనసాగించాలనుకున్నాడు.

శరత్‌నీ, స్వప్ననీ విడిచి వెళ్తున్నందుకు చాలా దిగులు పడ్డాడతను. ఈమధ్య కాలంలో వాళ్ళకి అతనితో అనుబంధం మరింత స్థిరపడటం, ఆత్మబంధువులా ధైర్యంచెప్పి, దిగులుపోయేలా నవ్వించే అతను వెళ్ళిపోతుంటే స్వప్న బాధపడింది మరింతగా.

అతనికి వీడ్కోలు చెప్పి, ఇంటి కొచ్చి, మౌనంగా కూర్చున్న స్వప్నని చూసి ఏం తోచక గింజుకున్నాడు. స్వప్న మౌనంగా వుంటే అతనంతే! పిచ్చివాడైపోతాడు. పాట పాడో, జోకులు వేసో నవ్వించేవరకూ శాంతివుండదు. ఆమెకు వూపిరి సలపకుండా గిలిగింతలు పెట్టి... కళ్ళవెంట నీళ్ళు వచ్చేవరకూ ఇల్లంతా గందరగోళం చేస్తాడు. మళ్ళీ వాతావరణం నవ్వు పువ్వులతో అనురాగా నందాలతో నిండిపోతుంది.

"స్వప్నా! నాదో చిన్న కోరికోయ్" అన్నాడు ఆమె భుజంమీద గడ్డమానించి గోముగా.

"ఏమిటో!"

"మనిద్దరికీ ఒక బాబువుంటే బావుం టుందికదా... ఇల్లు కళకళలాడుతూ" అన్నాడు.

ఉలిక్కిపడి "నేనంత తీరుబడిగాలేను" అంది చిరుకోపంతో.

"తీరుబడికాక ఏం చేస్తున్నావేం?"

"పిల్లల్ని కనటం, పెంచటం ఇదే జీవితంకాదు నాకు. కొన్ని ఆదర్శాలు న్నాయి. స్వతంత్రంగాబతకాలనీ జీవితాన్ని కళగా తీర్చిదిద్దుకోవాలనీ! పిల్లలకేం తొందర. వాళ్ళకి ఏవిధమైన ఇబ్బందులు కలిగించమనే నమ్మకం ఏర్పడినతర్వాత అప్పుడు ఆలోచిస్తాను" అంది పోజుగా.

శరత్ గట్టిగా నవ్వేశాడు.

"శరత్! ఈవేళ భాస్కర్‌గార్ని కలుసుకోవాలి. ఉద్యోగం విషయం ఆయనతో మాట్లాడాల్సిందే! నువ్వు వెళ్ళ నంటున్నావు. నేనైనా వెళ్తాను. ఇలా కూర్చుంటే రోజులు గడిచిపోతున్నాయి కానీ మనల్ని వెతుక్కుంటూ ఏ అవకాశం రాదుకదా! నన్ను వాళ్ల ఆఫీసుదగ్గర డ్రాప్‌చేసి వెళ్ళు" అంది.

"క్వాలిఫికేషన్సు వున్నప్పుడు ఎవర్నీ ఏ సహాయం కోరటం నాకిష్టం వుండదు...నీ ఇష్టం" అంటూ ఇంటికి తాళం పెట్టి బయల్దేరారిద్దరూ.

స్వప్నని భాస్కర్ వుండే ఆఫీసు దగ్గర వదిలి వెళ్ళిపోయాడతను. స్వప్న లోపలికి వెళ్ళి భాస్కర్‌ని అడిగింది.

ప్యూను ఆరోజు భాస్కర్ ఆఫీసుకి శెలవుపెట్టినట్టుగా చెప్పాడు. ముఖ్యమైన విషయాలేమైనా వుంటే ఇంటికి వెళ్ల వచ్చునని చెప్పాడు.

రెండు నిమిషాలు ఆలోచించి అతని దగ్గర అడ్రసు తీసుకుని రిక్షా ఎక్కి బయల్దేరింది.

అతనింటిముందు రిక్షా ఆగ్గానే లోపలికి వెళ్ళి బెల్ నొక్కింది.

"యస్ కమిన్" అన్న కంఠం విని పించి తలుపుతోసి లోపలికి అడుగు పెట్టింది.

అడుగుపెట్టీపెట్టడంతోనే ఎదురుగా సోఫాలో కూర్చున్న భాస్కర్‌ని చూసి స్థాణువైపోయింది. టీపాయ్‌మీద రెండు విస్కీ బాటిల్సు, గ్లాసులు, ఐస్ క్యూబ్స్ పెట్టుకుని సోఫాకి చేరబడి కుడిచేతిలో సిగరెట్ పొగ పరుగెత్తే మేఘాల్లా విడిచి పెడుతుంటే, మరో చేత్తో గ్లాసులోని ద్రవాన్ని నోట్లో పోసుకుంటున్నాడు.

స్వప్నకి మతిపోయినట్లయింది. 'తను పొరపాటున ఇక్కడికి రాలేదుకదా! తను చూసిన భాస్కర్ ఇతను కాదేమో! ఒక్కసారి అదీ ఎప్పుడో చూసింది. ఇతనుకాదు. అడ్రసు తప్పు చూసుకుంది తను. ఇలాంటివాడిని అంటీ ఎందుకు నమ్ముతుంది. ఛఛ...వెళ్ళిపోవాలి' అనుకుంటూ బైటికి నడవబోతోంటే-

"ఓ...స్వప్నా...నువ్వా! అదేం వెళ్ళిపోతున్నావు. నేను భాస్కర్‌నే! కృష్ణవేణి చెప్పింది నీకేదో ఉద్యోగం కావాలని. తప్పకుండా ట్రై చేస్తాను. కమాన్...వచ్చి కూర్చో!" అన్నాడు మత్తుగా.

మేకతోలు కప్పుకున్న పులిని చూసినట్టు అసహ్యంగా, భయంగాచూసి అక్కడ మరోక్షణం కూడా నిలబడటం అనవసరమనిపించి వెనక్కి తిరగబోతోంటే అతను వేగంగా వచ్చి చేయి పుచ్చుకున్నాడు.

అతన్ని కోపంగా చూస్తూ- "చెయ్యి తియ్యి" అంది.

ఆదేం పట్టించుకోలేదతను. "కృష్ణవేణితో సంబంధ బాంధవ్యాలు పూర్తిగా తెంచేసుకున్నాను. పెళ్ళిచేసుకోవాలట. నా వల్లకాదన్నాను. భార్య లేనివాణ్ణి మీతో నాకెంతవరకూ అవసరమో అంతవరకే వుంటాను. ఉద్యోగం విషయం తర్వాత మాట్లాడదాం. కమాన్...లెటజ్ ఎంజాయ్" అన్నాడు ఆమెను బలంగా లాక్కెళుతూ!

స్వప్న తన శక్తినంతా కూడదీసుకుని గింజుకుంటూ కాలితో ఒక్కతోపు తోసింది. అతను తూలిపడబోయి నిలదొక్కుకుని ఆమె పైట చెంగు అందుకోబోయాడు.

స్వప్నకి ఆవేశం, భయం, అసహ్యం ఒక్కసారిగా పెల్లుబికాయి. "యూ.... స్కౌండ్రల్. అయ్ విల్ కిల్‌యూ" అని అతనిమీద విరుచుకుపడి, కాలితో బలంగా తన్ని ... అతను పైకి లేచేసరికే హాండ్‌బాగ్, సర్టిఫికెట్లూవున్న రికార్డు చేతిలోకి తీసుకుని ఒక్క పరుగున బైటికి వచ్చింది.

ఆవేశంతో రొప్పుతూ ఆటోపిలిచింది. జుట్టు చెదిరిపోయి, ముఖమంతా పట్టిన చెమటను తుడుచుకుని ఆటో ఎక్కింది.

ఇంట్లోకి వెళ్ళి మంచంమీద పడిపోయి, దిండులో ముఖం దాచుకుని వెక్కి-వెక్కి ఏడ్చేసింది.

తన గురించి కాదు ఆమె బాధ-తను ప్రాణంగా అభిమానించి, ప్రేమించే కృష్ణవేణిని తలచుకుని కుమిలిపోతోంది. ఆమె జీవితంలో మార్పు రావాలనీ, సుఖపడాలనీ తనెంతో ఆశపడింది. ఓర్పు, సహనం కాదు... ధైర్యం, సాహసం వుండాలని వుత్తేజపరిచింది తను. ఆమె ఘోరంగా మోసపోయిందన్నమాట. ఆ విషయం తలచుకుని స్వప్న నవనాడులూ కృంగిపోతున్నాయి.

ఈ దుర్మార్గుడి ప్రేమ, పలుకు, నడవడి సమస్తం ఉన్నతంగా భావించి, తన తనువూ, మనసూ అర్పించిందే! ఇంత గుడ్డిగా ఎలా నమ్మింది? అతన్నెవరు శిక్షిస్తారు? ఎలా శిక్షిస్తారు? మురళికి ఈ విషయం తెలిస్తే ఆమెను బతకనిస్తారా? ఆమె ఈ దారుణాన్ని ఎలా భరిస్తుంది? ఇప్పుడామెను చూడాలంటే ఎలా?- జవాబు తోచని ప్రశ్నలే అన్నీ. ఏడుస్తూ అలా వుండిపోయింది.

ఎప్పుడో శరత్ వచ్చి మంచంమీద కూర్చుని, "అమ్మాయిగారు... ఈవేళప్పుడు తీసుబడిగా పడుకున్నారంటే, అదేదో పెద్ద ఉద్యోగమే" అన్నాడు

 

వెక్కిరింపుగా.

ఒక్క ఉదుటున లేచి అతన్ని చుట్టేసి, అతని గుండెల్లో తలపెట్టుకుని బావురు మంది. పెనుగాలికి వూగిసలాడే కొమ్మలా చెదరిపోయి అస్తవ్యస్తంగా వుంది ముఖం. చూస్తూనే విషయం అర్థంకాక కంగారు పడ్డాడు "ఏమైంది స్వప్నా!" అంటూ.

ఎర్రగా వుబ్బిన కళ్ళు, ముఖంచూసి కలవరపడిపోతూ ఆమె ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని, "చెప్పు స్వప్నా... ప్లీజ్" అన్నాడు మళ్ళీ.

అయిదు నిముషాలకిగానీ నెమ్మదించ లేదు ఆమె మనసు.

జరిగిన విషయమంతా వివరంగా చెప్పింది అతనికి. శరత్ వింటూనే వంట్లో రక్తం మరుగుతున్నట్టుగా పళ్ళు బిగపట్టి, 'రాస్కెల్... బుద్ధిలేని వెధవ' అంటూ నోటికొచ్చినట్టు తిడుతూ, ఆవేశంగా లేచి నిల్చుని, "వాణ్ణి నరికి పోగులు పెడతాను. ఆడపిల్లమీద చేయివేస్తాడా? అయ్ విల్ మర్డర్ హిమ్" అంటూ ఆవేశంతో బైటికి నడిచాడు.

స్వప్న చప్పున మంచంమీంచి దూకి, అతనికి అడ్డంగా వెళ్ళింది. "శరత్! నువ్వు వెళ్ళద్దు. అతను దుర్మార్గుడు. అతన్ని శిక్షించటం వల్ల లేనిపోని గొడవలు వస్తాయి. ఇప్పుడేం జరిగింది. పోనీయ్....ముందు ఆంటీ దగ్గరికి వెళ్దాం. ఆమె ఈ దారుణాన్ని ఎలా సహిస్తోందో! ప్లీజ్... లోపలికి వచ్చెయ్యి" అంది.

"లేదు స్వప్నా! వాడికి బుద్ధిచెప్పాలి. వాడి మూలంగా ఒక స్త్రీ జీవితం బురద పాలైంది. ఇంక ఇలాంటి మోసాలు చేయ కుండా చంపేస్తాను వాణ్ణి" అంటూ గబగబ మెట్లు దిగబోతుంటే...వెంకటేశు మెట్లెక్కి గాభరాగా పైకి రావటం చూశాడు.

వెంకటేశుని ఇంతకుముందు చూసి వుండకపోవటంతో, 'ఎవరని' అడిగాడు స్వప్నని.

స్వప్న అతన్ని చూసి, "ఏమిటి వెంకటేశూ?" అంది భృకుటి ముడిచి.

"మిమ్మల్ని, శరత్‌బాబుగార్ని ఉన్న ఫళంగా తీసుకురమ్మన్నారు అమ్మగారు" అన్నాడు బొంగురు కంఠంతో.

"దేనికి?" ఆమె ముఖంలో భయం తాండవించింది.

శరత్ మెట్లదగ్గరే ఆగిపోయాడు.

"ఏమో! మొన్నరాత్రి అయ్యగారు, అమ్మగారు భాస్కర్‌బాబు గురించి గొడవ పడ్డారు. తెల్లారిపిల్లల్ని స్కూలుకి తీసుకెళ్ళి వచ్చేసరికి కృష్ణవేణమ్మ ఏడుస్తూ గదిలో కనిపించారు. భాస్కర్‌బాబు వచ్చి వెళ్ళి ఉంటారనుకుంటా. ఈలోపు నేను గదిలోకి వెళ్ళబోతే నన్ను రావద్దన్నారు. ఒంటరిగా ఉండనివ్వమన్నారు. నాకెందుకో భయంవేసింది. అయ్యగారికి ఫోనుచేస్తే ఏదో పనులమీద తిరుగుతున్నారని చెప్పారు. ఇవేళ పొద్దున్నుంచీ అలా గదిలోనే కూర్చున్నారు. అన్నం ఏమీ తీసుకోలేదు. సాయంకాలం పిల్లలు స్కూలు నుంచి వచ్చాక, వాళ్ళని దగ్గర కూర్చోబెట్టుకుని ఏవో కబుర్లు చెబు 'తున్నారు. ఏడుస్తున్నారు. నన్ను పిలిచి అడ్రసుచెప్పి మీ ఇద్దర్నీ తీసుకు రమ్మ న్నారు" అన్నాడు.

స్వప్న మనసేదో కీడు శంకిస్తు న్నట్టుగా వుంది. గుండె దడ హెచ్చింది. వళ్ళంతా చెమటతో ముద్దయింది. భయం లోంచి బయటపడి ఏదోమాట్లాడాలని శత విధాలా ప్రయత్నిస్తూనే మాటరాక మెట్లు దిగింది.

శరత్‌కి ఆమె పరిస్థితి అర్థమైంది. ఆమె వెనకే పరుగెత్తాడు. ముగ్గురూ టాక్సీలో కూర్చున్నారు. ప్రయాణం కనీసం అరగంట పడుతుంది. అంత కాలాన్ని భరించలేనిదానిలా వుంది స్వప్న.

టైముచూస్తే ఏడుగంటలవుతోంది. దట్టమైపోతున్న నిశీధిలో భయపడుతున్న ప్రకృతి. ఉధృతంగా వీచేగాలికి కదులుతున్న చెట్లు బేతాళనృత్యం చేస్తున్నాయి. స్మశానంలో కాలుతున్న కట్టెలనుండి లేచేపొగ ఆకాశమంతా కమ్మి చీకటైనట్టుంది. నిశీధిగీతంలా దూరంగా ఎక్కడో వికృతంగా పక్షి అరుపులు.

కృష్ణవేణి మనసునీ, ఆలోచనల్నీ, సున్నితమైన మనస్తత్వాన్నీ కాచి వడబోసినదానిలా... ఈ సంఘటనకి ఆమె మనసెంతగా దెబ్బతినివుంటుందో పరిపరి విధాల ఆలోచన సాగించింది స్వప్న. మనసంతా తనుచేసే ఆలోచనకీ, పడుతున్న భయానికీ పొంతన కుదరక గందరగోళమైపోతోంది.

ఎప్పుడు వెళ్ళి ఆమెను చూద్దామా, తన చేతుల్లోకి తీసుకుని ఓదార్చి ఆమె జీవితానికి శాంతినిచ్చే స్థిరమైన పరిష్కారాన్ని తనే ఏదో చెప్పాలని హృదయం కొట్టుకుపోతోంది.

ఇద్దరిమధ్యా పరిచయం, అనుబంధం, ఆదరణ ఒక్కొక్క సంఘటనా ఒక్కొక్క దృశ్యంలా కళ్లలో మెదులుతోంటే ఆ వుద్వేగం పట్టలేక కన్నీరయి బయటికి ప్రవహిస్తోంది.

ఆ చీకటి, పెనుగాలి, పక్షి అరుపు, ఆకాశంనలుపు...ఆమెనుభయవిహ్వలినిని చేస్తున్నాయి.

కృష్ణవేణిని తలచుకోవటంవల్ల కలుగుతున్న బాధ, దుఃఖం, ఆవేదన ఒంటరిగా ఏకాంతంలో కూర్చుని ఏడిస్తేకానీ మనసు చల్లారేట్టు లేదు ఆమెకి. తలచుకుంటున్న



కొద్దీ కృష్ణవేణి ఈ బాధనీ, మోసాన్నీ భరిస్తూ...భరించలేక ఎలా రగిలిపోతోందో చూడాలంటే గుండె బరువెక్కుతోంది. ఆమెనుంచి ఏం వినవలసివస్తుందోనని మధనపడుతోంది స్వప్న.

బరువుగా నిట్టూర్చి, పిడికిళ్లు బిగించి నుదుటిమీద పెట్టుకుని వెనక్కి వాలింది.

ఆమె పడేఅవస్థ గమనిస్తూనేఉన్నాడు శరత్! ఆమెలో చెలరేగే ఆలోచనలు పట్టి చూడగల మనసుతో ఆమె భుజం తడుతూ నిస్పృహగా కూర్చున్నాడు.

కృష్ణవేణితో అతనికి పెద్ద పరిచయం లేకపోయినా స్వప్నకీ, ఆమెకీమధ్య అను బంధంవల్ల తనకూ సన్నిహితమయిన



వ్యక్తిగా అనిపిస్తోంది. జీవితంలో దగా పడ్డ ఆ అభాగ్యురాలిని తలుచుకుంటే అతని కళ్లలో నీళ్ళు తిరుగుతున్నాయి.

ఆ నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ టాక్సీ ఆగింది.

స్వప్న ఒక్క ఉదుటున దిగి,లోపలికి పరుగెత్తి కృష్ణవేణి బెడ్‌రూమ్‌లోకి దారితీసింది.ఆమె పిల్లలిద్దర్నీ చెరోపక్క కూర్చోబెట్టుకుని పడుకుంది.

పిల్లల చేతులు బిగించి పట్టుకుంది. పిల్లలు బిక్కుబిక్కుమంటూ 'మమ్మీ... మమ్మీ' అంటూ ఆమెను కుదుపుతూ ఏడుస్తున్నారు.

కళ్లు లోతుకిపోయి, ముఖం పాలిపోయి,నీరసించిపోయినా ఆమె సౌందర్యం జ్వాలలా వెలుగుతూనే వుంది. ఏ చేయి తిరిగిన శిల్పి తన శక్తంతా ధార పోసి తీర్చిదిద్దినట్టుండే ఆమె సుకుమార మయిన చేతులు పటుత్వం తగ్గి వణుకుతున్నాయి. జుట్టు చెదరి ముఖంమీద పడుతున్నాయి కొన్ని ముంగురులు.

కళ్లు మూసుకుని బాధగా మూలుగుతోంది కృష్ణవేణి.

స్వప్న మరుక్షణం ఆమెను చూడగానే, తన గుండెలో అగ్నిపర్వతాలు పేలి లావా ఒళ్లంతాపాకి, ఆ వేడితనం కాల్చేస్తున్న బాధతో 'ఆంటీ' అంటూ వెళ్ళి మంచంమీద ఆమెకభిముఖంగా కూర్చుని ఆమె ముఖాన్ని తన దోసిట్లోకి తీసుకుంది. అణచిపెడుతున్న దుఃఖం కట్టలు తెంచుకుంది ఆమెలో.

స్వప్నని చూడగానే పిల్లలు వచ్చి ఆమెను చుట్టేశారు.

"ఆంటీ! మమ్మీ ఇప్పటివరకూ మాట్లాడుతూనే వుంది. అంతలోనే కళ్లు మూసుకుని పలకటంలేదు. మాకు భయం వేస్తోంది" అంది పల్లవి.

"ఆంటీ...నేను స్వప్నని. కళ్లు తెరవండి" అంది ఆమెను గట్టిగా కుదుపుతూ.

శరత్ పిల్లలిద్దర్నీ దగ్గరకు తీసుకున్నాడు.

కృష్ణవేణి తన చెంత నిల్చున్న మృత్యువు చేతిలోంచి తన శక్తినంతా కూడదీసుకోడానికి ప్రయత్నిస్తూ బరువుగా కళ్లు విప్పింది. ఎదురుగా స్వప్న దుఃఖంతో వణికిపోవటం చూసి అతికష్టం మీద లేచి దిండుకానుకుని కూర్చుంది.

ఆమె కళ్లు మూసుకుపోతున్నాయి. వళ్లు తూలిపోతున్నట్టు స్థిరంగా కూర్చోలేకపోతోంది. తల తిరుగుతున్నట్టయి ఒక్కోక్షణంలో అస్పష్టంగా కనిపిస్తున్నారు.

స్వప్నని, శరత్‌నిచూసి ఒక్కసారిగా దోసిట్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడ్చేసింది.

"ఆంటీ! ఎందుకిలా అయిపోతున్నారు...చెప్పండి" అంది స్వప్న గాభరా పడుతూ.

ఆమె కళ్లు తుడుచుకుని, "స్వప్నా! అయిపోయింది...నా జీవితం పరిసమాప్తం కాబోతోంది. భాస్కర్ చేతిలో నేను ఘోరంగా, చాలా అసహ్యంగా మోసపోయాను. దుఃఖంతో, బాధలతో తూట్లు పడ్డ నా హృదయాన్ని కాల్చేశాడు. జీవితంలో ఇంక నాకేం మిగిలింది? అందుకే విశ్రాంతి...పూర్తి విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నాను" అని ఆయాసం రావటంతో కొన్ని నిమిషాలు ఆగి,"స్వప్నా.. నువ్వు నా కోసం ఒక త్యాగం చేయగలవా?" అంది ఆమె చేతులు తన చేతిలోకి తీసుకుని.

"ఆంటీ! ఎందుకలా మాట్లాడుతు




న్నారు. మీరేం అఘాయిత్యం చేశారు చెప్పండి" అంటూ శరత్‌వైపు తిరిగి, "శరత్! డాక్టర్‌ని ... డాక్టర్‌ని తీసుకురా" అంది.

శరత్ ఒక్క పరుగున బైటికి వెళ్ళబోతోంటే తన శక్తంతా వుపయోగించి 'శరత్' అని గట్టిగా అరిచింది.

అతని అడుగుపడలేదు ముందుకి.

"శరత్! నేనెలాటి అఘాయిత్యం చేయలేదు. నా అశాంతే నన్ను పూర్తిగా బలహీనురాలిని చేసింది. కొద్దిసేపు మీరిద్దరూ నన్ను వదిలి ఎక్కడికీ వెళ్ళద్దు... ప్లీజ్" అంది వణుకుతున్న స్వరంతో.

వెంకటేశు గుడ్ల నీరు కమ్ముకుని ఒక మూల నిలబడ్డాడు. కృష్ణవేణిని చూస్తోంటే అతని హృదయం బద్దలౌతోంది.

కృష్ణవేణి స్వప్ననీ, శరత్‌నీ దగ్గరకు పిలిచి ఇద్దరి చేతులూ పట్టుకుని అంది– "స్వప్నా! మోయలేని భారమే అయినా పల్లవినీ, బాబునీ...అంటే నా ప్రాణాల్ని మీ చేతుల్లో పెడుతున్నాను. వాళ్ళని ఆదర్శవంతంగా తీర్చిదిద్దే బాధ్యత మీకప్పగిస్తున్నాను. ప్రత్యక్షంగాకానీ, పరోక్షంగాకానీ మా నీడ వాళ్ళమీద పడకూడదు. నా స్వంత ఆస్తి అంతా నీ పేరున రాశాను. ఇందులో మురళికి సంబంధించిన పైసా ఒక్కటి లేదు. నీ పిల్లలుకానీ, నా పిల్లలుకానీ ఎవరూ ఆర్థికంగా బాధపడకూడదు. అప్పుడే నా మనసుకి శాంతి. శరత్! నువ్వు...నువ్వు నా కోరికను మన్నించగలవా? లేనిపోని భారాన్ని నెత్తిమీద పెడుతున్నాననుకుంటున్నారా! మీకన్నా ఆప్తులు, హితులు నాకింకెవ్వరున్నారు? ప్లీజ్... మీకు నమస్కారం చేస్తాను. నా పిల్లల్ని మీ గుండెల్లో దాచుకోండి" అంది రెండు చేతులూ జోడించి.

అతని హృదయం తరుక్కుపోయింది. ఒక్కసారిగా ఇద్దరూ ఆమె చేతులు పట్టుకుని–"అంతమాట అనకండి...మా పంచప్రాణాలూ, సర్వమూ వాళ్ళే అయి కాపాడుకుంటాం. మీరు బాధపడకండి" అన్నారు ఏకకంఠంతో.

"స్వప్నా" అంది కృష్ణవేణి.

"ఆంటీ! మీరు విశ్రాంతి తీసుకోండి. డాక్టర్‌ని తీసుకొస్తాడు" అంది స్వప్న.

"నాకిప్పుడు చాలా ప్రశాంతంగా వుంది. మీ దగ్గర పెరిగితే నా పిల్లలు ఎలా వుంటారో వూహించుకొని మురిసిపోతున్నాను. అదే నాకు ఆనందం. వెంకటేశు మీ దగ్గరే వుంటాడు"

ఆమె కంఠం క్షీణిస్తోంది. వళ్ళంతా చెమటతో తడిసిపోతోంది. మైకంతో కళ్ళు మూసుకుపోతున్నాయి.

అప్పుడే గుమ్మంలో అడుగుపెట్టిన మురళి జరుగుతున్నదేమిటో అర్థం కాక నిశ్చేష్టుడిలా నిలబడిపోయాడు.

"స్వప్నా! భూమి, ఆకాశం, సముద్రం అన్నీ కదిలిపోతున్నాయి. అనంతంలాంటి ఏకాంతంలోకి వెళ్ళిపోతున్నాను. నా జీవితానికింక అంతా శాంతే!"

అని పిల్లల్ని దగ్గరకు తీసుకుని గుండెకు హత్తుకుని, ముద్దులతో ముంచెత్తుతూ, "వీళ్ళు... వీళ్ళు నా ప్రాణాలు. నన్ను క్షమించు. మీ చేతుల్లో పెడుతున్నాను..." ఇంకేదో చెప్పబోయిన ఆమె పెదవుల్లో చలనం స్తంభించి పక్కకు ఒరిగిపోయింది కృష్ణవేణి.

అప్పుడు...ఆ దృశ్యాన్ని చూసిన స్వప్న వేసిన కేకకి ఆకాశం, భూమి కదిలిపోయాయి.



# ప్రాచీన ప్రపంచపు వింతలు

మొదటినుంచి మానవుడు చిత్ర విచిత్రమైన వాటిని సృష్టిస్తున్నాడు. అందులో కొన్ని మానవుడి మేధాశక్తికి నిదర్శనాలుగా మిగిలిపోయాయి. ఆధునిక కాలంలోని నేటి అంతరిక్ష యాత్రల గురించి ఎంతో ఆసక్తిగా చెప్పుకుంటాము మనం. కాని ప్రాచీన కాలంనాటి కొన్ని కట్టడాలగురించి చెబితే ఆశ్చర్యపోతాము. ఈ కట్టడాలు కొన్ని శతాబ్దాల క్రితమే సృష్టించబడినాయి. ఆధునిక కాలంలో వింతలు లాగానే ఈ కట్టడాలను ప్రాచీన కాలపు ఏడు వింతలు అనేవారు. ఇవి దాదాపు 2000 సంవత్సరాల పూర్వం నాటివి.

ఈ వింతల్లో ఒకటి కోలసస్ ఆఫ్ రోడ్స్. ఇది సూర్యదేవుడైన హెలియస్ విగ్రహం. ఇది మధ్యధరా ప్రాంతంలోని ఒక ప్రముఖ ద్వీపరాజ్యంలో వుండేది. ఈ విగ్రహాన్ని ఆ ద్వీప నౌకాగమ ప్రవేశద్వారానికి రక్షణగా నిర్మించారు.

క్రీ.పూ. 280లో పూర్తి చేయబడిన ఈ విగ్రహం ఎత్తు 120 అడుగులు. బ్రహ్మాండమైన ఈ విగ్రహ తయారీకి 12 సంవత్సరాలు పట్టిందట. కాని దురదృష్టవశాత్తు చరెస్ అనే శిల్పి రూపొందించిన ఈ కళాఖండం దాన్ని ప్రతిష్ఠించిన 56 సంవత్సరాల అనంతరం భూకంపం వలన ధ్వంసమయింది. ఈ విగ్రహం నౌకాశ్రయం ప్రవేశద్వారం వద్ద ఎత్తైన పీఠంమీద కుడిచేయి ఎత్తి ఆశీర్వదిస్తున్నట్లుగా ప్రతిష్ఠించబడింది.

ఇక రెండో వింత హేంగింగ్ గార్డెన్ ఆఫ్ బాబిలోన్. గాలిలో తేలే ఉద్యానవనాలంటే అందరికీఆశ్చర్యంగాఉంటుంది. ఏ ఆధారం లేకుండా ఉద్యానవనం గాల్లో తేలడం ఏమిటా అని. మనలను ఆశ్చర్యచకితులను చేసే ఈ ఉద్యానవనం బాబిలోన్‌లో వుంది. దీన్ని క్రీ.పూ. 600 ప్రాంతంలో 'నెబంకిన్ నెజర్' అనే అతను తన భార్యల్లో ఒకరి కోసం నిర్మించాడట. ఈ ఉద్యానవనం బాబిలోన్‌తో సమతల మైదానంలో 300 అడుగుల ఎత్తున వుండి చూపరులకి కనువిందు చేస్తుంది. ఆహ్లాదాన్నిచ్చే పూలు, చెట్లతో నిండిన ఈ ఉద్యానవనం పైకప్పు ఆర్చీలతోనూ, రాళ్ళతో నిర్మింపబడిన మెట్ల వరసలకి కలపబడివుండేది. అంతస్తులుగా కట్టబడిన గట్టు చివర అందమైన పూల తీగలు వేయడంవలన అవి కిందికి




వేలాడుతూ వుండేవట. పైనుంచి కింది వరకూ అలాగే కిందకి వేలాడే రక రకాల లతలు, పూలతీగలతో నిండిన ఈ ఉద్యానవనం చూసేవారికి గాలిలో తేలుతున్నట్లు వుండేదట. మెట్లు తప్ప మిగిలిన కట్టడమంతా పూల చెట్లతో నిండి వుండేది. అందుకని దీనికి గాలిలో వేలాడే ఉద్యానవనం అనే పేరు స్థిరపడిపోయింది.

మూడోవింత దయానా దేవాలయం. ఆసియా మైనర్‌లోని 'నెమి' నదీతీరాన



వారి దేవత గౌరవార్థం నిర్మించబడింది. ఆకాలం నాటి ప్రాచీనమైన అపూర్వ శిల్పకళా సంపదనంతా ఈ దయానా దేవాలయం పొందుపర్చుకుంది. ఇది క్రీ.పూ. 300లో పూర్తిచేయబడింది. అయితే దురదృష్టవశాత్తు క్రీ.శ. 262లో గోత్స్ అనేవారిచే కొల్లగొట్టబడి, అగ్ని జ్వాలలకు ఆహుతి అయింది.ఆ అపూర్వ కళాసంపద చరిత్ర గర్భంలో దాగి పోయింది.

మరోవింత ఈజిప్షియన్ పిరమిడ్ అందరికీ తెలిసినదే. ఇది ఈజిప్ట్‌లో వున్నది ప్రాచీనకాలపు ఏడువింతలుగా నిర్ణయించబడిన వాటిలో నేటికీ నిలిచి వున్నదిదొక్కటే. ఈ పిరమిడ్ క్రీ.పూ. 2000 ప్రాంతంలో పెద్ద పెద్ద రాతి పలకలతో నిర్మింపబడింది. దీనిఎత్తు 450 అడుగులు. దీన్ని పూర్తి చేయడానికి 20 సంవత్సరాలు పట్టి వుంటుందనీ, ఒకలక్ష మంది శ్రామికులు అవసరమై వుంటారనీ నిపుణుల అంచనా. పూర్వం రాజులు, రాణులు మరణించినపుడు వారి శరీరాలను అందంగా అలంకరించి, కొన్ని లేపనాలు పూసి వస్త్రంలో చుట్టి ఒక పేటికలో వుంచేవారు. ఈ పేటికపై బ్రహ్మాండమైన పిరమిడ్స్‌ను నిర్మించేవారు. ఎన్ని సంవత్సరాలైనా పిరమిడ్స్‌లోని శవాలు పాడవకుండా యధాతథంగా వుంటాయట.




ఈ పేటికలను తెరవ ప్రయత్నించినవారు సర్వనాశనమవుతారన్న వదంతులు వున్నాయి.

ది స్టేట్యూ ఆఫ్ జ్యూస్ ప్రాచీన కాలంనాటి ఐదో వింత. గ్రీకు పురాణాల లోని ప్రధానమైన దేవుని విగ్రహం ఇది. క్రీ.పూ. ఐదవ శతాబ్దిలో మొదటి ఒలింపిక్ క్రీడలు జరిగిన ఒలింపియాలో నిర్మించారు దీన్ని. ఈ విగ్రహం ఎత్తు 40 అడుగులు. ఈ విగ్రహం ఒక దంత సింహాసనం మీద కూర్చుని వుంటుంది. విగ్రహం విలువైన రాళ్ళు పొదగబడిన బంగారు వలువను ధరించివుంది. విగ్రహం కుడి చేతిలో రెక్కలున్న ఒక దేవతా విగ్రహం, మరోచేతిలో పైన పిడివున్న ఒక కర్ర వుంటాయి.

మరోవింత ఫారోలైట్ హౌస్. ఈజిప్టులోని అలెగ్జాండ్రియాకు గల సముద్ర మార్గంలో నౌకలకు మార్గం చూపడానికిగాను దీన్ని నిర్మించారు. క్రీ.పూ. 260 శతాబ్దిలో ఈ కట్టడాన్ని పూర్తిగా పాలరాతితో నిర్మించారు. సముద్రంలో చాలా దూరాన వున్న నౌకలకు కూడా కనిపించే విధంగా 300 అడుగుల ఎత్తున ఎల్లప్పుడూ అగ్ని ప్రజ్వరిల్లుతూ వుండేది. ఈ కట్టడాన్ని ఎత్తైన బాటద్వారా భూమికి కలిపారు. రేవు చేరే నౌకలు చీకటిలో దారి తప్పకుండా ఇది ఉపయోగపడేది.

ఏడు వింతల్లో చివరిది మౌసోలస్ సమాధి. మౌసోలస్ పర్షియన్ రాజ్యాధిపతి. మౌసోలస్ మరణానంతరం అతని జ్ఞాపక చిహ్నంగా అతనిభార్య 'ఆర్టెమిషియా' క్రీ.పూ. మూడవ శతాబ్దంలో నిర్మించింది దీనిని. దీని ఉపరి భాగం దేవాలయ గోపురంలా కనిపిస్తుంది

2000 సంవత్సరాలక్రితం చరిత్రకారులు ఏడు వింతలుగా నిర్ణయించిన కట్టడాల్లో పిరమిడ్ తప్ప అన్నీ కాలగతిలో నశించిపోయాయి. వాటికి అవేసాటి అనిపించుకున్న ఈ కట్టడాల ఊహాచిత్రాలు మాత్రమే ప్రస్తుతం మనకు మిగిలిన వారసత్వ ఆస్తి. *



# అదృష్టం

రాత్రి పదకొండు గంటలయింది. వెంకట్రావ్ పడుకొన్నాడన్న మాటేగానీ అతగి ఆలోచన అంతా ఆ కితం రోజు తీసిన ఉత్తరప్రదేశ్ లాటరీ డ్రా మీదే ఉంది. ఈపాటికి లాటరీలో బహుమతులు వచ్చిన నంబర్ల జాబితా అన్ని పేపర్లలోనూ అచ్చవుతూ ఉంటుంది.

'మొదటి బహుమతి రెండుకోట్ల రూపాయలు! ఆదాయపుపన్నూ, మిగిలిన కమీషన్లూ పోయిన తర్వాత కనీసం కోటి రూపాయలయినా వస్తాయి. ఒకవేళ మొదటి బహుమతి నేను కొన్న లాటరీ టిక్కెట్ కేవస్తే...?' వళ్ళు జలదరించింది వెంకట్రావ్‌కు! బాధగా మూలిగేడు ఎందుకోగానీ!

గడియారం మూడుగంటలు కొట్టింది.

'ఉత్తరప్రదేశ్ లాటరీ ఫలితాలు ఉన్న దినపత్రికల్ని ఈపాటికి దేశం మీద వదలడానికి పార్శిలు చేస్తూ ఉంటారు' అనుకొంటూ కళ్ళు మూసుకొందామని ప్రయత్నించినా ఫలితం కన్పడలేదు వెంకట్రావ్‌కు.

గడియారం ముళ్ళు ముందుకు నడుస్తున్నకొద్దీ వెంకట్రావ్‌లో ఆదుర్దా పెరిగిపోసాగింది. అతడి కళ్ళముందు ప్రపంచం తల్లకిందులవుతున్నట్లుగా ఉంది. రెండు కోట్ల రూపాయల మొదటి బహుమతి తనకే రావచ్చేమో? వళ్ళంతా చెమటలు పట్టాయి వెంకట్రావ్‌కు! లేచి ఫాన్‌ను ఫుల్‌స్పీడ్‌లో పెట్టాడు.

ఉదయం అయిదు గంటలయింది. వెంకట్రావ్‌కు ఇక గదిలో ఉండాలన్పించలేదు. మంచంమీదనుండి లేచి పాంట్ షర్ట్ వేసుకొని బయటకు వచ్చి గదికి తాళంపెట్టాడు.

వెంకట్రావ్ గదికి రెండు ఫర్లాంగుల దూరంలో శివయ్య న్యూస్‌పేపర్ స్టాల్ ఉంది. తన ఆలోచనల్ని బలవంతాన అణగదొక్కుతూ శివయ్య కొట్టువైపు నడుస్తున్నాడు వెంకట్రావ్.

లాటరీ టిక్కెట్లు కొనడం వెంకట్రావ్‌కు హాబీలా మొదలయి, అలవాటుగా మారి, వ్యసనంలా పట్టి పీడిస్తోంది.

వెంకట్రావ్ శివయ్య కొట్టుకు చేరేటప్పటికి అక్కడ ఎవరూ లేకపోవడంతో ఓ రాతి మీద చతికిలబడ్డాడు. అయిదున్నరకు శివయ్య పేపర్ల కట్టతో సైకిల్ దిగాడు. సైకిల్ మీదనుండి పేపర్లను దింపబోతూండగానే అతడి చేతిలో రూపాయి కాగితాన్నుంచి ఓ పేపర్‌ను లాక్కున్నాడు వెంకట్రావ్. మిగిలిన చిల్లర కూడా అడక్కుండా పేపర్ లోపలి పేజీల్లో లాటరీ ఫలితాలకోసం వెతకసాగాడు. కాసేపు తంటాలుపడిన తర్వాత వెంకట్రావ్‌కు ఫలితాలు కన్పించాయి.

ఎంతో ఆత్రంగా మొదటి బహుమతి వచ్చిన నంబరు చూశాడు.

'అమ్మయ్య! నాకు రాలేదు!' స్వగతంలో అనుకున్నాడు.

రెండో బహుమతి నంబరు చూశాడు.

'నిజంగా అదృష్టవంతుణ్ని! ఇది కూడా రాలేదు!'

అలా వరసగా బహుమతులు వచ్చిన నంబర్లన్నీ చూశాడు.

ఏ బహుమతీ అతడికి రాలేదు!

వెంకట్రావ్‌కు ఇపుడెంతో హాయిగా ఉంది. మూడు రోజుల్నుండీ అతడు పడిన మనోవేదనకు తెరపడింది.

చిల్లర చేతిలో పెడ్తూ - "ఏం బాబూ! ఏమన్నా తగిలిందా?" వెంకట్రావ్‌ను అడిగాడు శివయ్య. అలా అడగడం అతడికి అలవాటే!

"రాలేదు శివయ్యా! నిజంగా నేను చాలా అదృష్టవంతుణ్ని" ఎంతో ఉత్సాహంగా ఈలవేస్తూ అన్నాడు వెంకట్రావ్.

"అదేంటిబాబూ!"

"అవును శివయ్యా! మూడు రోజుల క్రితం ఏదో హడావిడిలో పనికిరాని



కాగితం అనుకొని పొరపాటున నా ఉత్తరప్రదేశ్ లాటరీ టికెట్‌ను చింపి మురికాల్వలో పారేశాను. ఆ ముక్కలు కొట్టుకుపోయాకగానీ ఆ సంగతి తెలీ లేదు. పొరపాటున ఆ టికెట్‌కు ఏదయినా బహుమతి వస్తుందేమోనని అప్పట్నించీ బాధపడి చస్తున్నాను. ఏదయినా బహుమతి వస్తే జీవితాంతం టికెట్ చింపానని బాధపడాల్సివచ్చేది. ఇపుడా బాధ లేదు" తన గదికి బయలుదేరుతూ బదులిచ్చాడు వెంకట్రావ్.

— బదరి

# దురలవాటు

రాజు, రమేష్, ఉదయ్, శంకర్ నలుగురూ దగ్గరి స్నేహితులు. అంతా కలిసి ఒకే పెద్దవాటాలో వుంటున్నారు. వీళ్ళు బ్రహ్మచారులన్న కారణాన ముందు ఇంటాయన ఆ గది ఇవ్వటానికి నిరాకరించినా, కాళ్ళావేళ్ళాపడి బతిమిలాడిన మీదట ఎన్నోషరతులు విధించి మరీ ఆ గది యిచ్చాడు.

ఒకరోజు సాయంత్రం నలుగురూ గదిలో కూర్చుని లోకాభిరామాయణం మాట్లాడుకుంటూంటగా సంభాషణ దురలవాట్లు అనే విషయంమీదకి మళ్ళింది.

"ఒరేయ్.... మనలో అరమరికలు లేవుగదా! కనుక ఈరోజు మనం మనకున్న దురలవాట్ల గురించి మనసులు విప్పి ఫ్రాంక్‌గా చెప్పుకోవాలి. ఇది నిజంగా చాలామంచి పద్ధతి. ఏమంటారు?" అన్నాడు రమేష్.

"నాకు చాలా దురలవాట్లున్నాయి. ఎన్నని చెప్పను?" అన్నాడు శంకర్ నిట్టూరుస్తూ.

"అన్నీ చెప్పినా వినే ఓపిక మాకు లేదుగానీ ఒక్కొక్కళ్ళం ఒక్కో ముఖ్యమైనదాని గురించి చెప్పుకుందాం. ఏమంటావ్‌రా రాజూ?"

"ఊ...సరే. అయితే ముందు నేను మొదలెడతాను" అంటూ రాజు ప్రారంభించాడు

"మీరింతవరకూ కనిపెట్టలేదుగానీ నాకు డ్రింక్ అలవాటుంది. ఉదయ్‌కి తాగేవాళ్ళంటే అసహ్యంకదా. అందుకని తాగినప్పుడల్లా నోరుపరిశుభ్రంగా కడుక్కుని రెండు కిళ్ళీలు వేసుకుని మరీ రూమ్‌కి వస్తూవుంటాను. ఒకరోజు బాగా ఓవర్ డోసయిపోయింది. అలాంటప్పుడు దాచటం చాలాకష్టం. ఇక చూసుకో నా బాధ. అయినా ఆ స్థితిలో కూడా బుర్ర పనిచేస్తోంది. ఉదయ్ గుర్తుకొస్తూనే వున్నాడు. అందుకే ఆ రాత్రంతా పరమేశ్వరా మెడికల్ షాపు అరుగుమీద చలికి వణుకుతూ పడుకుని మర్నాడు వచ్చాను" అన్నాడు రాజు.

"ఓర్నీ దుంపతెగ. ఎంత ఘోరమయిన విషయం చెప్పావురా. పోనీలే ఫ్రెండువి కదా అని క్షమించేస్తున్నాను. సరే, ఇప్పుడిక నా దురలవాటు గురించి.." ఉదయ్ మొదలెట్టాడు.

"పేకాట నా ప్రాణం. మా ఆఫీసులో నలుగురం పేకాటగాయుళ్ళం కలిసి ఒక గ్రూప్‌లా ఏర్పడ్డాం. ప్రతి ఆదివారం ఒక్కొక్కళ్ళ యింట్లో ఆట! ఇంతవరకూ వందలు పోవటమే గానీ పైసా లాభం లేదు" అన్నాడు.

ఈసారి రమేష్ వంతు వచ్చింది. ముందు కొంచం సందేహించి తర్వాత చెప్పాడు.

"మీమీ జేబుల్లో అప్పుడప్పుడు పదీ పరకా మాయమవటానికి నేనే కారణం!







ఈ చేవాటం నన్ను వదలటం లేదు. మొన్న ఇంటాయనకి అద్దెయివ్వటానికి వెళ్ళినపుడు టేబుల్ మీదున్న వాచీ చల్లగా జేబులో వేసుకొచ్చాను. నాకు ఉద్యోగం దొరికేవరకూ ఈ దురలవాటే నాకు శ్రీరామరక్ష. కనుక మీరంతా నన్ను క్షమించేయాలి"

రమేష్ చెప్పింది విని నలుగురూ ఆశ్చర్యపోయారు. తర్వాత శంకర్ చెప్పాడు-తన అనంతకోటి అలవాట్లలో ఒకదాని గురించి.

"అందమయినఆడపిల్లలకి ప్రేమలేఖలు రాసే అలవాటుంది నాకు. అందుకే మన ఇంటాయన కూతురు వినోదవల్లికి కూడా రాశాను. రిప్లయి కూడా వచ్చింది. పిల్ల బుట్టలో పడుతున్నట్లుంది. ఈరోజు యింకోటి రాద్దామనుకుంటున్నాను. రేపో మాపో సినిమాలకూ్కడా..."

శంకర్ మాటలు పూర్తి కాగానే ఉన్నట్టుండి హఠాత్తుగా ఇంటాయన ధన్‌మని తలుపులు తెరుచుకుని లోపలి కొచ్చాడు. ఆయనకళ్ళునిప్పుల్లావున్నాయి. చూడండి బాబుల్లారా. నాకూ్కడా ఓ దురలవాటుంది. ఇతరుల మాటలు చాటుగా వినటం! అయితే దానివల్ల ఇప్పుడు నాకు లాభమే కలిగింది. మీకున్న వెధవ అలవాట్లన్నీ తెలుసుకోగలిగాను. నా కాంపౌండులో మీలాంటి దొంగలు, లుచ్చాకోర్లు, పేకాటరాయుళ్ళు, తాగుబోతులు వుండటానికి ససేమిరా ఒప్పుకోను. 24 గంటల్లో గది ఖాళీచెయ్యక పోయారో ప్రాణం తీస్తాను ప్రాణాలు తీయటంనా రెండో దురలవాటు. జాగ్రత్త" అని గర్జించి వెంటనే వెళ్ళిపోయాడు పులిలాగా! నలుగురు మిత్రులూ కొయ్యబారిపోయారు!

—వి. పద్మప్రియ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD /4



మధురమైన రుచులన్నీ ప్రియలోనే వున్నయ్!

priya

మీరు కోరుకొనే రకరకాల పచ్చళ్ళు మీ కందిస్తుంది-ప్రియ. మరపురాని రుచిరానుభూతులతో రూపొందినవే ప్రియ పచ్చళ్ళు. ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకువెళ్ళండి.

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETIN
PRIVATE LIMITED

ఎంతో రుచి... ఎంతో రుచి... - ప్రియ

Kiron/PF/833